'యువ' 'విజయ చిత్ర' ప్రతి నెలా చదవండి
ఏజంట్సు- సులేఖా న్యూస్ ఏజన్సీస్
చీరాల (గుంటూరు జిల్లా)

## ఒకడజను యింత చక్కని ఫోటోలు తీయండి



## ...కెమేరా కొన్న రోజునే Agfa




# క్లిక్ III

మొదలు పెట్టుటకు శ్రేష్ఠము వదలి పెట్టుట కష్టము!

- గురిపెట్టి క్లిక్ చెయ్యండి ఎక్కుపెట్టే సాధనా లేమీ లేవు ఫోకసింగు చేసే అవకాశం లేదు
- 120 సైజు రోలు ఫిల్ముమీద 12 పెద్ద (6×6 సెం మీ) ఫోటోలు తీయవచ్చు
- ఎవరెడీ కేసు పోర్ట్రెయిట్ లెన్సు యింకా ఫ్లాష్ గన్ అదనంగా కొనుక్కోవచ్చు.



కళకళలాడే ప్రింట్లకు, ఎన్లార్జిమెంట్లుకు ఆగ్ఫా ఫోటోపేపర్లు మాత్రమే వాడాలని అడగండి

ఆగ్ఫా పర్యవేక్షణ క్రింద తయారుచేయువారు: ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్ బరోడా




దేశావ్యాప్తంగా డిస్ట్రిబ్యూటర్లు:
ఆగ్ఫా-గెవర్టు ఇండియా లిమిటెడ్
బొంబాయి • న్యూఢిల్లీ • కలకత్తా మద్రాసు

# ఈ సంచికలో



ముఖచిత్రం : బంగారుకాలం

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య


యువ సాలు చందా రు. 12-00

దీపావళి ప్రత్యేకసంచికతో రు. 17-00

యువ, పోస్ట్ బాక్స్ 216, హైదరాబాద్-4.

# ఫోస్ఫోమిన్

శక్తిని పెంపొందించును.
ఆకలిని అధికము చేయును.
సహనశక్తిని
హెచ్చించును.
శరీరముయొక్క రోగనిరోధక శక్తిని
ఎక్కువ చేయును.

SQUIBB
Phosfomin
MULTIPLE GLYCEROPHOSPHATES B COMPLEX
VITAMINS ELIXIR

అవును — కుటుంబము
అంతటికి ఫోస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్ఫేట్లుగల అకుపచ్చని పండ్ల రుచిగల టానిక్

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కుకు చిహ్నం: దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

SQUIBB®

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A/67 Tel




నవంబరు సంచికలో వాన, కోనేటి
ఱం కథలు బావున్నాయి; దీపావళి కథ
ర్నీ చాల బాగున్నాయి. భోజనంకథ
డు రేపు సంసారంలో నిజంగా జరిగి
ట్లుగావుంది. భానుమతిరామక్రిష్ణ గారి
త్తగారు ఫామిలీప్లానింగ్ కథ చదువు
ున్నప్పుడు కడుపుబ్బ నవ్వించు
ున్నది. వారికి మా కృతజ్ఞతలు

మ్. మణి, జె. భారతి, హైదరాబాదు.

ఈసారి యువ దీపావళిసంచిక బ్రహ్మాండంగా ఉంది. మంచి వెరైటీకని పిస్తోంది ఏ కథ కా కథే ఎంతో రసవత్తరంగా ఉన్నాయి 'వపా'గారిబొమ్మలు ఆకర్షణీయంగా పఠాలు కట్టించుకో తగ్గవిగా ఉన్నాయి. కార్టూన్ కథలూ, కార్టూనులూగొప్ప సెలక్షన్ ముఖ్యంగా మరువాడ రాజేశ్వరరావుగారి కథ 'పుట్టిన్రోజు కానుక' ఎంతచిన్నదో అంత రసవత్తరంగాఉంది పేజీకథలు కడుపుబ్బ నవ్వించాయి. మొత్తానికి, బైండు చేసి కలకాలం లైబ్రరీలో ఉంచుకో దగ్గదిగాఉంది — యువ దీపావళిసంచిక. మీకు నా ధన్యవాదాలు.

చుండూరు శేషగిరి, విశాఖపట్నం.

ఈ నెల యువసంచికలో మీరు ప్రచురించిన హిట్లర్ పెళ్ళి, జాజిలత, శుభయోగం - మొదలైనవి బాగున్నవి. ఇంచి మంచి కథలను ప్రచురించి సమ్మానందింపజేయ కోరుచున్నాము.

ఎల్. గ్లాడ్‌స్టన్ అండ్ ఎల్. హిక్సన్,
భీమవరము.

మీరు ప్రచురించుచున్న యద్దనపూడి సులోచనారాణిగారి 'మీనా' సీరియల్ నవల ఎంతో ఉత్సాహాన్ని కలిగిస్తూంది నన్ను. ముందుముందు ఏం జరుగుతుందో అని అనుకుంటున్నాను.

మోవిరి రమణయ్య, కర్నూలు జిల్లా.

నేను ఆశించినదానికన్న ఎంతో ఆనందము ఇచ్చింది మీ నవంబరు యువ సంచిక, 'జాజిలత' అనుపమ, ఆఖరిది మొదలగు అమూల్యమైన కథలు చాల బాగున్నాయి.

పి. హెచ్. బాబురావు, వరంగల్-2.

మీరు ప్రతినెలా ప్రచురిస్తున్న వంగ నవలలు అద్భుతంగా ఉంటున్నాయి. అవే పుస్తకరూపంగా వస్తున్నందుకు చాలా సంతోషం.

కె విశ్వనాథ్, హైద్రాబాదు.

శ్రీ వేముకోటి వారి జాజిలత, మధుర గారి పరిచయపత్రం చాలా బాగున్నాయి. ఉభయులకూ నా అభినందనలు

పి. సి. పూరి,
పూరిజిల్లా, ఒరిస్సా.

# Guiding Hand

Years roll by too quickly. Before you know it, your child will turn out to be a promising youth in a few years.

Then comes the time when you have to give him a good education and put him in the path for his future career. Good education costs a good deal these days.

So, unless one is a born millionaire, one must

*SAVE TODAY FOR HAPPY TOMORROWS.*

Better SAVE through our:

FIXED DEPOSITS: **Interest upto 6⅝% p. a.**
Or
SAVING DEPOSITS: **Interest 3½% p. a.**
Or
RECURRING DEPOSITS : Ideal for salaried class.

## THE ANDHRA BANK LIMITED

**(The Bank for Friendly Service)**
***(Regd. Office: Machilipatnam - Central Office: Hyderabad)***

*Chairman*
K. Gopal Rao



# యువ

## సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 18 | డిశంబరు, 1968 | సంచిక 6


అదృష్టం అంటే "కనపడనిది" అని అసలు అర్థం. కాని, యీనాడు, అదృష్టం అంటే, తెలియకుండా, అనుకోకుండా, కలిగే మేలు అని రూఢార్థం వచ్చేసింది. అలాగే, అనుకోకుండా జరిగే కీడు దురదృష్టం అయింది. అదృష్టమైనా, దురదృష్టమైనా వచ్చి నెత్తినపడినప్పుడు ఎవరైనా అనుభవించక తప్పదు. కలిసి వచ్చిన అదృష్టాన్ని అక్కరలేదని త్రోసిపుచ్చినవాడు దురదృష్టవంతుడే అవుతాడు. అందుచేతనే, అదృష్టవంతుణ్ణి చెరిపేవారు లేరు; దురదృష్టవంతుణ్ణి బాగుచేసేవారు లేరు అనే సామెత వాడుకలోకి వచ్చింది.

అదృష్టమనేది, ముందు తెలియకుండా వచ్చేది; మనిషి ఆశించకుండా వచ్చేది; ప్రయత్నించకుండావచ్చేది. అయినా, అదృష్టం కలిసిరావాలని ప్రతి వ్యక్తీ కోరుకుంటాడు; అదృష్టంకోసం ప్రతి వ్యక్తీ వెతుకుతూ వుంటాడు; అదృష్టంకోసం ప్రతి వ్యక్తీ ప్రయత్నిస్తూవుంటాడు.

అందువల్లనే, లాటరీ అంటే ప్రజలు ఆశతో టిక్కెట్లు కొంటారు. గుర్రపు పందేలలో లక్షలాది జనులు కోట్లరూపాయలను క్రుమ్మరిస్తారు. లాటరీలలో ఉన్న మహత్తు ఏమిటంటే, గుర్రపు పందేలలోలాగనే, వసూలయిన మొత్తంలో కొంత డబ్బు కొన్ని టికెట్లకు పంచిపెట్టబడుతుంది. అలా పంచిపెట్టబడే డబ్బు నాకు

వస్తుందేమో, అనే అదృష్టకాంక్షతో ప్రతి వ్యక్తి టిక్కెట్లు కొంటాడు. నిజానికి అదృష్టం వున్నవాడికి, ఒక్క టిక్కెట్టు కొంటేనే డబ్బు రావాలి. కాని, చాలా మంది తమ అదృష్టంమీద ఉన్న విశ్వాసంకన్న, తాము కొనే టిక్కెట్ల అదృష్టం మీద ఆధారపడి ఒకటికన్న ఎక్కువగా కూడా టిక్కెట్లు కొంటారు. ఇంగ్లండులో ఒకసారి గుర్రపుపందేలలో, ఒక స్కాట్స్‌మన్ రెండుపౌనులు (పౌను, ఆరోజుల్లో పదమూడు రూపాయలు) పెట్టి, రెండు గుర్రాలపేర్లతో రెండు టిక్కెట్లు కొన్నాడట. వాడి అదృష్టం బాగుండి, ఆ రెండు గుర్రాలలో ఒక గుర్రం గెలవడమూ, పదిలక్షలపౌనుల ప్రైజు రావడమూ జరిగింది. అయినా, ఆ పెద్దమనిషి చాలా విచారంగా వున్నాడట. ఎవరో ఒక స్నేహితుడు అతన్ని, పదిలక్షలు గెలిచినా అంత విచారంగా వున్నావేమని అడిగితే, ఆ స్కాట్స్‌మన్ "రెండోటిక్కెట్టు కొని, పౌను పోగొట్టుకున్నానే అని విచారిస్తున్నాను" అని జవాబు చెప్పాడట. ఇలాటి మనస్తత్వాలు కూడా వుంటాయి. ఏమయినా, లాటరీలలో అదృష్ట దేవత ఎవరిని వరిస్తుందో, దురదృష్టదేవత ఎంతమంది నెత్తిన కూచుంటుందో చెప్పడం కష్టం.

అయితే, అదృష్టాన్ని పొందాలనే ఆశ ప్రతివ్యక్తికీ సహజం కనుక లాటరీ అనేటప్పటికీ టిక్కెట్లు కొనడానికి అందరూ ముందుకువస్తారు. మానవులకు వున్న, ఈ ఆశా ప్రకృతివల్లనే, అతిపురాతన కాలంనుంచీ, జూదం ప్రపంచవ్యాప్తిని పొందింది. నిజానికి, గుర్రపుపందేలు, లాటరీలు ఒక విధమైన జూదమే. వీటి వల్ల, కొద్దిమందికి పట్టే అదృష్టం, లక్షల ప్రజలను దురదృష్టవంతుల్ని చేస్తున్నది.

ఒకానొకప్పుడు, మన ప్రభుత్వం అన్ని రకాల జూదాలను బహిష్కరించాలని ఒక నియమం పెట్టుకొన్నది. కాని, ప్రభుత్వం పెట్టుకున్న అన్ని నియమాల లాగనే, యీ నియమంకూడా అంతర్ధానమైంది. గుర్రపుపందేలు జోరుగా సాగుతూనే వున్నాయి ఏటా కొన్ని లక్షలమంది కోట్లకొలది రూపాయలను పోగొట్టుకుంటున్నారు. ఇలాటి వారిలో చాలామంది సామాన్య కుటుంబీకులు ఎంతో మంది వున్నారు. వారంతా, ఆశకు లోబడి అప్పుచేసి జూదమాడి, దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారు కూడా.

ఇలాటి పరిస్థితులలో, రాజస్థాన్, కేరళ, మదరాసు ప్రభుత్వాధ్వర్యంలోనే లాటరీలను నడపడం ప్రారంభించారు. ఈ లాటరీలకు పూర్వం, ఒరిస్సాలో బరాబాతి రాఫిల్, కె. సి. చారిటీస్ అనే లాటరీలు జరిగేవి. ఇప్పుడు, వీటితోపాటు,

ప్రభుత్వాల లాటరీలుకూడా ప్రారంభమయాయి. ఈ లాటరీవల్ల, రాజస్థాన్, కేరళ, మదరాసు ప్రభుత్వాలు కోట్లరూపాల ఆదాయాన్ని పొందుతున్నాయి. ఈ లాటరీటిక్కెట్లు, ఆయారాష్ట్రాలలోనేకాదు, దేశంలోని అన్ని రాష్ట్రాలలోను అమ్మబడుతూవున్నాయి. అదృష్టంమీద మనిషికి వుండే ఆశను ఉపయోగించుకొని, ప్రభుత్వాలు ఆదాయాన్ని పెంపొందించుకోవడం తప్పు. మనరాజ్యాంగ విధానం ప్రకారం, కేంద్రప్రభుత్వంగాని, రాష్ట్రప్రభుత్వంగాని నడిపే లాటరీలను అనుమతించే అధికారం కేంద్రప్రభుత్వానిది. రాష్ట్రప్రభుత్వాలు లాటరీలను నడపడానికి కేంద్రప్రభుత్వం అనుమతించడం ఎంతమాత్రము సవ్యమైన పనికాదు. రెండు మూడు రాష్ట్రాలలో లాటరీలు ప్రభుత్వాల ఆధ్వర్యంలో జరుగుతున్నాయంటే, తక్కిన అన్నిరాష్ట్రాలలోని ప్రజలూ, ఆ టికెట్లుకొంటారు. అన్ని రాష్ట్రాలలోని డబ్బు, యీ రెండుమూడు రాష్ట్రాలకు చేరుకుంటుంది. జూదాన్ని ఆమోదించి, లాటరీలను నడపడం ఏ రాష్ట్రానికైనా తప్పనిసరి అయితే, ఆ రాష్ట్రపు లాటరీ టిక్కెట్లను అమ్మడం ఆ రాష్ట్రానికే పరిమితమయి వుండాలి. అలా జరగడానికి వీలులేదని, ఒకరాష్ట్రంలో అమ్మడం న్యాయమేననీ, ఈ మధ్య హైకోర్టు తీర్పు ఇచ్చింది. అందుచేత, ప్రస్తుతం లాటరీలను నడుపుతున్న రాజస్తాన్, కేరళ, మదరాసు రాష్ట్రాలు, దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ టిక్కెట్లు అమ్మి కోట్లకొలది రూపాయలను ప్రోగుచేసుకుంటున్నాయి. దీనివల్ల, ఆంధ్రరాష్ట్రంనుంచి కోట్ల కొలదిగా డబ్బు ఇతర రాష్ట్రాలకు పోతున్నదనే మాట స్పష్టం.

ఇలా జరగకుండా చెయ్యాలంటే, ఒకే ఒకదారి కనబడుతున్నది; ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా వెంటనే ప్రభుత్వాధ్వర్యంలో లాటరీలను నడపడం ప్రారంభించాలి. లేకపోతే, ఒకటి రెండేళ్ళలో పాతిక ముప్పయికోట్ల రూపాయల రొక్కం ఆంధ్రప్రదేశ్‌నుంచి బయటికి పోతుంది. ఇంత రొక్కం రాష్ట్రనుంచి బయిటికి పోతున్నదంటే, ఆంతవరకు రాష్ట్రంలోని ప్రజల ఆర్థికస్తోమత తగ్గిపోతుందన్నమాట.

దేశంలోని ఏ రాష్ట్రంలోనూ లాటరీలు నడపకుండా చేయవలసిందని, ఆంధ్ర ప్రభుత్వమూ, లాటరీలు లేని తక్కిన రాష్ట్రాల ప్రభుత్వాలూ కేంద్ర ప్రభుత్వాన్ని ఒత్తిడిచేయాలి. అది ఫలించని పక్షంలో, ఆంధ్రప్రదేశ్‌లోకూడా లాటరీలను నడపడం రాష్ట్ర ప్రభుత్వం ప్రారంభించాలి. లేకపోతే, రాష్ట్రంలో డబ్బు కోట్ల కొలదీ ఇతర రాష్ట్రాలకు పోతుంది.

---

# చిత్రవార్తలు



పండిట్ నెహ్రూ ప్రపంచశాంతికి జీవితాన్ని అంకితంచేసిన మహనీయుడు, శాంతికి చిహ్నంగా తెల్లటిపావురాన్ని ఎగురవేస్తున్నాడు.



అజాద్ హింద్ ప్రభుత్వపు 25 వ వార్షికోత్సవ సందర్భంలో, ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ఢిల్లీ ఎర్రకోటలో ఏర్పాటయిన కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.

మహాత్మాగాంధీ పండిత్ నెహ్రూకు ఆధ్యాత్మికంగా రాజకీయాల్లో గురువు. తరుచు యిరువురూ సంభాషించేవారు. అలాంటి సంభాషణలో ఒకటి.

---

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ఇటీవల ట్రినిడాడ్, టొబాగో సందర్శించినప్పుడు ఆమె గౌరవార్థం యేర్పరచిన సాంస్కృతిక విన్యాస ప్రదర్శనాన్ని తిలకించిన దృశ్యం.



# గదిలో వసంతం

మురళీధర్

ఝుమ్మున వసంతం వచ్చినట్లుగా గదిలోకి దూసుకువచ్చింది వసంత. మండుటెండలో వానజల్లులాగా, చిలిపి చూపులతో దోచుకునే తియ్యని అమ్మాయి మనసులాగ, అప్పుడే 'ఫ్లవర్ వాజ్' లోకి వచ్చి తొంగిచూసి పలకరించే ఎర్రగులాబీ లాగ, మరీమరీ సుగంధాన్ని చిమ్మే వగడపువ్వులాగ, విచ్చుకునీ విచ్చుకోని మల్లెపువ్వులాగ.

వసంత వస్తూందంటే అదేదోలా ఉంటుంది మత్తుగా, గమ్మత్తుగా. 'నైట్ క్వీన్' పూలమత్తులాంటి దేదో ఉండి ఉండాలి. అదేదోకూనిరాగం తీసుకుంటూ గమ్మత్తుగా గదిలోకి వచ్చేసిందివసంత.

వసంత వస్తుందని ముందుగా తెలిసి ఉంటే_ నిజంగా ఎంతబాగుండును? వసంతం వస్తుందని మనకు ముందే తెలిసినా, మనం కాచుకుని కూర్చుంటున్నాము గనకనా? మన గొడవలో మనం మునిగి ఉన్నప్పుడు ఏ మూల నుంచో కోయిలకూస్తే ఒక్కసారి ఎంత హాయిగా ఉంటుందని ప్రాణానికి? ఇంట్లో తెచ్చిపెట్టుకుంటేనో? మామిడి చివుళ్ళతోబాటు కుహూకుహూ రవాన్ని కూడా అక్కడే వదిలేసి వచ్చిందని మనకు తెలుసా?

పరవళ్లుతొక్కే జలపాతం లోకానికి విద్యుత్తుని యిస్తుందిగాని పెరట్లోకి రమ్మంటే వస్తుందా?

వసంతకూడా అంతే ననుకున్నాను. అయినా సరూకి వసంతనుగూర్చి చెప్ప టమేపని, 'మరి వసంత పాడిందంటేనే' 'మరి వసంత నవ్విందంటేనే', 'నిజంగా వసంత ఎంతబాగుంటుం దనుకున్నావు' 'నువ్వు సరిగ్గాచూడలే దనుకుంట వసంతని.'

ఇదీవరస

విసుగొచ్చి అన్నాను సరూతో– 'మీ వసంత ఎవరోగాని, తీసుకొస్తే ఒక సారి తీసుకొచ్చి పరిచయం అయినా చెయ్యి; లేకపోతే చెప్పటం అయినా మానెయ్యి ఆ అమ్మాయినిగూర్చి' అని.

'ఎందుకురా అన్నాయ్ అంత యిది నీకు. వసంత నీ దగ్గరకు వచ్చి మాట్లాడలేదనేగా ?'

'అదికాదు సరూ.'

'ఏది అవునో చెప్పరా.'

సరూ, వసంత – యిద్దరూ ఫైనల్ ఆనర్స్‌లో ఉన్నారు. నేను యింకా లిట్రేచర్‌లోరి సెర్చివెలగబెడుతున్నాను. ఒకఏడాది అయిపోయింది. మరోఏడు కనీసం పడుతుంది– పూర్తి అయ్యేసరికి. డిగ్రీపుచ్చుకుని ఏ లెక్చరర్ ఉద్యోగమో వచ్చేసరికి మరోఏడు పడుతుంది. 'ఏమిటో' అనిపించింది తలుచుకుంటే.

మరో వారంరోజుల తర్వాత వసంత మా యింటికివచ్చింది. వసంత వచ్చే సరికి నేను నాగదిలో పుస్తకాల్లో మునిగి ఉన్నా.

మళ్ళా అదేవసంతం. నిశ్చలంగా ఉన్న ప్రకృతి ఒక్కసారిగా ఝుమ్మని ఊగిపోయింది. పుస్తకంలో పేజీలో ప్రతిఅక్షరం ఏదో మత్తుగా, గమ్మత్తుగా.

ఒక్కసారి పుస్తకం పక్కకుపెట్టి చూశాను. వసంత;

'నమస్కారమండి'

'హలో.'

'వసంత' అంది సరూ.

'అవును' అన్నాను.

'మీ కెలాతెలుసు.'

'అ...అవును...తెలుసు ..'

'మీరు ఒకొళ్ళనొకరు పరిచయ మేనా ఏమిటి ? మర్చిపోయా; అంతకు ముందు ఒకసారి వచ్చిందిగా యిక్కడికి?'

'ఉహూ'

'ఏమిటిరా అన్నిటికీ 'ఊ' 'ఉహూ' అంటావు' అంది సరూ.

వసంత గదిలో పుస్తకాలపైపై అదే పనిగా చూస్తోంది.

'మీరు థీసిస్ ఎప్పుడు 'సబ్‌మిట్' చేస్తున్నారు ?'

'ఎప్పుడా– అని ఆలోచిస్తున్నాను.'

ఒక్కసారి నవ్వింది. మళ్ళా విచ్చీ విచ్చని మల్లెపూల వాసనలు విరజిమ్మి నట్లుగా అనిపించింది.'

'మీరు కాలేజీ అయిపోయిన తర్వాత ఏంచేస్తూ ఉంటారు ? మీ హాబీఏమిటి?'

'కాలేజీ అయిపోవట మంటూ ఉంటేగా ?'




'అవును, వసంతకు తీరికెక్కడ? పార్టీ మీదపార్టీ'. వసంతకు కోపం వచ్చినట్లుగా చూసింది సరూవైపు.

'మీకు కోపంగూడా వస్తుందన్నమాట.'

వసంత ఒక్కచూపు విసిరింది నావైపు మల్లెచెండులాగ. ఒక్కొక్కళ్ళ మాటలో సంగీతం, నవ్వులో సౌరభం, నడకలో ఒక పొగరుమోతుతనం లాంటి కొంటెదనం, కొట్టొచ్చే చూపు ల్లోంచి దూసుకువస్తూ మాటలకు అందని మరోమరో చక్కని చిక్కని ఊహ కన్న మధురంగా, ఒకప్పుడు గాలికన్న తేలికగా, నిశ్శబ్దాన్ని చీల్చుకుని వచ్చే వలపు పిలుపులాగ.

వెళ్ళిపోయింది వసంత వచ్చినట్లుగానే ఒక్కసారి మల్లెలు వాడిపోయాయి. హాయి వీస్తూ, ఒంటికి మెత్తగా తగులుతూన్న గాలి ఆగిపోయింది. సంగీతపు గొంతును ఎవరో నొక్కేశారు. నిండుగా ఉన్నగది ఒక్క సారిగా బోసిగా అయిపోయింది.

అవాళ మర్నాడు. రోజు మరోరోజు.

మరోరోజు లైబ్రరీదగ్గర కనిపించింది. మళ్ళీ అదేనవ్వు. అవును నవ్వంటే అదే- అలా నవ్వలేనివాళ్ళు నవ్వకూడదు ఎప్పుడూ.

ఇద్దరంకలిసి కాఫీతాగి కబుర్లుచెప్పుకున్నాము. వసంత ఏమాత్రం వెనకంజ వెయ్యకుండా కులాసాగా కబుర్లుచెప్పింది. అవాళ యింటికివచ్చి చూస్తే గది అంతా ఏదో కొత్తగాఉంది. ఏమూలనుంచో

మల్లెపూలవాసన. మత్తెక్కించే ఏదో సౌరభం.

సరూ ఏదో పసికట్టిన దానికిమల్లే 'ఏరా అబ్బాయ్, మహా ఉషారుగా వున్నావు, వసంత కనిపించిందా ?'

'ఇంక నాకు వేరేపని ఏమీలేనట్లు.'

'ఉన్నట్లు.'

సరూకు ఏమి సమాధానం చెప్పాలో తోచలేదు; ఒక్కకసురు కసిరాను. అది కసురులాగ కనిపించలేదు. మరీమరీ నవ్వుతూ వెళ్ళిపోయింది.

మరో ఏడాది గడచిపోయింది. పరీక్షలు అయిపోయాయి- వసంతకీ సరూకూను. యిద్దరికీ "ఫస్టుక్లాస్" వస్తుందని అనుకున్నారు.

వసంత మరో మూడు రోజుల్లో విశాఖపట్టణం వదిలిపెట్టి కాకినాడ వెళ్ళిపోతుంది. అవాళ సాయంత్రం వసంత కలిసింది. కాఫీ తాగుతూన్నప్పుడు అన్నాను.

"మీరు యింతకీ కాకినాడ వెళ్ళిపోవటం ఏమీ బాగోలేదు,"

"మరి ఏం చెయ్యాలంటారు."

"ఇక్కడే ఉండిపొమ్మంటాను."

"పోనీ లెండి అక్కడితో ఆగారు."

వసంత ఎందుకో ఆ సాయంత్రం మరీమరీ మెరిసిపోతోంది. జడలో మల్లెలు తురుముకుంది. ఎఱ్ఱ గులాబీ రంగుచీర, అదేరంగు బిగుతైన 'స్లీవ్‌లెస్' జాకెట్టు వేసుకుంది. దోసగింజలాంటి తిలకం పెట్టింది. అర మోడ్పు కళ్ళూ, వాట్లల్లోంచి దొంగలాగ తొంగిచూసే చూపులూను. జాకెట్టును చీరనూ వేరుచేసే మెరిసిపోయే ఉండీలేని నడుము.

"ఏమిటి అలా చూస్తున్నారు. నేను కొత్తగా కనిపిస్తున్నానా ?"

'తలంటుకున్నారనుకుంట' అన్నాను అల్లరిగా నుదుటిమీదపడే ముంగురుల వైపు చూపిస్తూ.

'నేను తలకు అసలు మానె రాసుకోను. షాంపూ వాడతాను." మాటల్లో తను కాకినాడలో వాళ్ళ నాన్నగారి దగ్గర కొంతకాలం ఉండి తర్వాత ఏం చెయ్యవలసిందో ఆలోచిస్తానన్నది. వాళ్ళ నాన్నగారు గవర్నమెంటులో సెక్రటరీగాచేసి రిటైర్ అయిన తర్వాత కాకినాడలో యిల్లుకట్టుకుని అక్కడ ఉన్నారట. ఆయనకు వసంత ఒక్కతే సంతానం. తల్లి జబ్బు మనిషట. వాళ్ళ దగ్గర బంధువుల్లో ఒకతను మెడిసెన్ రిసెర్చి చేస్తున్నాడట మద్రాస్‌లో. తనకి యితర దేశాలు చూద్దామని ఉందని చెప్పింది. సరదాగా దేశాలు తిరుగుతూ అనుభవాలు రాస్తూ గడపటం ఎంత బాగుంటుందని అడిగింది.

నిజమే నన్నాను.

'మీరు చాలా మంచివారు' అంది వసంత.



"నువ్వు ఒట్టి చవటవి" అన్నట్లు వినిపించింది నాకు.

"మీరు కాకినాడవస్తే తప్పకుండా మా యింటికి రండి," అంది వసంత.

"నీ ముఖం చూపించినా చూపించక పోయినా పెద్ద నష్టమేమీలేదు" అన్నట్లు వినిపించింది, వసంత వెడుతూ వెడుతూ అంది.

"మీరు నిజంగా ఉండిపొమ్మంటారేమో ననుకున్నాను చెప్పొద్దూ?"

"అంతే."

"మీరు అన్నమాటలు ఏదో మొగమాటానికి అన్నట్లు ఉన్నాయి కాని..."

"మీకు నేను అర్థం కాలేదన్నమాట- అయితే."

"అది చాలా పెద్దమాట కదూ?"

"మనకి ఉన్న కొద్దిపాటి పరిచయంతో అంతపెద్దమాట వాడకూడదంటారు- అవునా?"

"అది కాదు నా ఉద్దేశ్యం"

"మీరంటే నాకు ఏ అభిప్రాయం ఉందో..."

"అదే అభిప్రాయం ఉండనివ్వండి"

వసంత నన్నుగురించి ఏమనుకుంటోందోనని ఆలోచించే వ్యవధి ఇయ్యలేదు. ఇద్దరం ఆ యింటికి వచ్చేశాం; వసంత కాకినాడ వెళ్ళిపోయింది. సరూ వసంతా యిద్దరూ సెకండ్‌క్లాస్‌లో ప్యాస్ అయ్యారు. సరూ కాలేజీలో లెక్చరర్ అయింది. నేను "థీసిస్" సబ్‌మిట్ చేశాను. నాకూ్కడా ఓ "లెక్చరర్" ఉద్యోగానికి హైద్రాబాదులో ఓ కాలేజీ నుంచి పిలుపు వచ్చింది. గిరుకు్కన ఏడాది తిరిగేసరికి నాకు డాక్టరేట్ రావటం, అమ్మా, నాన్నా నా పెళ్ళి కోసం కంగారు పడటమూ జరిగింది. చెల్లాయి పెళ్ళిముందర చెయ్యమన్నాను. సరూ యిప్పుడిప్పుడే చేసుకోనన్నది. ఆడపిల్లే చేసుకోకపోతే మగవాడికి నాకు తొందరేమిటని నేనూ పట్టుపట్టాను.

హైద్రాబాద్‌లో ఆర్ట్సుకాలేజీలో ఇంగ్లీష్ లెక్చరర్‌గా చేరాను. అనుకోకుండా ఒక రోజు రాత్రి 'ప్లాజా'లో వసంత కలిసింది. పక్కనే వాళ్ళనాన్నగారు ఉన్నారు, పరిచయం చేసింది.

వసంత వాళ్ళ చిన్ననాన్నగారు ఒక కెమికల్ కంపెనీకి మానేజింగ్ డైరెక్టరుగా ఉంటున్నారట. హిమాయత్ నగర్‌లో ఉంటున్నారట. సరదాగా ఒక నెల రోజులు గడిపి పోదామని వచ్చారట వీళ్ళు. 'మా యింటికి రావోయ్ ఒకసారి. వసంత నిన్నుగూర్చి చాలా చెప్పింది. మీ చెల్లాయీ, వసంతా బాగా ఫ్రెండ్సటగా.'

అవునని తల ఊపాను. నేను ఏమీ కానా వసంతకు? ఎంత పెంకెతనం? అవును ఏమిటి తను నిజానికి?

నేను నారాయణగూడాలో మరో ఫ్రెండ్‌తోకలిసి రూమ్‌లో ఉంటున్నాను. కాలేజీ అయితే బాగానే ఉంది. అంతా కొత్త. అయినా ఏదో సరదాగా ఉంది. వారానికోసారి ఉత్తరం రాస్తోంది సరూ. యూనివర్సిటీ వదలిపెట్టి జీవితంలో- అంటే మళ్ళీ మరో యూనివర్సిటీలో చేరాను. అయినా ప్రతి వాళ్ళూ మీ ప్రొఫెసరూ, మీ హెడ్డూ మాప్రొఫెసరూ మీ గైడూ...యిదేవరస, లేకపోతే యింకా లోలోపల గిరిగీసుకుని ముసుకులోకి వెళ్ళిపోయినట్లున్న మనుషులు, నెక్‌టై, సూటు ఊడదీస్తే, అస్థిపంజరం కనిపించినట్లు, యింక వీళ్ళ జీవితంలో ఏమీలేదా? వీళ్ళందర్నీ రేపొద్దున్నుంచీ కాలేజీకి రావద్దంటే ఏం




చేస్తారు ? కొందరికి గుండెఆగిపోవచ్చు. మరి కొందరికి పిచ్చెక్కవచ్చు. మిగతావాళ్ళకి బ్లడ్ ప్రషర్ ఒక్కసారి ఎక్కువకావచ్చు. ఇన్ని కబుర్లు చెప్పే వీళ్ళ బతుకులో ఎంత ఖాళీ? ఇది తెలుసు కుంటే ఎంత వినోదంగా ఉందని?

మళ్ళా వారం రోజులకి 'ప్లాజా'లోనే కనిపించింది వసంత. వెంట వాళ్ళ నాన్నగారు లేరు యీసారి. సినిమా అయిన తర్వాత యిద్దరం కలిసి కాఫీ తాగాం— దగ్గర రిష్టారెంట్ లో.

వసంత ఎప్పటిలాగే చలాకీగా ఉంది.

"మీరు మా యింటికి వస్తానన్నారు? మహా వచ్చేవాళ్ళలాగ— యింటినంబరూ ఫోన్ నంబరు అన్నీ నోట్ చేసుకున్నారు కూడాను!"

"నేను రానని ఎందుకు అనుకుంటున్నారు?'

'అవుననుకొండి. నేను వెళ్ళేలోగా వస్తారేమోనని.'

'అంతే!'

'అంత ఆశ్చర్య పడ్డారేమిటి ఒక్కసారి?'

అవును. ఎందుకు అంత గాభరా పడేంత పని చేశాము? వసంత వెళ్ళిపోతేనేం? విశాఖ వదిలిపెట్టింతరవాత మళ్ళా కలిసింది మొన్ననేగా? ఏదో ఎన్ని సంవత్సరాలో కలిసి ఉన్నవాళ్ళు

ఒక్కసారిగా విడిపోయినట్టు ఎందుకిలా అనిపించింది?

'మదరాసు వేస్తున్నాం మకాం. నాన్నగారి చిన్ననాటి స్నేహితుడు రావు గారు – ఏదో ఒక రావుగారు లెండి – మరో 'టైర్' కంపెనీకి 'టాప్ బాస్' ఏదో కాస్త వినోదం – మరో రెండు వారాలు.'

'అది గాకుండా మద్రాసులో మీ 'కజిన్' మెడిసెన్‌లో రిసెర్చి చేస్తున్నారు కదూ?'

'మీకు బాగా జ్ఞాపకమున్నాయే అన్నీను – నన్ను గూర్చి మీరింత పట్టించు కుంటారని ఎప్పుడూ అనుకోలేదే?'

'మిమ్మల్ని గూర్చి యింతగా అను కుంటున్నానని నాకుగూడా తెలియదు – మీరు చెప్పేదాకా'

'ఎంత గడుసు వారండీ నిజంగా'

'నిజంగా?'

ఎందుకో ఒక్కసారి వసంత అర మోడ్పు కళ్ళల్లోకి చూశాను. ఎంత చంచలంగా ఉన్నాయి వసంతకళ్ళు? లోపల ఏం దాక్కుందో చూద్దామని, లో లోపలే ననుభవించి ఎన్నటికో ద్రవించిన 'అయిస్‌బర్గ్'లాంటి హృదయానికి భాషనుకూర్చలేని దేదో, ఏదేదో ఉంది. అవును నిజంగా వసంత... 'ఏమిటి ఒక్కసారి ఏదో లోకంలోకి వెళ్ళిపోయిన వాళ్ళకుమల్లే...'

'అలాగే అనిపిస్తోంది నాకు యివాళ నిజంగా' తేనెతుట్టెను ఎవరో కసిగా రాయితో కొట్టినప్పుడు చెదిరిన తేనె టీగల 'రొద'లాగ ఉంది వసంత నవ్వు.

'మీరు నన్నడుగుతే యీ ఉద్యోగం మానేసి ఏ తెలుగుసినిమాకో మాటలూ పాటలూ రాసుకోవటం మంచిదనుకుంట'.

ఇంక ఏమనాలో తోచలేదు. వెడుతూ వెడుతూ అంది వసంత – 'సరూకి కాలేజీ ఉద్యోగం బాగా నచ్చిందట – మరిమీకో.. అయినా ఎవరి అభిరుచి వాళ్ళది. మర్చి పోయా – మీరు వచ్చేముందు కాస్త శ్రమ తీసుకుని 'రింగప్' చెయ్యండి. ఫోన్ నంబరు మీ దగ్గర ఉందిగా? నాన్నగారు మీరు వస్తారేమోనని చూస్తున్నారు.'

'ఓ తప్పకుండా. రేపు సాయంత్రం వచ్చేముందర 'రింగప్' చేస్తాను.'

రూమ్‌కి వచ్చేసరికి సరూ ఉత్తరం ఉంది. వసంత చెప్పినట్లు సరూకి కాలేజీ జీవితం నచ్చింది. అందులో యిమిడి పోయింది. తను యిటూ అటూకాకుండా ఉన్నాడు. వసంతకు యివేవీ పట్టవు అసలు. అంతా అదో సరదా.

ఉత్తరం చదివాను.

'ఒరేయ్,

నువ్వు చాలా అమాయకుడివిరా? వసంత కలిసిందని రాశావు. ఏమేమి టో నీ మురిపెం, నువ్వూను. వసంత నాక్కావలసిన స్నేహితురాలు.

నా స్నేహితురాలి మనస్తత్వం నాకు తెలిసినంతగా మరెవ్వరికి తెలియదని గర్వంగా చెప్పగలను.




వసంతకి జీవితం ఒక పెద్దసరదా. మనుషులంతా వినోదానికి సామగ్రి, సరంజామాను. నువ్వు వసంతనుగూర్చి ఏమేమి అనుకుంటున్నావో నాకు ఓ రకంగా తెలుసు. కాని ఒక్క విషయం నీతో చెప్పాలని ఉంది. అయినా నీకు నేను చెప్పేదేమిటి? చనువుతో రాశానంతే. నువ్వూ వసంతా కలిసి మాట్లాడుకున్న తర్వాత నా మాటలు పేలవంగా కనిపించవచ్చు కూడా. కాని వసంత ఏదో మాట వరసకి అంది – అప్పటికి వసంతని నీకు పరిచయం చేశానో లేదో మరి – చూస్తూ చూస్తూ కాలేజీలెక్చరర్‌నే చేసుకోవాలా ఏమిటి? ఉట్టి 'సెంటిమెంటల్ బోర్' అనుకో. అది గాకుండా వళ్ళంతా దులిపినా వంద రూపాయలు రాలవు; మరీ చప్పగా ఉంటుందనుకో, అంది.

వసంత అప్పటికీ యిప్పటికీ చాలా మారి ఉండవచ్చు. అందరం మారతాం కదా నిజానికి చూస్తే, వసంత మారిందని రాస్తే నేను ఆశ్చర్యపడను కాని మారిందా నిజంగా వసంత? రాస్తావు కదూ?

సరూ_

అంతకు ముందుదాకా ప్రతిరాత్రీ, కనీసం వారానికి ఓరాత్రయినా తియ్యని కల ఒకటివచ్చేది – కలలమీద పన్ను లేదు. బ్రతికిపోయాం – ఆరాత్రి కల మాట అలాఉంచి నిద్రకూడా పట్టలేదు. నిజంగా మొదటిసారిగా చాలా చికాకుగా. అస్తవ్యస్తంగా, అనుకోకుండా ఏదోలా..

మర్నాడు కాలేజీ ఎగ్గొట్టాను. తల నొప్పిగా ఉందని 'లీవ్' పంపాను. సాయంత్రం 'రింగప్' చేశాను– వసంతా వాళ్ళ నాన్నగారు ఉన్నచోటికి. ఇంట్లో పనిమనిషి ఫోన్ తీసుకుని వాళ్ళంతా ఉద

యమే బయటికి వెళ్ళారనీ మరోగంటకి గాని రారని నన్ను వచ్చేసెయ్యమని చెప్పారని చెప్పాడు.

విసుగొచ్చింది. ఏమిటి వాళ్ళఉద్దేశం? నన్నురమ్మని వాళ్ళు బయటకు వెళ్ళటం లోనూ వాళ్ళు వచ్చేదాకా నన్ను కాపలా కాస్తూ ఉండమనటంలోనూ ఉద్దేశ్యం ?

అంతకోపంలోనూ హిమాయత్ నగర్ వెళ్ళాను. హాలులో కూర్చున్నాను. బాగా డబ్బున్నవాళ్ళయిళ్ళు-కాస్త చదువూ సంస్కారమూ ఉన్న వాళ్ళవి - అన్నీ యించుమించు ఒకే లాగ ఉంటాయిలాగ ఉంది చూస్తే ఈ మధ్య యిద్దరు ముగ్గురు యిళ్ళకి వెడితే యించు మించు అదేసరంజామా.

పదినిమిషాల్లో రానేవచ్చింది వసంత. 'కొంచెం ఆలస్యం అయిందోయ్. చాలా సేపయిందా వచ్చి? అమ్మాయ్ వసంతా!' అంటూ రామారావుగారు లోపలకు వెళ్ళారు. వసంత డ్రెస్‌మార్చుకుని చంగున వచ్చేసింది.

"సరూ దగ్గరనుంచి యీ మధ్య ఉత్తరమే లేదు. ఉద్యోగం మార్చిందా? పెళ్ళి అయిందా? అఫ్‌కోర్సు- అంత చెప్పకుండా చేసుకోదు- అనుకోండి. కనీసం మీరన్నా చెబుతారుగా'

'అదేమిటి విచిత్రంగా మాట్లాడుతున్నారు? మీరూ సరూ ఫ్రెండ్స్ కదూ.'

"అయితే మాత్రం? అన్నీ చెప్పాలని ఉందా? ప్రేమలోపడి ఉండవచ్చు' అని కొంచెం ఆగి నావైపు అదోలాచూసి "అదికూడా చెప్పాలంటారా" అంది కొంటెగా.

"ఎవరన్నా స్త్రీ మనసులోకి. హృదయంలోకి తొంగిచూడగలిగితే ఎంత బాగుండును?"

"ఆ 'రిసెర్చి' మొదలెట్టారేమిటి?'

"చేద్దామనే ఉంది 'రిసెర్చి' గాని 'గైడ్' దొరకటం లేదు"

"సరిగ్గా చూడాలిగాని 'గైడ్' దొరక్కపోతుంది"

ప్రతిసారి మాటల్లో ఓడిపోతూనే ఉన్నాను. వసంత గెలుస్తూనే ఉంది. ఆ సాయంత్రమూ అంతే జరిగింది.

ఆ ఆదివారం వసంత మద్రాసు వెళ్ళిపోయింది. ఈ సారి ఏదో ఖాళీగాఉంది. వసంత తనను ఎందుకు కవ్వించింది? తనను నవ్వించి, కవ్వించి వినోదకాలక్షేపం చేసి వెళ్ళిపోయింది. ఏమిటి వసంత ఉద్దేశ్యం? సరూ చెప్పింది నిజం. చూస్తూ చూస్తూ ఒక కాలేజీ లెక్చరర్ కోసం మోజుపడుతుందా వసంత? ఈ సంగతి సరూ రాసినా తనకు ఎందుకు తట్టలేదు? ప్రతి మాటలోనూ కనిపించని నిర్లక్ష్యం చూపించినప్పుడుకూడా ఎందుకు తెలుసుకోలేకపోయాను?

"దసరా పండగకి రూమ్‌లో ఉండటమేమిటి? మా యింటికి భోజనానికి రావోయ్"అని పిలిచాడు మరో లెక్చరర్ రమణారావు. రమణారావు నాకు ఆప్త




మిత్రుడేమీ కాదు. అయినా యింకొకళ్ళ సంగతుల్లో తలదూర్చడు. తన పాఠాలూ వ్యవహారం తప్ప మరే గొడవ లేదు. అందుకే పిలవంగానే 'సరే' నన్నాను.

వాళ్ళ ఇల్లు చిక్కడపల్లిలో. రమణారావు భార్య రమ స్కూల్లో టీచరుగా పనిచేస్తోంది. మరదలు శశికూడా మరో స్కూల్లో టీచరు— వీళ్ళదగ్గరే ఉంటోంది. అందరం కలిసి సరదాగా భోం చేశాం.

"మీ 'థీసిస్' దేనిమీదండీ" శశి అడిగింది,

"ఇలియట్ మీద"

"నాకూ ఇలియట్ పోయెట్రీ అంటే యిష్టం"

"ఇలియట్ కవిత్వం చాలామందికి యిష్టం కాని—అర్థం అయ్యేది మాత్రం బహు కొద్దిమందికి."

"నా కా యిబ్బంది లేదులెండి. మీరున్నారుగా; మిమ్మల్ని అడగొచ్చు."

"మీకు మా యింట్లో ఒక స్టూడెంటు" అంది రమ వెంటనే.

వాళ్ళంతా ఎంతో కలుపుకోరుతనంగా ఉన్నారు. మొదటిసారి పరిచయం అయినప్పుడే ఎంతగా కలిసిపోయారు వీళ్ళు;

ఇంచుమించు సెలవు వచ్చినప్పుడల్లా రమణారావు వాళ్ళ యింటికి వెడుతూనే ఉన్నాను. ఇంచుమించు వాళ్ళ యిల్లు ఎంత అలవాటు అయిందంటే— వాళ్ళు

గట్టిగా పిలవకపోయినా– నేను వెళ్ళటం మాని ఉండేవాణ్ణికాదు.

"ఒకసారి నాతోబాటు 'టాజ్' లో ఫోం చెయ్యాలి మీరు. నాకు యిక్కడ యిల్లంటూలేదు గనక. మీరు రానంటే."

నన్ను మాట పూర్తి చెయ్యనియ్యకుండానే "టాజ్‌లో కాదు 'చార్‌మినార్'కు రమ్మన్నా వస్తాం సరేనా' అన్నది శశి.

"అయితే యీ ఆదివారం 'గండిపేట' పిక్నిక్‌కి వెడదాం. కాని ఒక్క షరతు. మీరు యింట్లోంచి ఏమీ తీసుకురాకూడదు. నేను చూసుకుంటాను" అన్నాను.

"ఒక చిన్న 'అమెండ్‌మెంట్'. చార్‌మినార్ గండిపేటలో లేదు గనక".

శశిని మాటపూర్తి చెయ్యనియ్యకుండా అందరూ నవ్వేశారు.

మళ్ళీ అందుకుని అంది శశి "ఇంట్లో చేసిన పులిహోరా అదీ వదులుకోదల్చుకుంటే..."

"ఇంట్లో వంటంతా నువ్వే చేస్తున్నట్టు 'పోజ్' కొట్టకుమరీను" అన్నది రమ.

"అదికాదండీ..."

"ఏది అవునో చెప్పండి" అన్నాను.

"ఇప్పటికి దొరికిపోయాను" అంది శశి.

"ఒక్కసారైనా దొరక్కపోతారా" అని నే నన్నమాటకు గుచ్చిగుచ్చి చూసింది– శశి నాలోకి.

సరూ వారానికో ఉత్తరం రాస్తూనే ఉంది. మొన్నవచ్చిన ఉత్తరంలో అంతా వసంతనుగూర్చే. వసంత మద్రాసులో చాలారోజులు ఉండిపోయిందనీ, రెండు మూడునెలల్లో 'స్టేట్స్'కు వెడుతోందనీను, అంతకుముందు వసంత అన్నది జ్ఞాపకంవచ్చింది.

సరూకి శశిగూర్చి రాస్తూవచ్చాను. ఒకసారి సరూరాసింది – 'నువు ఒకప్పుడు వసంతనుగూర్చి ఎంతగానో ఆలోచించేవాడివి. ఇప్పుడు శశిని గూర్చి యించుమించు అదేరీతిగా ఆలోచిస్తున్నావు' అని.

వసంతనుగూర్చి ఆలోచించటం ఎప్పటికీ మానలేనని ఎలా చెప్పను సరూకు? ఎందుకుచెప్పాలి నిజానికి? మనసులోనిమాట చెప్పేసి బయట పడిపోవటంకన్న జరిగిందేముందిగనక?

అయినా సరూ వసంత – యిద్దరూ స్నేహితులు. వసంతనుగూర్చి తనకు చెప్పిచెప్పి పరిచయం చేసింది సరూ. అయినా వసంతనుగూర్చి యింతగాఆలోచించమనిగాని, యింతగా పదేపదే తలచుకోమనిగాని చెప్పిందా?" నేను కావాలనే పెంచుకున్నానా వసంతమీద?

వసంత తనంటే ఎంత అభిమానంగా ఉన్నట్లు కనిపించినా, అంటీ ముట్టనట్లు ఉంది నిజానికి. అయినా ఎందుకు తను వసంతనుగూర్చి యింతగా పదేపదే ఆలోచించడం?




వసంతను తలుచుకుంటే ఏదో మత్తు, ఏదో తియ్యనిఊహ, కమ్మనితలపు- ఎందుకు యిలా అనిపిస్తోంది- ప్రేమ పిచ్చిలో పడ్డవాడికిమల్లే.

వసంత తననుగూర్చి ఏమీ అనుకోక పోయినాతను వసంతనుగూర్చిఆలోచించకుండా ఉండలేకపోతున్నానని రాశాను.

సరూ మళ్ళీ ఉత్తరంలో వసంతను గూర్చి అంతగా ఆలోచించటాన్నిబట్టి చూస్తే నేను ఆ అమ్మాయిపైన ఏవేవో పిచ్చిఆశలు పెట్టుకున్నట్లు కనిపిస్తోందని రాసింది.

సరూకి సమాధానం ఏమనిరాయను ? అయినా నా మనసులో ఏముందోసరూకేం తెలుసు ? వసంతమీద ఆశలు పెట్టుకున్నా పెట్టుకోలేకపోయినా వసంతను గూర్చి అనుక్షణమూ ఏవో తెలియని కలలుకంటూనే ఉన్నాడు తమ.

మళ్ళీ ఆదివారం 'గండిపేట' పిక్నిక్‌కి వెళ్ళాం - రమణారావూ, రమా, శశీ నేనూను. పిక్నిక్‌లో నలుగురం కూర్చుని కాస్సేపు 'రమ్మీ' ఆడాం. రమణారావూ రమా ఒకపార్టీ. డబ్బుపెట్టి ఆడితేనే గాని బాగుండదుగనక డబ్బుపెట్టి ఆడా లన్నాడు రమణారావు. అయితే నేను ఆడనన్నాను, అది నా నియమానికి విరుద్ధం అన్నాను 'ఒక్కసారి మీ నియమాల్ని సడలిద్దురూ' అంది శశి.

అంత చనువుగా ఎలా అనగలిగింది శశి ? శశితో నాకు పరిచయంకలిగి ఎంత కాలం అయిందని ? ఇంత చనువుగా నాచేత అంతకుముందు చెయ్యనిపని ఎలా చేయించింది ?

పేకాటలో మేమే గెలిచాము పది రూపాయలు. పేకాటలో వచ్చినడబ్బు దాయకూడదు గనక సినిమాకి వెడదాం

రమ్మన్నాడు మర్నాడు. మాటల్లో వసంతనిగూర్చి చెప్పాను. చాలా సేపు చెప్పి ఉండాలి.

"మీకు పులిహోర, అవడలు యిష్టమటగా" అంది రమ మాటమార్చటానికా- అన్నట్లు.

"ఎవరన్నారు? అయినా మీ కెలా కెలుసు?" అన్నాను.

"ఏం, శశీ నీ కెల్లాతెలుసు చెప్పు?" అని శశివైపుచూసి శశి ఏమీ మాట్లాడక పోయేసరికి, రమణారావువైపు చూసి, చెప్పండి- మీ కెట్లాతెలుసు" అంది చమత్కారంగా రమ.

రమణారావు అన్నాడు 'అవునోయ్ నువ్వు అనలా అవాళ పులిహోరా ఆవడలు తింటే ఎంత బాగుంటుందని?"

నేను నవ్వి ఊరుకున్నాను

"ఇంతకీ మీకు యిష్టంఅవునాకాదా?" అంది కొంటెగా శశి.

"ఇష్టమేననుకోండి "

"మళ్ళీ అంత మొగమాటంఎందుకూ యీమాత్రం దానికేను?"

"దేనికైనా అయితే మొగమాట పడొచ్చంటారు- యింతకీ."

శశికి ఏమి చెప్పటానికీ సమాధానం దొరకలేదు. గమ్మత్తుగా గాలిలోకి చూసింది సీతాకోకచిలుక రెక్కలపైన రంగులనుచూసి విస్మయం పొందినదానికి మల్లే.

అనుకోకుండా ఎంతో హాయిగా గడచిపోయింది పిక్నిక్. మర్నాటు 'ఎన్ ఎఫైర్ టు రిమెంబర్' అనే యింగ్లీషుసినిమా. చూసి బయటకు వచ్చినా యింకా కారీగ్రాంట్, డిబోరా కెర్ కళ్ళల్లో తిరుగుతూనే ఉన్నారు.

"నాకు సినిమా చాలా బాగా నచ్చిందండీ" అంది శశి మర్నాడు కలిసినప్పుడు.

"మీకు ప్రేమమీద నమ్మకంఉందా?" అన్నాను అనంగానే నేను చాలా తెలివితక్కువగా మాట్లాడినట్లుగా అనిపించింది.

ఇదేమిటి ఉండిఉండి యింత చవటగా మాట్లాడేశాను- అనిపించింది. శశి ఏమనుకుంటుందో- మామూలు తెలుగు సినిమాలో హీరో హీరోయిన్‌ని అడిగినట్లుగాఉంది- అనుకోదూ?

"బలేప్రశ్న వేశారండీ? నిజంగా ఒక మేష్టార్ని మరో మేష్టారు మరీ యిదిగా...ఎందుకులెండి."

"నా ఉద్దేశ్యం అదికాదు."

"నేను అపార్థం చేసుకుంటానని మీరెందుకు అనుకుంటున్నారు? మీరు వసంతనిగూర్చి యిన్నిసార్లు చెప్పారంటే ఆ అమ్మాయి ఎవరో చాలా అదృష్టవంతురాలు అయిఉండాలి."

"మీకుమాత్రం ఏం?"

ఒక్కసారి బిక్కమన్నట్లు చూసింది శశి. ఏదో అనకూడని మాటని అనేసి తప్పించుకో జూసినట్లు చూసింది.

"ఏదో అనేశాను ఏమీ అనుకోకోకండేం? కావలసిన దానికన్న ఎక్కువ చనువు తీసుకున్నాననుకుంట."



"లేదు. నిజానికి ఆమాటలు నావి. నేను అనవలసినవి. నిజానికి వసంతని గూర్చి మీకు చాలా లెక్చరిచ్చిఉండాలి, నేను. మా సరూ వసంతాకలిసి చదువు కున్నారు అనర్చ."

నాకు తెలియకుండా అలాగే వసం తనుగూర్చి చెబుతూనే ఉన్నాను.

"సరూ యిక్కడికి ఓ వారంరోజులు సెలవుపెట్టి రాకూడదూ? సరదాగా గడప వచ్చునుగదా."

"నిజమే, చూడండి. ఇక్కడైతే నేనూ, మీరూ బావగారూ, అక్కయ్యా అందరం సెలవపెట్టి తరలివెళ్ళాలి..." అని ఆగి ఏమనుకుందో ఏమో తనలో తానే నవ్వుకుని "తను అయితే ఒక్కతే సెలవుపెడితే సరిపోతుందిగా. మీరు రాస్తారా, నేనే చొరవగా రాయనా?"

"రాయండి మీరే, మీ మాట వినొచ్చు"

రూమ్‌కి వచ్చాను. ఏదో మత్తుగా గమ్మత్తుగా కనిపించింది శశి తో పిక్నిక్‌లో ఉన్నట్లుగానే ఉంది. శశి వేసుకున్న గులాబీరంగు వాయిల్ చీర, వంటికి బిగుతుగా అంటిపెట్టుకుని వంపుల్ని మరీ మరీ కొంటెగా ... లోతైనా కళ్ళల్లోంచి దూసుకువచ్చే చూపులూ, సన్నని 'టాపరింగ్' డాన్సర్స్ వేళ్ళు...పిరుదులుదాటి నిర్లక్ష్యంగా పాకే రెండు జడలూ ... ఏ మాత్రం అహం భావం లేకుండా ఎంతో చనువుగా పలక రించే పెదిమలూ, తీర్చిదిద్దిన కను బొమ్మలూ, వంపుతిరిగిన ముక్కు ... శశి ఒక్కసారి కళ్ళల్లో మెదిలింది.

మళ్ళా వసంత కళ్ళల్లో మెదలింది. ఇప్పుడేమిటి చేస్తూ ఉంటుందో? బహుశః 'స్టేట్స్‌కి' వెళ్ళిపోయి ఉంటుంది, మెడ్రాస్‌లో అతనితో కలిసి.

అయినా వసంతని గూర్చి తను కలలుగనటమే గాని, వసంత తనను గూర్చి ఎప్పుడైనా అనుకుందా? ఏమో, తన కెలా తెలుసు? మాటలలోని నిర్ల క్ష్యం, మనసులో ఏముందో తెలుసుకో నివ్వని జాణతనం, నిజమే– తనని ఏమి తెలుసుకోనిచ్చిందని?

అయితే మరి వసంతని గూర్చి ఇన్ని సార్లు, ప్రతి క్షణం అనుకోవటానికి కారణం తన బలహీనత; శశితో ఉన్నంత చనువుగా ఎందుకు ఉండలేకపోయాను.

ఇది కేవలం నా ఊహ. వసంత నాతో కూడా చాలా చనువుగా ఉంది. యూని వర్సిటీలో చాలాసార్లు ఎంతో యిదిగా మాట్లాడింది. సరూ వసంత కలిసి చదువుకున్నారు. మరి కొంతలో కొంత నన్ను గూర్చి తెలుసు వసంతకు.

నేను వసంతా–వసంతకీ నాకూ మధ్య యింత ఆకర్షణ ఉంది. ఈ ఆకర్షణ ఎందుకు వేరే రూపం దాల్చ లేదు? ఎందుకు వసంతకి దగ్గరగారాలేక పోయాను? ఎందుకు నేనూ వసంతా మరీమరీ దగ్గరకు రాలేకపోయాం?

సరూ రాసింది నిజమేనేమో? కొంత మంది తాము కట్టుకున్న గూటిలోకి ఎవర్నీ రానివ్వరు; గూటిచుట్టూ తిరగ నిస్తారు. గూటికి మాత్రం మనస్సనే ఘూర్కా–వాడిని కాపలా పెడతారు. ఆ 'షెల్'లోకి ముడుచుకుని భద్రంగా ఉంటారు.

అంతా కేవలం వినోదం, ఒక సరదా. అవునా అంతా సరదా! కొత్తకులాసాగా మాట్లాడేవాళ్ళు మరికొంచెం దగ్గరగా వచ్చామనుకుని సంతోషపడతారు అంతే.

ఒక్కసారి గది కిటికీ తలుపు తోశాను. చల్లనిగాలి వంటికి తలిగింది. ప్రాణం లేచొచ్చింది. రేడియోలోంచి తియ్యని పాట విన్పిస్తోంది. మళ్ళీ అదే విచ్చీవిచ్చని మల్లెపూలవాసన. గదిలోకి వసంతం వచ్చినట్లయింది. గదిలో

# మూడు మేఘాల మధ్య...



ఆదిమధ్యం రమణమ్మ

"ఇంతకీ నీ అభిప్రాయమేమిటో చెప్పనేలేదు!" అన్నాడు మధుసూదన్.

"దేనిగురించి?" అన్నది సంధ్య ఏమీ ఎరగనట్లు.

"అయితే నీకు ప్రేమలో నమ్మకం లేదన్నమాట!" అన్నాడు మధుసూదన్ – సంధ్య కళ్ళల్లోకి చూస్తూ.

సంధ్య నవ్వింది. ఆ నవ్వులో అతనికి కొంటెతనం కనిపించింది.

"ఎట్లా గ్రహించావూ? అది అక్షరాలా నిజం!" అన్నది సంధ్య తడుముకోకుండా.

"పోనీ, పెళ్ళిలో అయినా నమ్మకం ఉందా?" అన్నాడు మధు, కొద్దిగా ఆశ్చర్యపడి.

"అదీలేదు" అన్నది సంధ్య సంకోచించకుండా.

మధు కళ్ళల్లో లీలగా కదిలిన నిరాశని పోగొట్టడానికి చిలిపిగా చూసింది– సంధ్య.

ఆ చిలిపిచూపులో రమ్మని కవ్విస్తాయి. ఆ చిరునవ్వులే దూరంగా పొమ్మని బెదిరిస్తాయి. సందిగ్ధంగావున్న సంధ్య స్నేహాన్ని తేల్చుకుందామంటే ఆమె మాటలు మధూని మరింత సందిగ్ధంలో పడేశాయి.

"ఒకటి చెప్పనా? యువతీయువకులు తమ పరస్పర ఆకర్షణని ప్రేమ అని ముద్దుగా పిల్చుకుంటున్నారు. ఇంతా చేసి ఆ ప్రేమ పెళ్ళివరకైనా ఆగడంలేదు. కాలుజారినా మనసు జారినా విపత్తుల్లో చిక్కుకుంటున్నారు యువతులు. ప్రేమ పేరుతో పరస్పరాకర్షణలకుతట్టుకోలేక అటు పెద్దల్ని, సంప్రదాయాల్ని, కట్నాలనీ, కాదని ఎదిరించలేక ఇరుకులో పడుతున్నారు యువకులు. ఆ మీదట యువకులు జీవితంలో రాజీపడ్డమో లేక ఆత్మహత్యలకు పాల్పడడమో కూడా జరుగుతున్నాయి. కొందరు పెద్దల్ని ఎదిరించి పెళ్ళిళ్ళూ చేసుకుంటున్నారు. తీరా పెళ్ళిచేసుకున్నాక, ప్రేమ ఇంత చచ్చుగా చప్పగా వుందేమో - అని విసుగుచెందినవాళ్ళూ లేకపోలేదు." అన్నది సంధ్య నిర్లిప్తంగా.

అంతావిని, "బాగుంది నీవ్యాఖ్యానం; మరైతే పెళ్ళిమీద ఎందుకు నమ్మకం లేదట?" అన్నాడు మధు.

"అమ్మో! అదంటే అసలేభయం. గుబ్బప్పందాల్లో నెగ్గడంలాంటిదే,' అన్నది సంధ్య.

"వివాహబంధాన్ని అమ్మాయిలు ఎంతో పవిత్రంగానూ భద్రతగానూ తలుస్తారుకదా. మరి దాన్నేమంటావు?

"నిజమే; కాని ధర్మానికి కట్టుబడి ఖర్మానికి పడ్చేవోపిక నాకు లేదు, చాలామంది వివాహఫలితాలు అలాగే ఉంటున్నాయి."

"ఇలాంటి మనస్తత్వంగలదానివి, నీకు దానిలో నమ్మకముందోలేదోఅర్థం కాకుండా ఉంది!" అన్నాడు మధు ఎటూ పాలుపోక.

స్నేహంలో మనం ఇలా స్నేహితులుగా ఉండిపోతేనే రోజులుహాయిగా వుంటాయి"

"నీమాటల కర్థంలేదు సంధ్యా! మన స్నేహాన్ని మరింత సన్నిహితం చేసుకుందామనేగా వివాహం చేసుకుందామంటూంట?"

"అవుననుకో! వివాహంముందుండే ఆశయాలు వివాహమయ్యాక అశని పాతాల్లా రంగులు మార్చుకుంటాయి. మాటవరసకు నీకు నచ్చిన చీర నేకట్టననుకో. నా ప్రేమని శంకిస్తావ్. కోపగిస్తావ్. నీకు నచ్చినచీరే కట్టమని నువ్వు పట్టుబడతావనుకో, అది నిరంకుశత్వమని నిర్ధారణచేసేస్తుంది మనసు."

"అయితే నీ మీద నీకే నమ్మకం లేదన్నమాట"

క్వశ్చన్ పేపర్లన్నీ లీక్ అయినా ఇంత తక్కువ మార్కులు తెచ్చుకున్నావేంరా!




"కాదు కాదు - దేనినీ నమ్మలేక పోతున్నాను మధూ. ఎంత ఆలోచించినా ఓ నిశ్చయానికి రాలేకపోతున్నాను." "పోనీ తొందర్లేదు: తాపీగానే ఆలోచించుకొని నీ నిర్ణయమేదో తెలియచేస్తే నే సంతోషిస్తాను." అన్నాడు మధు హతాశుడై.

* * *

అందమైన మేడమీద గదిలో అంతకంటె అందంగా నిలబడి హాయిగా గాలిపీలుస్తూ కురులార్చుకుంటోంది రోజా.

నెమ్మదిగా నిశ్శబ్దంగా నడిచివచ్చి అట్టేనిలబడిపోయిన సంధ్యను, ఒక్కసారి వెనకతిరిగి చూసింది. "తలచుకోగానే దేవత ప్రత్యక్షమయినట్టు వూడిపడ్డావ్! ఎంతవరకొచ్చింది కథ?" అన్నది రోజా, సంధ్యను కూర్చోపెడుతూ.

"అది చెప్పడానికే వచ్చా! అతను చాలాదూరం వచ్చాడు. నన్నుదగ్గరికి రమ్మంటున్నాడు. నీ సహాయమూ సలహా కావాలి."

"నా సలహా సహాయమూ నా నీకు?"

"అవునే రోజీ! నాకు దేనిమీదా నమ్మకం కుదరటంలేదు. అది నా నిస్సహాయతా బలహీనతే అను. ఇంకేదైనా

అను. మనచుట్టూ ప్రపంచంలో జరిగే గొడవలు నా మనసులో మాధుర్యాన్ని నిలవనీయడంలేదు. మనసుమార్దవాన్ని కోల్పోయి మొద్దుబారి పోతూంది భయంతో!"

"బాగుంది-సిరిరా మోకాలు అడ్డినట్లు-నీ భయాల్తో నువ్వుబెదిరి అతన్ని బెదర గొట్టేస్తావేమిటి?"

"అలా చెయ్యకూడదనే నిన్నర్థించడానికి వచ్చాను"

"అంటే?"

"అత నో పిక్నిక్ ప్రోగ్రాం వేశాడు. నువ్వు నాతోవచ్చి అతన్ని కాస్త నవ్వించి కవ్వించు. అపుడు అతని ముఖమూ, మనసూ ఏ రంగులో తేలుతాయో చూసి చెప్పు."

"బాగుంది వరస! వన్నులాగు తావా యిందులోకి?"

"చూడు నాకంటె ఎన్నో రెట్లు అందకత్తెవి. అతన్ని కాస్తపరీక్షించాలని వుంది నువ్వు కాస్తనటించాలి కాస్సేపు చెయ్యిపట్టుకున్నా సహించాలి."

"చాలా బాగుందేవ్! నాకు మాయామర్మం తెలీదు. బొత్తిగా నటించలేను. ఆ తంటాలేవో నువ్వే పడరాదా?"

"అయితే అతన్ని వేరేపెళ్ళి చేసుకోమని చెప్పేస్తాను."

"అంతపని చెయ్యకు! అలాంటి వాడు నీకు మరిదొరకడు."

"అయితే నువ్వు నాకీ సహాయం చెయ్యకతప్పదు. నీతో పాటు నేనుంటాగా! భయందేనికి? ఈ మాత్రం నాకు సహాయం చెయ్యలేవా?"

"ఇది సహాయంలాలేదు సంధ్యా? చిక్కులావుంది!"

"ఫరవాలేదు నే విప్పుతాగా!"

"సరే, చూద్దాంలే!"

"చూద్దాం - కాదు సిద్ధంగావుండు. రేపు మీ కారు మనకు వుండేలా చూడు; ఏం? వస్తా-

* * *

సంధ్యతోపాటు రోజా కారుదిగడం రెప్పవాల్చకుండా చూశాడు మధు. సంధ్య ప్రక్కనున్న అందాలరాసిని చూసి, ఆశ్చర్యసంభ్రమాలు అతని కళ్లల్లో తళుక్కుమన్నాయి. సంధ్య చిరునవ్వుతో రోజాని పరిచయంచేసింది, అనుకున్నట్టుగానే ఆటపాటలతో. దాగుడుమూతలతో, నవ్వులతో, కేరింతాలతో, హాస్యాలతో, వరాచికాలతో, పిక్నిక్ ఆనందంగా జరిగిపోయిందనే చెప్పాలి. ఈడులోవున్న యువతీ యువకులు ఇటువంటి పిక్నిక్కులలో ఏ సందర్భంలో ఏ యిద్దరు సన్నిహితులవుతారో ఎవరమూ చెప్పలేం. కొన్ని అనాలోచితంగా సంభవిస్తే, కొన్ని ముందుగా ఆలోచించుకొని జరుపుకునే



సన్నివేశాలవుతై, కొన్ని హాతాత్పరిణామాలవుతే మరికొన్ని కేవలం దైవికాలు.

ఇంటికి తిరిగొచ్చాక రోజా గుండెల్లో ఏవో భావాలు గుబాళిస్తున్నాయి. పైకికనపడే చిరాకే కనిపెట్టగలిగింది సంధ్య.

"ఏమయిందే; తల నొప్పిగా ఉందన్నావ్. ఇంతకీ పరీక్ష చేశావా లేదా?" అన్నది సంధ్య.

"ముందే చెప్పానుగా- అది నావల్లగాదని ? అన్నది రోజా.

''అయితే ఎందుకలా చికాకు పడిపోతున్నావ్ ; అతనేమైనా అసభ్యంగా ప్రవర్తించాడా ?''

"లేదు" అంది ముక్తసరిగా రోజా.

"అయితే ఈ కోపమూ తాపమూ ఏమిటి?"

"నన్ను విసిగించకు సంధ్యా! నాకేమీ తెలియదు. ఆ పరీక్షలేవో నువ్వే చేసుకో. నేనేమీ చెప్పలేను."

సంధ్య ఇంకేమీ ప్రశ్నించలేకపోయింది. కాని ఏదో జరిగేవుంటుందని మటుకు ఆమెకు లీలగా తట్టింది.

కనీసం ఆ జరిగిందైనా తెల్సుకుందామని మూడునాల్గుసార్లు రోజాయింటికి వెళ్ళివచ్చింది, కాని రోజా బయటపడలేదు; ఆమె మనసులో ఏదో బాధ గూడుకట్టుకున్నట్లు మాత్రం విశదమౌతోంది అందులో ఆమె మనసు చిక్కుకుంది. బైటికిరావడం లేదు; చప్పున రోజా మాటలు గుర్తు

కొచ్చాయి. 'చిక్కులావుంది గాని సహాయంలా లేదని'. తానా చిక్కు విప్పుతానన్నది. నిజంగా రోజా ఏదైనా చిక్కులోనే పడిందా? ఏమీ చెప్పదే? అవును- ఎలా చెబుతుంది? చెప్పదు. మధు ద్వారా ప్రయత్నించేస్తే ఫలితమౌతుందేమో? వూహారావడమే తడవుగా మధూకి ఫోనుచేసింది. సముద్రపొడ్డున సాయంకాలం కల్సుకుందామని.

కాలేజీవదిలి యివతల కొచ్చేసరికి కారులో సిద్ధంగా వున్నాడు మధు.

సంధ్య వచ్చి మామూలుగా ప్రక్కన కూర్చుంది.

"ఆ అమ్మాయి ఎవరు సంధ్యా?" అని ప్రశ్నించాడు మధు.

"నా స్నేహితురాలు. వేరే చెప్పాలా?" అన్నది సంధ్య.

"చాలా అమాయకురాలులావుంది. ఇలాంటి అమాయకులు ప్రతీవారినీ నమ్మేస్తారు. తాము నమ్మినవారికి ప్రాణాలుసహితం ధారపోస్తారు. ఇటువంటి అమాయక స్త్రీల గుండెల్లోనే మన భారతీయ స్త్రీధర్మం సురక్షితంగా పెరుగుతోందంటాను." అంటూ ఏదో చెప్పుకుపోతున్నాడు.

రోజా అంతగా ఆకర్షించుకుందా మధూని? వూవువెళ్ళి చక్కని కొమ్మనే చేరుకుంది. ఆఁ- ఏదో గుర్తుకురాగా అదిరిపడింది- సంధ్య. రోజాకూడా ఇదే స్థితిలో పడిందా? అందుకే తనతో చెప్పలేకపోతూందా? ఏమిటి దారి? రోజా ఆట్టె గుమ్మందాటని గొప్పింటి బిడ్డ. మేనరికంబావ విదేశాలనుంచి రావడమేతడవు- పెళ్ళి జరిగిపోతుంది. యీ స్థితిలో యిలా కథ అడ్డంతిరిగితే, తన గతిమాట దేముడెరుగు; తన మర్యాద దక్కదు; చాలా గొడవలు విరుచుకు పడటం తప్పదు.

తన ఆలోచనల్లో తాను మునిగి తేలుతోంది సంధ్య. మధు తన ధోరణిలో తానున్నాడు ఇద్దరూ కారు దిగేవరకు ఒకర్ని ఒకరు పట్టించుకో లేదు.

సముద్రపొడ్డున చాలాసేపు గడిపారుగాని మామూలు మాటలే దొర్లాయి. మధు ప్రవర్తనా మాటలూ తేడాగా కనిపించాయి సంధ్యకి. తను స్నేహితులుగా వుందామని కోరింది. అందుకలా వున్నాడా? లేక రోజా ఆకర్షణలో పడ్డాడా? తన నిశ్చయం చెప్పేదాకా లేచి నిగ్రహం చూపించాలనుకుంటున్నాడా? తన వెర్రికాకపోతే అతని మనసును రోజా ఆకర్షించుకుందని తెలుస్తునేవుంది.

చిక్కల్లా రోజాని ఇతనికిస్తారా? ఒక చిక్కుని విడదీద్దామని ప్రయత్నిస్తే మరిన్ని చిక్కులు వచ్చిపడతాయని తా నూహించలేకపోయింది సంధ్య.

రోజాకూడా మధూ ఆకర్షణలోపడి వుంటుందన్న వూహా వచ్చినప్పటినుంచీ




భయంతో సంకోచంతో రోజాకి దూరంగా వుండిపోతూ వచ్చింది సంధ్య.

* * *

రఘు బావ వస్తాడన్న వార్త ఎంత సంతోషాన్ని కల్గించిందో దానికితగ్గ భయాన్నీ బాధనీకూడా కల్గించింది రోజాకి.

అతగాడు రానేవచ్చాడు భోజనం చేసి మేడపైన హాయిగా నిద్రపోతు న్నాడు. అమ్మతృప్తికోసం కళకళ లాడేలాగే ముస్తాబయింది. మనసు మాత్రం కళావిహీనమై పోయింది. తల్లి పరధ్యాన్నంగా వున్న రోజీని వుద్దే శించి - "అంత సిగ్గేంటే మొద్దూ! అత నీ పాటికి లేచివుంటాడు ఈ ఫలి హారా, బొబ్బట్లూ; తీసుకువెళ్ళు'" అని వెండిపళ్ళెంనిండా సర్దియిచ్చింది.

గుండెలు నిండిన గుబులు. బరువైన అడుగులలో బావవున్నగది ప్రవేశించింది రోజా.

అప్పటికే లేచి ఆమెకోసమే అన్నట్లు ఎదురుచూస్తున్నాడు రఘు "అదేంటి రోజీ! అచ్చు సినిమాలో పెళ్ళికూతుర్లా నడుస్తున్నావ్ ? నన్ను మర్చిపోలేదు కదా?" అంటూ నవ్వాడు.

తన కాకులాసా కరువైనా నవ్వక తప్పదు, జరిగింది బావకి చెప్పకా తప్పదు. తనమనసులో రహస్యం దాగదు.ముందుగా చెప్పడమేమంచిది- పరిష్కారం బావకేవదలి.

"నే నెలామర్చిపోతాను బావా! భారతదేశంలో వున్నదాన్ని నేను. పరాయిదేశంలో వున్నవాడివి నువ్వు. నువ్వే మర్చిపోవాలి - ముందివి తిను. ఇలాంటివి తిని ఎన్నాళ్ళయిందో!'' అన్నది తెచ్చిపెటుకున్న నవ్వుతో.

"నువ్వూతిను,'' అన్నా డతను.

అట్టే ప్రతిమాలించుకోవడం ఇష్టం లేక తానూ తినడం ప్రారంభించింది రోజీ.

"ఏదో పరాకు చిత్తగిస్తున్నావు- బాగుంది," అన్నా డతను.

"అవును- అనేసింది రోజా- చటుక్కున.''

రఘు ఆశ్చర్యంగా చూశాడు- రోజా ముఖంలోకి.

తన తొందరపాటుకీ, బావమాటకీ కళ్ళనీళ్ళు తిరిగాయి రోజీకి. తలవాల్చేసుకొంది.

"విషయ మేమిటి?" అన్నాడు రఘు.

"ఇక్కడకాదు- మనం సాయంత్రం బీచ్ కిపోతాంగా? అక్కడ చెబుతాలే!" అని తప్పించుకున్నది రోజా.

"అయితే తొందరగా తయారవుతాను! అన్నాడు. ఉభయులూ మరో గంటకల్లా బీచిలో నిర్మానుష్యంగా వున్న ప్రదేశంలోకి వచ్చి కూర్చున్నారు.

ఎలా మొదలుపెట్టాలో తెలీక తికమకపడినా చివరికైనంత క్లుప్తంగా జరిగింది జరిగినట్లు చెప్పింది రోజా.

"బావా నన్ను పరీక్షించమన్నది కాని, పరీక్షకు పెట్టినట్లు అయింది, ఓడించమంది- నేనే ఓడిపోయాను. నటించమంది- నేనే నటించలేక పోయాను. మధురానుభూతిని పొందాను. నా మనసు మలినపడింది బావా! తప్పని తెల్సికూడా అదే మధురానుభూతిని కోరుతోంది మనసు. మిత్రురాలి అదృష్టాన్ని అపహరించనా, చిన్నప్పటినుంచీ నామీద పెట్టుకున్న నీ ఆశల్ని తుంచనా, అమ్మనీ, నాన్ననీ దుఃఖంలో ముంచనా, ఈ అన్యాయం నే నెల్లాచేయను? ఇంకో విషయం. మాకున్న భాగ్యమంతా మాదికాదు బావా! - నీది. నిన్నూ నీ భాగ్యాన్నీ సురక్షితంగా చూడమని అత్తయ్య నాన్న చేతుల్లో పెట్టింది. భాగ్యం మనుష్యుల్ని పెడత్రోవ పెట్టించే అవకాశ ముందని, నీకు తెలియకుండా నే నిన్నూ నీ భాగ్యాన్నీ అత్తయ్య ఆశించినట్లే సంరక్షించారు నాన్న. తన భాగ్యమైన నన్నూ, నీ భాగ్యాన్నీ ఒకేసారి నీ చేతుల్లో పెట్టా లనుకుంటున్నారు నాన్న. యిందరి ఆశలూ నే నేం చెయ్యాలి బావా? నే నేం చెయ్యాలి? మలినపడిన మనసు నీకు - నీకు - ఎలా అర్పించను? శోకావేశంతో వివశయై తన గుప్పెట్లో ముఖాన్ని దాచుకున్నది రోజా.




రోజా చెప్పేవి వింటూ నిశ్చేష్టుడే అయ్యాడు రఘు. కాని బుద్ధి చురుగ్గానే పని చేస్తోంది, మనసు శాంతినే సృష్టిస్తోంది. "రోజీ, నువ్వు చెబుతున్న విషయాలన్నీ ఆశ్చర్యంగానే ఉన్నాయి. నేను విదేశాల్లో వుండివచ్చిన వాణ్ణి. నీ మనసెవర్నో తాకిందనీ, నిన్నెవరో తాకారనీ, నువ్వు మైలపడిపోయావనీ భావించలేను. చిన్నతనంనుంచీ ఒక చోట పెరిగాం. ఆపాటి అభిమానాలు వుండే వుంటాయి. నాకు నువ్వుకావాలి- అని కాక-నీ కోరిక తీర్చడమే నా అభిలాష. పోతే ఆ అమ్మాయి విషయం ఆలోచించవల్సినదే. అయినా ఆ అమ్మాయికి అతనిమీద యింకా నమ్మకం కుదరలేదనేగా యిదంతా జరిగింది. నీ ఆశ ఫలిస్తే ఫలించవచ్చు. నాకో సారి ఆ అమ్మాయిని చూపించు. జీవితాన్ని అంత అపురూపంగా చూసుకుంటున్న ఆ అమ్మాయిని చూడాలి. మామయ్య ఉదారహృదయానికీ, దూరాలోచనకీ, చాలా కృతజ్ఞుణ్ణి. ఆ సంపద ఇకముందుకూడా మామయ్యదిగానే భావించాలన్న నాకు బాధగా వుండదు. నీకు భాగమివ్వమన్నా ఇవ్వగలను. ఆ విషయంలో నిశ్చింతగా వుండు. మనిద్దరికీ బంధుత్వముంది. అభిమానముంది ఆ బాంధవ్యాన్ని మరింత బంధించాలనుకున్నారు మనవాళ్లు అంతే; ఇందులో ప్రేమలూ భంగపాట్లూ ఏముంటాయి?" అన్నాడు రఘు.

ఎంతో అనుభవం వున్న వేదాంతిలా బావ మాట్లాడిన మాటలు విన్నాక తేలిగ్గా వూపిరి పీల్చుకుంది రోజీ. ఏమీ జవాబు చెప్పలేదుగాని, కృతజ్ఞతగా చూస్తూ ఉండిపోయింది.

"పిచ్చిరోజీ! ఎంత అమాయకురాలవు! ఎంత స్వచ్ఛమైనది నీ మనసు! యిప్పటికైనా చింత వదిలెయ్యి-పద! చీకటి పడుతోంది, యింటికిపోదాం" అని రోజీ చెయిపట్టుకు లేవదీశాడు రఘు.

* * *

రోజా కోసం లోనికిపోబోతున్న సంధ్యని, "యింట్లో ఎవరూలేరండీ," అన్న మాటలు ఆపేశాయి. ముందు హాల్లో సోఫాలో కూర్చున్న రఘుది ఆ గొంతు.

ముందుకువేసిన అడుగు వెనక్కి తీసుకుంది సంధ్య.

"మీరు రోజా బావకదూ! నమస్తే! సంధ్య వచ్చి వెళ్ళిందని చెప్పండి. ఎక్కడికి వెళ్ళింది రోజా?"

"నమస్తే! అత్తయ్యా మామయ్యా గీతోపన్యాసాలు వినడానికి వెళ్ళారు. రోజా ఎవరో మిత్రురాల్ని కల్సుకుని వస్తానని వెళ్ళింది. తను వచ్చేవరకు మిమ్మల్ని ఉండమంది. మిమ్మల్ని వెళ్ళకుండా ఆపమని, నన్నెక్కడికీ వెళ్ళనివ్వకుండా ఇక్కడ ఆపింది" అన్నాడు రఘు పేపరు ప్రక్కనపెట్టి.

రోజా చెప్పిన మాటలు అతని నోటి నుంచి హాస్యధోరణిలో వస్తుంటే చిన్నగా నవ్వుకుంది సంధ్య. సంకోచిస్తూనే నిలబడిపోయింది.

"భయపడకండి. మనం ఎంత ముందుకు పోయామనుకున్నా మన ప్రాథమికమైన భయాలూ సంకోచాలూ మనల్నింకా వదల్లేదు. పోనీ యింట్లోవద్దు. వాళ్లు వచ్చేవరకు ముందు గార్డెన్‌లో కూర్చుందాం రండి." అంటూ లేచాడతను.

అతని వెనకాలే బొమ్మలా నడిచి వెళ్ళి, కాస్త ఎడంగా ముడుచుకు కూర్చుంది సంధ్య. అతనితో ఏం మాట్లాడుతుంది? ఏం మాట్లాడాలి? ఏం మాట్లాడకపోతే ఏమనుకుంటాడో-ముఖ్యంగా రోజీ తిడుతుంది.

"విదేశాలు తిరిగొచ్చారటగా? అక్కడి వింతలు చెప్పండి వింటాను!" అన్నది సంధ్య. సంగీతసభ చేసేటపుడు గొంతు సవరించుకున్నట్లుగా సవరించుకొని.

"ఏమున్నాయి? మీ ఆడవాళ్ళంతా పత్రికల్లో తెగరాస్తున్నారుగా... దేశదేశాల గురించి వేరే చెప్పడానికేముంది?"

"అవుననుకోండి! పోనీ మగవారి దృష్టిలో మీఅభిప్రాయాలేమిటో వినాల్నుంది. చెప్పరాదా?"




"ఏముంది? ఎత్తుగా ఆకాశాన్నంటే మేడలూ అంతులేని కార్లూను."

"అది కాదండీ."

"మరేమిటి? అక్కడ అభివృద్ధినీ అభ్యుదయాన్నీ దృష్టిలో పెట్టుకుని అనవరతం తీవ్ర కృషిచేస్తారు. సాధిస్తారు. కాలం అమూల్యంగా భావిస్తారు. బిజీగా వుంటారు – ముఖ్యంగా సోమరులు కారు."

"అది కాదండీ"

"మరేమిటి? మీకు కావల్సినది సూటిగా అడగరాదూ?"

"స్త్రీ పురుషుల గురించి."

"ఓ అదా! యువతీ యువకులు స్వేచ్ఛగా తిరుగుతారు. ప్రేమించుకోవడానికి, పెళ్ళి చేసుకోడానికి చక్కని సావకాశాలు వున్నాయి అలాగే విడాకులూ ఇచ్చేసుకొంటారు. అన్నింటికీ స్వేచ్ఛ వున్నమూలంగా వంచన ద్రోహాలకు ఆట్టే సావకాశం లేదు."

"స్త్రీలెలా వుంటారు?"

"ఆకర్షణీయంగా ఆరోగ్యంగా వుంటారు."

"మిమ్మల్ని ఏ స్త్రీ అయినా ఆకర్షించుకుందా," అని అడిగేసి, చటుక్కున నాలిక కర్చుకుంది – సంధ్య.

రఘు చిత్రమైన చూపు చూసి నవ్వాడు, "ఒక్కరిద్దరు ఆకర్షించుకున్నారు కలిసే తిరిగాం. అయితే నండూరివారి యెంకిలా మాత్రం హృదయంలో హత్తుకుపోరు."

ఆశ్చర్యంతో అతనివైపు చూసింది సంధ్య. "మీరు యెంకిలాంటి వ్యక్తి అవుతే మీ కిష్టమన్నమాట?" అన్నది.

"అవును, మనసులో మరువలేని మనుష్యులూ ఆరాధనా, నా కెంతో యిష్టం."

"అయితే రోజీ ధన్యురాలే."

"ఆ సంగతి మీకే తెలియాలి!"

"అదేం? రోజా మీరు చిన్ననాటి నుంచీ ప్రేమించుకుంటున్నారు కదా, పెళ్ళి కాబోతూంది కదా!"

"మేం ప్రేమించుకోలేదు, అభిమానించుకుంటున్నమాట నిజమే, కాని ప్రేమగాథ ఏదీలేదు మా మధ్య!"

"అయితే మీ మనసు వేరుగా వుందని రోజీకి అన్యాయం చేస్తారా?" ఆవేశంగా అడిగింది.

"రోజాకి అన్యాయం చెయ్యకూడదనే నా వుద్దేశం.

"అంటే?"

"అంటే - ఏమిటో యిప్పుడే చెప్పలేను. రోజా మనసారా నన్ను కోరుతుందో లేదో తెల్సుకోవాలి."

ఆ మాట వింటూ ఘ్రాన్పడిపోయింది సంధ్య. తన అనుమానాలూ భయాలూ నిజమై పోవుకదా? తనా నిజాన్ని యిప్పుడు వినేస్థితిలో లేదు. మాట మార్చడానికి ప్రయత్నించింది.

"మీరు నాతో చెప్పిన కొన్ని విషయాలు రోజీకి చెప్పకండి దాని మనసు గాయపడ్డమేగాక మిమ్మల్ని పెళ్ళాడదు," చిలిపిగా అంది చిన్నగా నవ్వుతూ.

"మా మధ్య రహస్యాలు లేవు. పెళ్ళాడకపోతే ఫరవాలేదులెండి. మరొకర్ని చేసుకుంటాను! ఏం పోయిందీ?" అన్నాడు రఘు నిర్లిప్త భావంతో

అదిరిపడింది సంధ్య!

"ఆఁ! అంత తేలిగ్గా రోజాని రోజా భాగ్యాన్ని వదులుకుంటారా? చిన్నతనంనుంచీ కలిసిమెలసి ఒకర్ని ఒకరు బాగా అర్థం చేసుకున్నట్లు వుంటుందా పరాయివార్ని చేసుకుంటే? ఫలితాలు ఎలావుంటాయో, ఆలోచించుకున్నారా?" అన్నది.

"అవసరమైతే, విషయాన్ని తేలిగ్గానే తీసుకుంటాను. చిన్నతనం నుంచీ అర్థం చేసుకుని అభిమానించుకున్న మాటనిజమే - పరాయివారి ఆకర్షణ యింకా బలంగానూ యింకా అందంగానూ ఉండొచ్చుకదా!" అన్నాడు రఘు.

"సరిగా ఏమీతెలియకుండా చేసుకునే వివాహంమీద మీకు విశ్వాసముందా?" అన్నది సంధ్య ఆశ్చర్యంతో!

"వుంది."

"కారణం?"

"నేను పురుషుణ్ణి! సాధారణంగా మనదేశంలో స్త్రీలు తమ జీవితకోమల



పుష్పాన్ని, పెళ్ళి కాగానే భర్తపాదాల చెంత విడుస్తారు. ఆ పుష్పాన్ని అలా కాలిక్రింద నలిగిపోయే పరిస్థితిని తప్పించి, దాన్ని సుతారంగా లేవనెత్తి హృదయానికి హత్తుకుంటే, దాని మెత్తదనం, గుండెల్లోని తీయ్యదనం, రేకులలోని సువాసనా, తప్పక ఆనందం కలిగిస్తాయి. అలా చెయ్యగలననే నమ్మకం వుంది నాకు. రోజా ఒక్కటే పువ్వా? మల్లి వుంది, మాలతి వుంది, పారిజాతం వుంది, బోగడవుంది. వీటిలో వేటికవే గొప్పవి కావా?"

అతనిమాటలు మంత్రముగ్ధలా వింటూ వుండిపోయింది సంధ్య.

"బాగా చీకటిపడింది. ఇంకా రోజీ రాలేదు; మళ్ళీ కలుస్తానని చెప్పండి" అని లేచిందామె. గబగబా అడుగులు వేసి గేటుదాటి రిక్షా పిలిచి ఎక్కింది, గుండెల బరువు దించుకుని తేలిగ్గా ఊపిరిపీల్చుకుంది. చిత్రమైన మనిషి; స్వచ్ఛంగా మాట్లాడుతున్నా అతని

చిత్తం అంతుచిక్కడం లేదు. మొత్తం మీద రోజాకీ అతనికీ మనసులు వేర యాయి. దానికి కారణం తనే అయితే ఆ దారుణం తను ఓర్చుకోలేదు. ఆలో చించడానికే భయంగా వుండి మనసును మరోవైపుకు త్రిప్పుకోడానికి ప్రయ త్నించసాగింది సంధ్య.

*　　　*　　　*

ఆసాయంకాలం తెల్లటి నురుగులు క్రక్కుతూ సముద్ర కెరటాలు గుఱ్ఱాల్లా పరుగులుతీస్తున్నాయి. మధు మౌనంగా తలవాల్చి కూర్చున్నాడు.

ఈ చిక్కుసమస్య తానే తెచ్చి పెట్టింది. ఇది తానే పరిష్కరించాలి. మరెవరివల్లా ఈ పని అయేటట్లులేదు. అని మనసులో ఒక నిశ్చయానికి వచ్చిన సంధ్య తలఎత్తి అన్నది "మధూ నీ మనసు రోజాని కోరుతుందికదూ. శ్రమపడి నువ్వు నిజం చెప్పక్కరలేదు. నేనే వూహించుకుంటాను. కాని అబద్ధం చెప్పడానికి మాత్రం ప్రయత్నించకు."

అదిరిపడ్డాడు మధు. ఎదురుగా చూశాడు. మళ్ళీ తలవంచి క్షణం ఆలోచనలలో మునిగాడు. సంధ్య చేతిని తన చేతిలోకి మృదువుగా తీసు కుని అన్నాడు. "సంధ్యా! రోజా నా మనసును ప్రలోభపెట్టినమాట నిజమే కాని, ఆ కారణంగా నిన్ను అన్యాయం చెయ్యను. నా నిశ్చయాన్ని మార్చుకో వాల్సిన పరిస్థితి రాలేదు."

సంధ్య నవ్వింది. "మధూ! మొదటి నుంచీ నిన్ను నా మిత్రుడుగానే భావి స్తున్నాను. ఇందులో నాకన్యాయం ఏముంది? ప్రేమఅన్నా, పెళ్ళన్నా భయం నాకు. అదీ ఒకందుకు మంచిదే అయింది. ఒక మిత్రునికోరిక మన్నించ లేనా? ఏపాటి వీలున్నా తీర్చడానికి ప్రయత్నిస్తాను." అంటూ లేచి నించుంది.

"వద్దుసంధ్యా! వద్దు! అలాంటి ప్రయత్నం చెయ్యకు" అని మధు వారించినా, సంధ్య వినిపించుకోలేదు.

సరాసరి అక్కడనుంచి రోజావద్దకు చక్కా వచ్చింది. రోజా పక్కమైన పడుకుని పుస్తకం పట్టుకుంది. గదిలో చీకటి దట్టంగా వున్నా దీపంలేదు.

దీపంవేసి మెల్లగా ఆమెప్రక్కన చేరికూర్చుంది–సంధ్య "దీపం లేకుండా ఏం చదువుతున్నావే?" అంటూ.

ఉలికిపడి సర్దుకుని లేచి కూర్చుంటూ "నువ్వా! గాలివిసురులా వచ్చావు? ఏం కథ?" అన్నది రోజా.

"పోనీ వానజల్లుగా అను; మన మాటలకేంగానీ, రోజా! ఆరోజునుంచీ నువ్వు నాతో ముభావంగా ఉంటు న్నావు. మనసు దాస్తున్నావు– ఎందుకని?

మౌనంగా ఉండిపోయింది రోజా.

"సరే–పోనీ, ఇంతకీ అతన్ని నే పెళ్లి చేసుకోనా వద్దా? అదయినా చెప్పు."




''ఏమోనే! అది నువ్వే తేల్చుకోవాలని చెప్పానుగా?"

"పోనీ నీ సంగతి చెప్పు. మీ బావ వచ్చాడుగా. ఏమైనా పెళ్ళిమాటలు వచ్చాయా?''

ఈ ప్రశ్నకి రోజా గుండెలు దడదడా కొట్టుకున్నాయి. జవాబు ఇవ్వలేదు; తిరిగి తనే ప్రశ్న వేసింది. "సంధ్యా, బావ విషయంలో నీ అభిప్రాయం ఏమిటి?"

"మీ బావకేమే? నిక్షేపంలాంటి మనిషి!" అన్నది సంధ్య. అట్బే ఇలా మాట్లాడితే లాభంలేదు, సంగతితేలదు. అని మనసులో అనుకుని మాటని మరో రకంగా త్రిప్పింది. "కాని ఎంతలేదన్నా విదేశాలు వెళ్ళి వచ్చాడుకదా! మనసులో కాస్త మార్పు వచ్చి ఉంటుంది. తన మనసు దాచిపెట్టి నీవు మనసారా ఒప్పుకుంటేనే ఈ పెళ్ళి జరుగుతుందని నేరం నీ పైనే నెట్టాడు"

బావనంటుంటే సహించలేక పోయింది రోజా. ''అందులో అతని నేరమేమీ లేదే, అతనలా అనడానికి కారకురాల్ని నేనే" అంది

"ఆఁ నువ్వా కారణం?" అంది ఆశ్చర్యంగా సంధ్య.

"నే చెప్పలేను సంధ్యా! నన్ను బాధించకు."

"చెప్పొద్దులే నేనే చెప్పుకుంటాను. తిట్టకు, నీ మనసు మధూవైపు ఆకర్షింపబడిందికదూ?''

అదివిని విలవిల్లాడిపోయింది రోజా. ''వద్దు సంధ్యా! వద్దు. ఈ విషయం మాట్లాడితే నీకు చాలాద్రోహం చేసినదాన్ని అవుతాను."

ఓసి...నీ...యిదా నువ్వు నన్ను తెల్సుకున్నది? అతను నాకు మిత్రుడు మాత్రమే అని నీకు బాగా తెల్సు. ఇద్దరు మిత్రులు ఒకటవడం నాకు ద్రోహ మేమిటే? కానీ మీ బావ-"

"మా బావ కేనాడో చెప్పేశాను". అంది రోజా ఏడుపు ఆపుకుంటూ.

"అయితే యింకేం - నిన్ను చేపట్ట గల అన్ని అర్హతలూ మధూకున్నాయి. ఏర్పాట్లు చకచకా చెయ్యొచ్చు."

"నువ్వేం చెయ్యొద్దు."

"మరెలా?"

తన్నుతాను కూడ దీసుకుని అంది అంది రోజా, "నువ్వు బావని పెళ్ళి చేసుకోడానికి అంగీకరిస్తేనే నా మనసు కెళ్ళినదారిని నేను ప్రయాణిస్తాను. లేకుంటే లేదు. ఆలోచించి ఏ మాటా చెప్పు. మరింకేం నాకు చెప్పొద్దు, వెళ్ళు తక్షణం వెళ్ళిపో," ముందుకు తోసింది సంధ్యని

రోజా ప్రవర్తన బాధగావున్నా శాంతం సహించింది సంధ్య. తప్పు తనదే కాబట్టి. శిక్ష వేసినట్లు రోజా మాట్లాడంలో తప్పులేదు. ఆలోచిస్తూ అడుగులో అడుగు వేసుకుంటూ మరో సమస్య తలెత్తింది. యిదెలాగా, అని పరాగ్గానడుస్తూ గేటుదాకా వచ్చింది; గేటు దాటింది 'కుడిఎడమవటం పొర పాటా?' ఎవరో కాదన్నారు. పొర పాటేనేమో? కాకపోవచ్చు!

మెల్లిగా మెత్తగావచ్చి కారు ఆగడంగాని అందులోంచి రఘు దిగడం గాని ఆమె గమనించలేదు - కుడిఎడ మలమధ్య ఉన్న తను.

గేటుదాటగానే "ఓ సంధ్యాదేవీ! మీరా? కారుఅడ్డంగావుంది, చూసుకో కుండా వెళ్ళిపోతున్నా రేమిటి? రండి నే దిగబెడతా!" అని తిరిగి కారు ఎక్కాడు రఘు.

మతిస్వాధీనంలో లేని దానిలా కారులో ఎక్కికూర్చుంది సంధ్య.

"ఎక్కడికి? మీ యింటికేనా? అని ప్రశ్నించాడు రఘు "

"ఇంటికొద్దు! సముద్రంలో దింపండి!" అంది కసిగా, మనసులో అనుకున్నమాటలు పైకివచ్చేసినందుకు నాలిక కొరుక్కుంది సంధ్య" మళ్ళీ కంగారుగా అంది. "వద్దు నాకు స్నేహంమీదకూడా నమ్మకంపోయింది. ఇంటికే చేర్చండి."

రఘు ఆ మాటలకి పకపకా "పోనీ నన్ను డ్రైవరు అనుకోండి కాస్సేపు," అన్నాడు.

మనసులో ఎంతవిసుగ్గావున్నా ఆ మాటకి నవ్వకుండా వుండలేక పోయింది సంధ్య.

అతనినవ్వులో ఆమెనవ్వు కలిసిపో యింది. పొరపాటు లేకుండానే కుడి యెడమయింది.

కారు సముద్రపొడ్డుకే దారితీసింది.

రాజనగర్ జమీందార్లు గొప్ప కృష్ణభక్తులు. ఇప్పటి జమీందారు రమావల్లభుని తండ్రిగారైన హరివల్లభుడు తమ ఇలవేల్పుకు అతిసుందరమైన మందిరం నిర్మించాడు. ఆ రాధాకృష్ణమందిరం శిల్ప నైపుణిలో, నిర్మాణప్రాశస్త్యంలో కవుల, పండితుల ప్రశంసలను పొందింది.

మందిరానికి అల్లంతదూరంలో గలగలమంటూ ప్రవహించే చిత్రరేఖానది. నదికి ఆవల అర్ధచంద్రాకృతిలో కనిపించే వృక్షసముదాయం. నదికి రెండు పక్కలా, కళ్ళానినంతవరకూ పరుచుకుపోయిన తెల్లని ఇసుకతిన్నెలు; నదికి అక్కడక్కడా సుందరమైన రాతిసోపానాలు, వాటికి దిగువనా పైనా కూర్చోవటానికి చలవరాతితో కట్టిన అరుగులు.

రాధాకృష్ణ మందిరం, చిత్రరేఖానది ఒడ్డునే నిర్మించబడింది. మందిరానికి చుట్టూ అనేకమైన ఫలవృక్షాలూ. పూపొదరిళ్లూ – వాటి మధ్య చలవరాతి అరుగులూ, అక్కడక్కడా అతిలోకసౌందర్యాన్ని వెలారించే శిల్పప్రతిమలూ. మార్గానికి అటూయిటూ దీపతోరణాలూ – ఇవన్నీ హరివల్లభుని భక్తిసౌందర్య పిపాసలకు చిహ్నాలుగా ద్యోతకమవుతై.

చలవరాళ్ళు పరచిన నలుచదరపు ప్రదేశం మధ్యవుండే విశాలమైన పాలరాతి రాధాకృష్ణ మందిరాన్ని వెన్నెలరాత్రుల్లో చూడటం ఒక అలౌకికానుభూతిగా కల కాలం హృదయంలో నిలిచిపోతుంది. ఇక మందిరంలోని బంగారు సింహాసనం మీద ప్రతిష్ఠించిన రాధాకృష్ణ విగ్రహాల సౌందర్యం చెప్పనలవికాదు. పీతాంబర ధారియైన గోపాలకృష్ణుడు పక్కకు కొంచెంగా ఒరిగి పిల్లనగ్రోవి ఊదుతూన్నట్టుంటాడు. ఆ వేణునాదం వింటూనే–ఇంటి పనుల్లో మునిగిపోయిన రాధ, వా టన్నిటినీ వదిలి జారిపోయిన కొప్పుతో వేగంగా పరిగెత్తుకుంటూ వచ్చి, అతని పక్కన నిలబడినట్టు – సిద్ధహస్తుడైన శిల్పి చెక్కిన విగ్రహాలవి.

ఆ విగ్రహాలకు ముందు ఎనిమిది రేకుల బంగారు తామరపూవులో, తులసి దళాలతోపాటు, గంధం చిలికించిన సాలగ్రామం ఒకటి వుంటుంది. దాని పక్కన పద్మం ఆకారంలో చెక్కిన పాల – నీలిరాళ్ళమీద రోజూ అవసరం అయే పూజా ద్రవ్యాలు అమర్చబడి వుంటాయి. ఇవి, జలంతో నింపిన శెల్లని శంఖం, చిన్న బంగారు గరిటె, దీపంకందులు, పంచప్రదీపం.

కీర్తిశేషుడైన హరివల్లభుడు ఎంతో ధనవ్యయంతో ఇంత సుందరమైన రాధాకృష్ణ మందిరాన్ని నిర్మించటమేగాక, తన యావత్‌సంపత్తీ దానికి సంక్రమించే

టట్టు వీలునామా రాశాడు. ఉత్సవాలూ, పూజలూ భారీఎత్తున జరిగేందుకు అవసరమైన ఏర్పాట్లన్నీ చేశాడాయన. తన వంశీయులు దైవకార్యాలకు ఖర్చయిపోగా మిగిలేధనం అనుభవించవలసిందే తప్ప — తాను వదలిపోయిన ఆస్తిపాస్తులమీద వారికి దానవిక్రయాధికారా లుండవు. సంపద అంతా ఆ రాధాకృష్ణ మందిరానిదే.

హరివల్లభుడు మందిరంతోపాటు ఒక అతిథిశాల, సంస్కృతపాఠశాలా కూడా ఏర్పాటు చేశాడు. పాఠశాల ప్రధానాధ్యాపకులైన జగన్నాధతర్క చూడామణి, హరివల్లభుడి అనతిప్రకారం యింతకాలంగా రాధాకృష్ణ మందిరపు అర్చకత్వ బాధ్యతలు నిర్వర్తిస్తున్నాడు. చూడామణి జీవితపర్యంతం ఆ మందిర అర్చకత్వ పదవిలో వుండేటట్టు హరివల్లభుడు నియామకపత్రం రాశాడు. ఆయన అనంతరం, ఆయనచే నియోగించబడిన శిష్యుడే మందిర అర్చకత్వానికి అర్హుడు. కాని, అలా తర్కచూడామణి నియమించిపోయిన అర్చకుడు అప్రయోజకుడని వ్యక్తమయితే— ఆ సంగతిని ఆస్తికులూ, పౌరాణికులూ ఆమోదిస్తే, అప్పుడు జమీందారు కుటుంబంలో వున్న పెద్దఅయిన వ్యక్తి అర్చకుణ్ణి మార్చటంలో జోక్యం కలిగించుకోవచ్చు. అయితే, కొత్తగా అర్చకత్వానికి ఎన్నుకోబడే వ్యక్తి సంస్కృతపాఠశాల విద్యార్థుల్లో ఒకడై వుండాలి.

ఈ నియమం వల్ల పాఠశాల విద్యార్థులు ఒకరిపై ఒకరు పోటీపడి మంచిపండితులయేందుకు కృషిచేసే అవకాశం వున్నది. కాని, అసూయాపరు డెవడైనా యీ నియమాన్ని ఆసరా చేసుకుని అల్లకల్లోలం రేపేందుకు తయారుకావచ్చు. రాధాకృష్ణ మందిరానికి తొలిసారిగా ఒకరిని అర్చకత్వ పదవికి ఎన్నుకునే అవసరం కలిగినప్పుడు జరిగిన సంఘటనలే, ఈ కథకు ప్రాతిపదిక.

* * *

జమీందారు హరివల్లభుడు స్థాపించిన సంస్కృత పాఠశాలలో అంబర్‌నాథ్ అనే విద్యార్థి ఒకడున్నాడు. అతడు చాలా శాంతస్వభావుడు, వినమ్రుడు. అతడు పాఠశాలలో చేరి ఏడెనిమిది మాసాలకన్న ఎక్కువ కాలేదు. అతడి గుణసంపదను గుర్తించిన జగన్నాధ తర్కచూడామణి అతడంటే ఎంతో వాత్సల్యం చూపసాగాడు. వృద్ధ పండితుడికి పక్కవెయ్యటం దగ్గర్నుంచి, పాదాలు వత్తటం వరకూ అన్ని శుశ్రూషలూ అంబర్‌నాధే చేస్తుండేవాడు.

ఇలా అయిదారు నెల్ల కాలం జరిగిపోయింది. వృద్ధుడైన జగన్నాధతర్క చూడామణి హఠాత్తుగా వ్యాధిగ్రస్తుడై మంచమెక్కాడు. ఆయన మరెంతోకాలం బతకడని అందరూ గుర్తించారు. పాఠశాలలో ఆచార్యపీఠానికీ రాధాకృష్ణ మంది

రంలో అర్చకత్వానికీ ఆయన ఎవరిని నియమించిపోతాడా — అన్నదే చాలా మందిని వేధిస్తున్న సమస్య. పాఠశాలలో అందరికన్న పూర్వపు శిష్యుడైన ఆద్యనాథుడనే అతణ్ణి యీ పదవులకు నియమిస్తాడని జమీందారు కుటుంబంలోనివాళ్ళూ, గ్రామస్థుల్లో చాలామందీ భావించారు.

తర్కచూడామణి యింకా ఒక రెండు దినాల్లో చనిపోతాడనగా, జమీందారు గ్రామంలోని యిద్దరు ముఖ్యులతో ఓ అరగంటకాలం సంప్రదింపులుచేసి, ఏవో పత్రాలు రాయించి తర్కచూడామణిచేత సంతకం చేయించి తర్వాత తాముకూడా సంతకాలు పెట్టారు. ఆ ఇద్దరు ముఖ్యులలో ఒకరు జమీందారుగారి కుటుంబ న్యాయవాది, రెండవ అతను వారి గుమాస్తా

తర్కచూడామణి చనిపోయింతరవాత, ఆయన సంతకం పెట్టిపోయిన పత్రాలలోని విషయం బయటపడింది. అది చాలామందికి విచిత్రంగా కనిపించింది. స్వర్గీయుడైన అధ్యాపకుడు తన పదవులన్నిటికీ, కొద్ది నెలలనుంచి మాత్రమే తనకు శిష్యుడుగావున్న అంబర్‌నాథ్‌ను ఉత్తరాధికారిగా చేశాడు. సంస్కృత పాఠశాల ప్రధానాచార్యపదవీ, రాధాకృష్ణ మందిరపు అర్చకత్వం అతడు నిర్వహించాలన్నమాట. ఈ ఏర్పాటు పాఠశాలలోని విద్యార్థి బృందానికి ఏ మాత్రం మనస్కరించలేదు. వాళ్లు కలిసికట్టుగా జమీందారు దగ్గిరకుపోయి, "ఈ అంబర్‌నాథ్ గురుముఖతా యింకా న్యాయశాస్త్రమే పూర్తిచేయలేదు. అతడు పాఠశాల అధ్యాపక పదవీ బాధ్యతలను ఎలా నిర్వహించగలడు? ఈ ఎన్నిక అసంగతం. తమరు యిప్పుడే మరెవరినైనా ఆ స్థానానికి ఎన్నికచేయండి," అని చెప్పారు.

విద్యార్థుల విజ్ఞప్తిని అంగీకరించి అమలుచేయటం జమీందారుకు సాధ్యమయే పనికాదు. తనకీ విషయంలో వున్న అధికారం చాలా పరిమితమని వాళ్ళకు నచ్చచెప్ప చూశాడు. కాని, విద్యార్థులు అసంతృప్తితో ఉడికిపోతూ అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

అంబర్‌నాథ్‌కు గురువుగారు తనకంటకట్టిపోయిన పదవులమీద ఎలాంటి మమకారమూ లేదు. తనకన్న సమర్థులూ ఎంతోకాలంగా పాఠశాలలో వున్న విద్యార్థులూ ఎందరో వున్నారు వారిలో ఎవరికైనా యీ బాధ్యతలు తన గురువుగారు ఒప్పచెప్పిపోయుంటే బావుండేదని అతడు భావించాడు జమీందారుతో తానీ పదవులకు అనర్హుణ్ణని చెప్పాలనిపించిం దతనికి. కాని, వెళ్ళక తప్పదు

గురువుగారి శ్రాద్ధకర్మలన్నీ పూర్తయి, తన బాధ్యతల్ని స్వీకరించిం తరవాత ఒకనాడు గుండె దిట్టవు పరుచుకుని, అంబర్‌నాథ్ దేవపూజముగించి, పూజాపుష్పాలు




తీసుకొని జమీందారును చూడబోయాడు. జమీందా రప్పుడు ఒంటరిగానే వున్నాడు. ఆయన నౌకరుకు కుర్చీ తెమ్మనిచెప్పి, అంబర్‌నాధ్‌కేసి విస్మితుడై చూస్తూవుండి పోయాడు. కొత్త పూజారి చూడటానికి ఎంతో ఆకర్షణీయంగా వున్నాడు. వెడల్పైన నుదురు, విశాల నేత్రాలు, బంగారు పచ్చని శరీరం — బ్రహ్మవర్చస్సు వుట్టిపడుతున్న యువకుడు. అతడి ఆకారం చూస్తూంటే ఎంతటి వారికైనా అతడిమీద గౌరవభావం కలిగి తీరుతుంది. కాని, సంస్కృత పాఠశాలా ప్రధానాచార్య పదవి దృష్ట్యా చూసినప్పుడు మాత్రం అతడు ఆ బాధ్యతకు తగనంత చిన్న వయసువాడిలా కనిపిస్తాడు. వృద్ధ జగన్నాధతర్క చూడామణి యీ తరుణ వయస్కుడికి ఆచార్య పదవి, అర్చకత్వం ఎందుకు అప్పగించిపోయాడో అర్ధంచేసుకోవటం చాలా కష్టం.

జమీందారు చూపిన కుర్చీలో కూర్చుని అంబర్‌నధ్ కొంచెం సంకోచిస్తూ, "గురువుగారు నామీద పెట్టిపోయిన బాధ్యతల్ని సముచితంగా నిర్వహించగలనన్న విశ్వాసం నాకు కలగటంలేదు. తమరు దయవుంచి యోగ్యుడి కెవరికైనా వీటిని అప్పగించండి" అన్నాడు

"మీ గురువుగారు విద్యార్థు లందరిలోనూ నువ్వే సమర్థుడివని యీ గురుతర బాధ్యత నీపైన పెట్టిపోయారు. ఆయన పొరపాటు చేశారనా — నీ అభిప్రాయం?" అని ప్రశ్నించాడు జమీందారు.

అంబర్‌నాథ్ కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, "వారు పొరపాటు చేశార నేది నేను ఊహించలేని సంగతి. బహుశః నా శక్తిసామర్థ్యాల విషయంలో నేనే పొరబడుతూ వుండొచ్చు. ఏమైనా యీ బాధ్యతల్ని చూస్తే నాకు భయంవేస్తున్నది. కనుక, వీటిని మరెవరికైనా అప్పగించండి," అన్నాడు.

జమీందారు, అంబర్‌నాథ్‌కు యీ బాధ్యతల విషయంలోవున్న నియమ నిషేధాలను గురించి చెప్పి," ఈ బాధ్యతల్ని నువ్వు వదులుకోదలుచుకున్నా, నిన్ను విముక్తుణ్ణి చేయగల అధికారం నాకులేదు. కాని, ఒకవేళ అందరూ నువ్వు పూజా విధులు నిర్వర్తించటంలో, ఆచార్యపదవీ నిర్వహణలో అసమర్థుడివని అభిప్రాయం వెలిబుచ్చితే — అప్పుడు నిన్ని పదవులనుంచి తొలగించగలను," అని చిరునవ్వు నవ్వుతూ, "ఈ బాధ్యతలు నీకంత మరీ భారంగా కనిపిస్తే, విధి నిర్వహణలో బాగా పొరపాట్లు జరిగేలా చూడు. వాటిని కనుక్కునేవాళ్ళకు కరువులేదు," అన్నాడు

అంబర్‌నాథ్ కుర్చీలోంచి లేచి నిలబడి నిండుకంఠంతో, "బుద్ధిపూర్వకంగా నా కర్తవ్య నిర్వహణలో బాగా పొరపాటను దొర్లించలేను. ఇలాంటి కుమార్గం ద్వారా విముక్తిపొందటం నాకు గిట్టదు గురువుల ఆదేశాన్ని శిరసావహిస్తాను," అన్నాడు తరవాత జమీందారుకు నమస్కరించి వెళ్ళిపోయాడు

మర్నాటిఉదయం అతడు పట్టుదలతో కార్యభారాన్నంతా నెత్తిన పెట్టుకో చూశాడు కాని అది అక్కడ నిలిచేటు తోచలేదు. పాఠశాలలోని విద్యార్థులు పుస్తకాలు తెరిచి, కునికిపాట్లు పడుతూ కూర్చున్నారు. ఆద్యనాథ్ అనే పెద్దవిద్యార్థి ఒకడు మరికొందరు విద్యార్థుల్ని వెంటబెట్టుకు పాఠశాల వదిలిపోయాడు

## 2

రాజనగర్‌లోని అంగడిబజారు చిత్రరేఖానదికి ఇంచుమించు మైలు దూరంలో వుంటుంది. జమీందారుగారి భవనంముందునుంచి రైల్వేస్టేషన్‌కు రోడ్డు పోతుంది. ఆ రోడ్డు కిరువైపులా మామిడి, పనస మొదలైనచెట్లు ఏపుగాపెరిగి దారిపోయే వారికి చల్లని నీడనిస్తుంటాయి. ఈ రోడ్డుకు అటూయిటూ తీర్చిదిద్దిన ట్టుంటుంది. రాజనగర్ గ్రామం. గ్రామంలో కలవారి ఇళ్ళు పదో పదిహేనో వుంటాయి; మిగిలినవన్నీ పేదలవే. ఆ కారణంగా గ్రామంలో మిద్దెలూ, పెంకుటిళ్ళకంటె పూరిఇళ్ళసంఖ్యే ఎక్కువ. గ్రామంలో ప్రతి ఆది, గురువారాల్లో సంత జరుగుతూ ఉంటుంది. ఆ రోజుల్లో చుట్టుపక్కల ఊళ్ళనుంచి చాలామంది జనం రాజనగర్‌కు వస్తూంటారు.

అంగడిబజారు నానుకునే ఒకఆయన పెద్ద పాఠశాల ఒకటిపెట్టి, ఊళ్ళో పిల్లల్ని బహు కష్టంమీద పోగుచేసి, చేతనైనంతలో విద్యాదానం చేస్తున్నాడు. ఆ పాఠశాల కెదురుగా ఒకఇంట్లో ఆద్యనాథ్ దూరపుబంధువు – వరసకి అన్నగారు – వుంటున్నాడు. ఆద్యనాథ్ సంస్కృత పాఠశాల వదిలిం తరవాత యీ ఇంటికి చేరాడు. అతడి యీ జ్ఞాతి సోదరుడిపేరు బృందావన్ చంద్ర్ – అతడికి భార్యా విధేయుడన్న అపప్రధవుంది – గ్రామంలో. కాని, అతడిభార్య తులసిమంజరి అంత చెడ్డదేంకాదు. అయినా, వృద్ధుడైన బృందావన్ చంద్రకు ఆమె పడుచుపెళ్ళాం కావటంతో – ఊళ్ళోని పరనిందాపరాయణులకు యిలాంటి వార్తలు ప్రచారం చేయటం ఒక కాలక్షేపంగా తయారైంది.

ఆరోజు సంజెవేళ తులసిమంజరి ఓ ఇత్తడి పళ్ళెంలో దీపారాధన ప్రమిద, చిన్న బెల్లంముక్క పెట్టుకుని తులసికోటదగ్గరకు నైవేద్యం పెట్టిపోదామని వెళ్తున్నది. ఆ సమయంలో ఆద్యనాథ్ వీధిలోంచి గబగబా ఇంట్లోప్రవేశించి, "వదినా!" అంటూ ఆమెను సమీపించాడు.

"ఏవిటి మరిదీ –?" అంటూ తులసిమంజరి తలమీదినుంచి జారిపోతున్న నారపట్టు చీరచెంగును సవరించుకుని, "రా, సంధ్యావందనానికి స్థలం శుద్ధిచెయ్యమంటావా?" అని ప్రశ్నించింది.

"స్థలమా? చేస్తేచెయ్యి. అసలు నే నొచ్చిందందుక్కాదు. ఏదో ఒకసంగతి మాట్లాడదామని..." అంటూ ఆగిపోయాడు ఆద్యనాథ్.

"ఏవిటా సంగతి? సగం మాటచెప్పి ఆగిపోయావెందుకు?" అన్నది మంజరి– ఇత్తడిపళ్ళాన్ని తులసికోటముందుపెట్టి.

"అంతపెద్ద సంగతేమీకాదు. అన్నయ్య అదోరకంమనిషి. ఆయనతో సలహా సంప్రతింపులు కుదరవు. అందుకే నీతో చెపుతున్నాను," అంటూ ఆద్యనాథుడు ప్రారంభించి, తనకు రావలసిన పదవుల్ని తన గురువుగారు మతి స్థిమితంలేని దశలో అంబర్‌నాథ్‌కు ఒప్పచెప్పిపోయాడని వదినెకు చెప్పుకున్నాడు. అంతేకాక యీ అధికారాలు హస్తగతం చేసుకున్న కుర్రకుంక అంబర్‌నాథ్‌కి శాస్త్రార్థాలూ, పూజావిధులూ ఏమీ తెలియవని చెప్పాడు.

అంతా శ్రద్ధగావిన్న తులసిమంజరి, "అయితే, యిప్పుడు నన్నేం చెయ్యమంటావు – మరిదీ?" అని అడిగింది.

"జమీందారుగారింట్లోని ఆడవాళ్ళతో నీకు మంచి స్నేహం ఆదీవుందికదా వదినా?" అన్నాడు ఆద్యనాథుడు.

"ఉంది. ఎందుకు?" అని ప్రశ్నించింది తులసిమంజరి.

ఆద్యనాధుడు కాస్త తటపటాయిస్తూ, "జమీందారుకూతురు చాలా ఆచారవంతురాలూ, ధర్మ పరాయణురాలూ—అని విన్నాను. ఆమెను యీ విషయంలో.. కాస్త.."

ఆద్యనాధుడు మాట ముగించకముందే తులసిమంజరి అందుకుని కోపంగా, "ఏమిటీ నువ్వు చెప్పేది. అంబర్‌నాథ్ మూర్ఖుడని ఆమెతో చెప్పమంటావా?" అన్నది.

"అహఁహఁ — అదికాదు నేననేది. అంబర్‌నాథ్ నిజంగానే అర్చకత్వం వహించటానికి అసమర్థుడు. ఆమాట ఆమెకుచెపితే — అది అబద్ధంకాబోదు — ఇందులో తప్పేముంది?" అన్నాడు ఆద్యనాథ్.

"తప్పు లేకపోవచ్చు. కాని, కొత్తపూజారిని గురించి ఆరంభంలోనే నేను అపవాదులు లేవతీస్తున్నానని ఆమె అనుకోగలదు. నువ్వు మాకు ఆత్మీయుడివి కావటంతో, అలా అని ఆమె వూహించటం చాలా తేలిక. ఒక్క మాటమాత్రం ఖచ్చితంగా చెప్పగలను. అంబర్‌నాథ్ నిజంగానే పూజావిషయాల్లో అజ్ఞుడైతే, అస్థానంలో అతడు ఆట్టేకాలం వుండలేడు. నీ నేత్రాలకంటె సునిశితమైన రెండునేత్రాలు రాధాకృష్ణ మందిరంలో అతణ్ణి కనిపెడుతూనే వుంటాయి. నువ్వు నిశ్చింతగా వుండు," అన్నది తులసిమంజరి, హామీయిస్తున్నట్టు.

ఆద్యనాథ్ ఆదుర్దాపడిపోతూ, "నేత్రాలా? ఎవరినేత్రాలు?" అని ప్రశ్నించాడు.

"జమీందారుగారి కూతురు, రాధారాణివి. ఆమెదగ్గిర ఆషామాషీ పూజలుసాగవు," అన్నది తులసిమంజరి.

ఆ జవాబుతో ఆద్యనాథ్ ఎంతో తృప్తిపడి, "అలాఅయితే నేను నలుగురైదుగురు విద్యార్థుల్ని పోగుచేసి యిక్కడే పాఠశాల ప్రారంభిస్తాను. ఆ అంబర్‌నాథ్ పండితుడి వేషంవేసి ఎలా బతగ్గలడో చూస్తాను," అన్నాడు.

తులసిమంజరి అన్నట్టు రాధాకృష్ణమందిరంలో పూజచేసేవేళ ప్రతిరోజూ అంబర్‌నాథ్‌ను జమీందారుగారి కూతురు రాధారాణి కనిపెట్టి చూస్తూనేవున్నది. మందిరంలో బంగారు సింహాసనంమీద ప్రతిష్ఠించబడిన రెండువిగ్రహాలకూ వున్న భేదమల్లా, విగ్రహాలు కదలవు, యీ బంగారుబొమ్మ మందిరమంతా కదలి ఎక్కడేమి జరుగుతున్నదో చూస్తుంది.

అంబర్‌నాథ్ ఒకనాడు మందిరంలో పూజముగించి పాఠశాలకేసి బయలుదేరాడు. పాఠశాలముందున్న మంటపంమీద నిలబడి ఆద్యనాథ్ కొందరు విద్యార్థులతో ఉద్రేకంగా మాట్లాడుతుండటం అతడి కంటబడింది. తనమీద ఆద్యనాథ్



చాలా విముఖుడై వున్నాడని తెలిసిన అంబర్‌నాథ్ యీ సమయంలో అటుకేసి పోవటం మంచిదికాదనుకుని నదీతీరంకేసి బయలుదేరాడు. అక్కడ అతడికి జాలరి పరాన్ చేపలుపడుతూ కనిపించాడు. అంబర్‌నాథ్‌ను చూస్తూనే అతడు చేతులెత్తి నమస్కరిస్తూ, "దండాలు బాబుగోరూ! తమరు పూజార్లయినట్టు తెలిసింది. చాలా సంతోషం," అన్నాడు.

అంబర్‌నాథ్‌కూ, జాలరిపరాన్‌కూ మంచిపరిచయమేకాదు - ఒకపాటి నేస్తం కూడా వున్నది. ఒకప్పుడు పరాన్‌కూతురు ఆదురేని కాలుతున్న వాళ్ళగుడిసె లోంచి బయటకు తీసుకువచ్చి ప్రాణాలు కాపాడాడు అంబర్‌నాథ్. అప్పటినుంచీ పరాన్ తనపెరట్లో కాచిన ఏ కాయోపండో తెచ్చి, ఎంత వద్దంటున్నా వినకుండా అంబర్ ముందుపెట్టి పోతూండేవాడు. అదిచూసిన ఆద్యనాథ్ ఒకసారి అంబరుణ్ణి, "నువ్వు జాలరివాడి దానాన్ని పడుతున్నావా?" అని ప్రశ్నించాడు.

ఈ స్వల్పవిషయంగురించి ఎవరైనా ప్రశ్నిస్తారనిగాని, తను జవాబు యిచ్చుకోవలసివస్తుందనిగాని, అంబర్‌నాథ్ ఏనాడూ వూహించలేదు. అతడు ఆద్యనాథ్ ప్రశ్నకు గతుక్కుమని, "దానమా? ఇదేందానం? వద్దన్నా అతడు వినిపించుకోడు. ఇవ్వటం అతనికో రకం తృప్తి," అన్నాడు.

"తృప్తిమాట అలావుంచు. శూద్రదానాన్ని పట్టిన బ్రాహ్మణుడు పతితుడవుతాడు.

నువ్వు అప్పుడప్పుడూ చేసే వంట పాతశాలలో అందరూ తినక తప్పదుగదా !" అన్నాడు ఆద్యనాథ్ కోపంగా.

ఆతర్వాత జాలరి పరాన్‌నుంచి వచ్చే ఎలాంటికానుకా తీసుకోవటం అంబరుడికి మనస్కరించలేదు. కాని, ఒకవైపున ఆ పేదవాడు మనసు బాధపెట్టుకుంటాడేమో అని అతడు అనుకుంటూనే వుండేవాడు.

ఈరోజు అతడు తను పూజారి అయినందుకు పట్టరానంత సంతోషం కనబరుస్తూ అభినందించగానే, అంబర్‌నాథ్ చిరునవ్వునవ్వుతూ, "ఏమోయ్, పిల్లలంతా క్షేమమా ? ఆదురీ ఎలావుంది ?" అని అడిగాడు.

"అందరం క్షేమంగానే వున్నాం. ఇప్పుడు మీరు బాపనోరిలో పెద్దవాళ్ళయ్యారు గందా ! ఎవ్వరూ ఏమీ అనలేరు. కనక, మా ఇంటకాసిన ఇన్ని సీమరేగిపళ్ళు తెచ్చి యిస్తాన్లెండి," అన్నాడు పరాన్.

"అలాంటి బహుమానాలేవీ తేకు, పరాన్. నేను పుచ్చుకోలేను. అందుకు చాలా పెద్దకారణమేవుంది. నువ్వేమీ అనుకోకు," అన్నాడు అంబర్‌నాథ్ మనసులో చాలా బాధపడిపోతూ.

జాలరి పరాన్ ఒక్క నిట్టూర్పు విడిచి తలవంచుకున్నాడు. అంబర్‌థాథ్ నది ఒడ్డునే నడుచుకుంటూపోయి, ఒక పెద్ద మర్రిచెట్టుకింద నిలబడ్డాడు. అతడికెందుకో ఆ సమయంలో రాధాకృష్ణ మందిరంలోని ఐశ్వర్యం, ఆ బంగారు సింహాసనం, విగ్రహాలూ – అన్నీ గుర్తుకువచ్చినై. భగవంతుడి పేరుతో ఇంత సంపద వెద జల్లడం దేనికి ? అనుకున్నాడతను. ఆ వెంటనే అతడికి ఊళ్ళో ఆకలికి అలమటించిపోయే పేదల గుడిసెల్లోని దారిద్ర్యం గుర్తుకువచ్చింది. ఆ దేవమందిరంలో అంతటి రాజవైభవం, ఈ పూరికొంపల్లో దారిద్ర్యరాక్షసి మానవుల రక్తమాంసాలను పీల్చి పిప్పిచేస్తున్నది. "భగవాన్ ! నువ్వు మందిరేశ్వరుడివేగాని, విశ్వేశ్వరుడివికావా ?" అనుకున్నాడు అంబర్‌నాథ్.

# 3

రాజనగర్ జమీందారీకుటుంబం దానధర్మాల్లో, భక్తిప్రపత్తుల్లో పగవాళ్లుకూడా తప్పుపట్టటానికి అవకాశం యివ్వనివంశం. వారిది సమాజంలో అతి ప్రాముఖ్యమైన కుటుంబం కావటానికి ఒక ముఖ్యకారణం – వంశపరంపరగా వస్తున్న వారి వైష్ణవ సంప్రదాయం...అందులోనూ మరీ వారివారి సనాతనత్వం.

జమీందారు హరివల్లభబాబు – ఇప్పుడున్న జమీందారు తండ్రి – ఈ వంశంలో

అందరికంటె అధికమైన భక్తిపరాయణత్వం గలవాడు. ఆయన రాధాకృష్ణమందిరం నిర్మించి, తన సంపద దానికి సంక్రమించేట్టు చేశాడు. ఇందుకు కేవలం ఆయన భక్తిభావమేగాక, భౌతిక కారణాలుకూడా కొన్ని వున్నవి.

హరివల్లభబాబు తన సుదీర్ఘ జీవితంలో మనమణ్ణి ఎత్తే అదృష్టానికి నోచుకోక, తన సంపదను పారమార్థిక కార్యాలకు ఖర్చుపెట్టదలచి, రాధాకృష్ణమందిరం నిర్మిస్తున్నదశలో, కోడలు కృష్ణప్రియ ఆడశిశువును ప్రసవించింది. ఆవార్త తెలుస్తూనే హరివల్లభుడు పురిటింటి గుమ్మందగ్గిరకువచ్చి, పొత్తిళ్ళలోవున్న పసికందును దాదిచేతుల్లోనుంచి తీసుకుని, ఆనందాశ్రువులు రాలుస్తూ, "రాధారాణీ! ఇంతకాలానికి యీ అధమభక్తుడికి దర్శనం యివ్వటానికి వచ్చావాతల్లీ?" అన్నాడు.

కాలం గడిచిపోతున్నది. కృష్ణప్రియకు మరి సంతానం కలగలేదు. మనమరాలు పుట్టింతరవాత హరివల్లభబాబు తనకాలాన్ని ఎక్కువగా ఆమెను ఆడించటంలోనూ, ముద్దుముచ్చటలు చూడటంలోనూ గడపసాగాడు.

రాధారాణికి తొమ్మిదోఏడు రాగానే హరివల్లభుడు ఆమెను ఒక అయ్యచేతిలో పెట్టి అక్షయ స్వర్గఫలితాన్ని పొందాలనే ఆశకొద్దీ, నాలుగువైపులా సంబంధాల కోసం గాలించటం ప్రారంభించాడు.

హరివల్లభుని కొడుకు రమావల్లభుడు కాస్త ఆధునికుడు. అతడికి ఇప్పుడిప్పుడే కుమార్తెకు వివాహం చేయాలనిలేదు. అంతేకాక తండ్రి వెతుకుతున్న సంబంధాలలో చాలావరకు అతడి మనసుకు నచ్చనివి. ఈ కారణంగా ఒకనాడు తండ్రీ కొడుకులమధ్య చిన్న ఘర్షణలాటిది జరిగింది. హరివల్లభబాబు తమకు చాలా దగ్గిర సంబంధం గల మృగాంకమోహనుడికి, రాధారాణిని యిచ్చి చేద్దామనే ఆలోచన బయటపెట్టగానే, రమావల్లభుడు ముఖం చిట్లించుకుని, ఆ కుర్రవాడప్పుడే సిగరెట్లు కాల్చటం నేర్చుకున్నాడని, క్రాఫ్ పెట్టాడనీ, సమయసందర్భాలు చూడకుండా ఈలవేస్తూ కూనిరాగాలు తీస్తుంటాడనీ-తన అభ్యంతరం తెలియపరిచాడు.

హరివల్లభబాబు కొడుకు తెలిపిన అభ్యంతరానికి ఆమోదం వ్యక్తం చేస్తున్నవాడిలా తలాడించి, మరో కుర్రవాడిని గురించి చెప్పి, "ఫాల్గుణ పూర్ణిమ వెళ్ళాక బహుళ పక్షంలో ముహూర్తం పెట్టిద్దాం. నేనా-పెద్దవాణ్ణయిపోయాను. ఏ రోజున ఏం జరుగుతుందో చెప్పలేం," అన్నాడు.

"అంత చిన్నపిల్ల వివాహం గురించి మనం ఇంత ఆదుర్దా ఎందుకుపడాలో నాకర్థం కావటంలేదు," అన్నాడు రమావల్లభుడు-కాస్త చికాకుగా.

కొడుకు మాటలకు హరివల్లభబాబు విస్తుపోయి, "చిన్నపిల్లా ! ఏవిఁటీ నువ్వ నేది ? పిల్లకి పదో ఏడుకూడా వస్తున్నది." అన్నాడు.

"ఇప్పుడంతా ఆడపిల్లలకి కాస్త వయసు వచ్చాక వివాహాలు చేస్తున్నారు. అంతేకాక మనది కులీన కుటుంబం. మనలాంటివాళ్ళ కుటుంబాల్లో ఆడపిల్లలకు ఇరవై ఏళ్ళ వయసుదాటినా అవివాహితలుగా వుండటం చూస్తూనేవున్నాం. మీరు చెప్పే కుఱ్ఱవాడికి లోగడ ఒక వివాహం అయినట్టు వినికిడి. మనం తొందరపడి పిల్లను సవతి చేతిలో పెట్టవలసిన అవసరం ఏమొచ్చింది ?" అన్నాడు రమావల్లభుడు.

ఈ మాటలు వింటూనే హరివల్లభబాబు ఎక్కడలేని కోపం తెచ్చుకుని," సవతి వుంటేమాత్రం మునిగిపోయిందేవిఁటి ? మన సంబంధం చేసుకునేవాడికి పదిమంది భార్యలున్నా వచ్చే నష్టం ఏమీ వుండదు...ఈ కుఱ్ఱవాడు వివాహం అయిన తరవాత యీ ఊరుదాటి వెళితేకదా – ఆ మొదటిభార్యను తెచ్చుకునేది ఆ భార్య రోగిష్టిది. తిండికీ బట్టకూ యింత భరణం యిచ్చేస్తాం ఈ కుఱ్ఱవాడు బాగా చదువుకున్న వాడు...జాతకాన్నిబట్టి చూస్తే మంచి యోగజాతకుడు.'' అన్నాడు.

తండ్రికోపం చూసి రమావల్లభుడు కాస్త తగ్గాడు. అంతలోనే గుండె దిటవు తెచ్చుకుని, "ధారాణిని ఒకసారి వివాహం అయినవాడికి యిస్తే సరే; అది ఆజన్మాంతం పెళ్ళికాకుండా వుండవలసిన స్థితి వచ్చినా సరే. మీ చిన్న మేనత్త అసలు వివాహం చేసుకోకుండా జీవితాంతం కన్యగా వుండి, కాలాన్ని దైవచింతలో గడిపినట్టు చెపుతారు...ఏది ఎలాగైనా, యీ రెండోపెళ్ళివాడి మకిచ్చి అతడి ప్రథమ భార్య జీవితాన్ని నాశనం చెయ్యటం ధర్మమా – అన్న విషయంకూడా బాగా ఆలోచించి చూడండి," అన్నాడు.

హరివల్లభుడికి పట్టరానంత కోపం వచ్చినప్పటికీ, కొడుకు మొండితనం. పట్టుదలా ఎరిగివున్నవాడు కావటంతో యింక ఏమీ మాట్లాడలేదు; కాని, ఒకటి రెండు నిమిషాల తరవాత గదిలోనుంచి బయిటికిపోతూ, "మనసాటి కులీనుల ఇళ్ళలో ఈడుమీరిన యువకుల్ని సృష్టించమని బ్రహ్మదేవుడికి అర్జీపెట్టుకో – పో,'' అన్నాడు కసిగా.

ఈ విధంగా తండ్రీకొడుకుల కీచులాటతో రాధారాణి వివాహం తొమ్మిదో ఏట కావలసింది కాస్తా ఆగిపోయింది. ఆ తరవాత రెండు మూడేళ్లు గడిచినై. హరివల్లభుడు పట్టుదలగల మనిషి కావటంతో అతడి దృష్టిలో మంచివే అనుకున్న రెండు మూడు సంబంధాలు వచ్చినా, అతడు ఆ సంగతి కొడుకుతో అనలేదు. అంతేకాక, అసలామె పెళ్ళి ప్రస్తావనకూడా అతడు ఆ తరవాత తీసుకురాలేదు.




కాని, అతడు తన మనస్సులోని క్షోభను మాత్రం అప్పుడప్పుడూ మనసురాలి ఎదట బయటపెట్టుకునేవాడు. "తల్లీ చూశావా, వాళ్ళిక నీకు పెళ్ళిచేయ తలచలేదు. అందుకే ఎవరికి వాళ్ళు ముభావంగా వూరుకున్నారు. తెలియటంలా?'' అనేవాడు. పదమూడేళ్ళ రాధారాణి తాతగారి మాటలను తలవంచుకుని చిరునవ్వు నవ్వేది.

రాధారాణికి పదమూడో ఏడు జరుగుతుండగా, హఠాత్తుగా ఒకనాడు ఆమె తల్లి కృష్ణప్రియ భర్తతో కూతురుపెళ్ళి ప్రసక్తి తీసుకువచ్చింది. రమావల్లభుడు భార్యమాటలకు గతుక్కుమన్నాడు. తండ్రి వత్తిడిలేకుండా పోయిందని సంతోషిస్తున్న అతడికి, భార్యవైపునుంచి వచ్చిన యీ ఒత్తిడి ఖంగారెత్తించింది. ఇక పిల్లపెళ్ళికి ఆట్టే కాలయాపన పనికిరాదని కృష్ణప్రియ భర్తకు బల్లగుద్ది మరీ చెప్పినట్టు చెప్పేసింది.

రమావల్లభుడిక్కూడా యిక కూతురు వివాహ విషయంలో ఆట్టే జాగుమంచిది కాదన్న అభిప్రాయం కలిగింది. ఇంత వంగదేశంలో ప్రయత్నం చేయాలేగాని, తన కుమార్తెకు వరుడే దొరకడా అనుకున్నాడతను. కాని, తీరా ప్రయత్నాలు ప్రారంభించాక చాలా అవరోధాలు ఎదురయినై. అతడు వారి ద్వారా వీరి ద్వారా సంబంధాలకోసం ప్రయత్నాలు ప్రారంభించాడు. ఆ విధంగా చాలా సంబంధాలు వచ్చినై, కాని వాటిల్లో ఒకటీ అతడికి అనువైన సంబంధంలా కనిపించలేదు.

ఏ వంకాలేని మంచి సంబంధంలాటిది ఏదైనావస్తే అది చాలా దూరాభారాన వున్న ఏ పల్లెటూరి సంబంధమో అయివుండేది, లేదా వరుడు వట్టి దర్భపుడక

లాంటివాడై వుండేవాడు. అలా కాకపోతే పిల్లకన్న ఓ బెత్తెడు పొట్టివాడై వుండేవాడు. కులీనత విషయంలో రమావల్లభుడు ఒక మెట్టు దిగటానికి ఇష్టపడితే, చక్కటి మంచి కుర్రాళ్ళు చాలామంది వున్నారు. కాని, అలా కిందికి దిగటం అసంభవం. కులీనత్వం విషయంలో ఏదో రాజీపడి, కూతురుపెళ్ళి చేశానంటే చేశాననిపించుకోనని రమావల్లభుడు తండ్రికి మాట యిచ్చాడు. వచ్చిన చిక్కేమిటంటే – అన్ని విధాలా తమతో సమానస్థాయాగల కుటుంబాల్లో ఎక్కడా వరుడు దొరకలేదు. మంచి వంశగౌరవం, సనాతనత్వం – ఇలాంటివన్నీ వున్నవాళ్ళల్లో, ఏ ఇద్దరో ముగ్గురో తప్ప, విశ్వవిద్యాలయం ముఖం చూసినవారెవరూ లేరు...

మనమరాలి వివాహ ప్రయత్నాలు యిలాంటి ఒడుదుడుకుల దశలో వుండగా, హరివల్లభబాబు కొంచెం సుస్తీపడి. నాలుగురోజులు మంచంలోవుండి ప్రశాంతంగా కన్నుమూశాడు, అతడు మరణశయ్యమీద వుండగా రాసిన వీలునామాలో ఇతర విషయాలతోపాటు. రాధారాణిని గురించి ఒక ప్రత్యేకాంశాన్ని పొందుపరచాడు. తమకున్న స్థిరాస్తి అంతా అంతకుముందే నిర్మించినట్టు రాధాకృష్ణ మందిరానికే చెందుతుంది. తన పేరవున్న ఆస్తిమాత్రం, తన మనమరాలికి పదిహేనేళ్ళు గడిచేలోపుగా, అన్నిటా తమతో సరితూగగల కులీనులయింటి పిల్లవాడితో వివాహం జరిగితే – అప్పుడు దేవాలయంలో మిగిలే దానితోపాటు వంశపారంపర్యంగా తమ కుటుంబీకులు అనుభవించటానికి అవకాశం కలుగుతుంది. అలా కాని పక్షంలో – రాధారాణిని కులీనుడి కిచ్చి వివాహం చెయ్యకపోయినా, లేదా ఆమెకు పదిహేనేళ్లు నిండేలోపుగా వివాహమే కాకపోయినా – ఆమెకు పదహారో ఏడు వచ్చిన రోజునే, ఈ ఆస్తి యావత్తూ తమకు దూరపుబంధువైన మృగాంక మోహనుడికి చెందుతుంది. తన కొడుకైన రమావల్లభుడికి జీవితాంతం నెలకు వెయ్యి రూపాయిలవంతున భృతిమాత్రం వస్తుంది. ఇంత కాలం నుంచీ వుంటున్న పిత్రియమైన ఇంటిమీద కూడా అతడికి ఎలాటి హక్కు వుండదు.

ఇది రమావల్లభుడికి తండ్రిచేసిన భయంకరమైన ప్రతీకారం. కూతురు ముఖం చూస్తూంటే, రమావల్లభుడికి గుండె తరుక్కుపోసాగింది. బంగారుబొమ్మలాంటి తన కుమార్తెను కులం ఒక్కటిమాత్రమే చూసి ఏ అయోగ్యుడిచేతిలోనో పెట్టవలసిందేనా ? జీవించి వున్నన్నాళ్ళూ మనమరాలిని ప్రాణప్రదంగా చూసుకున్న తన తండ్రి, మరణసమయంలో ఆమెకింత అన్యాయం ఎలా చేయగలిగాడు ? ఆమె భవిష్యత్తునంతనీ యిన్ని కఠిన షరతులమధ్య ఎలా బిగించగలిగాడు ? భర్తద్వారా కృష్ణప్రియ యీ వీలునామా సంగతంతా విన్నప్పుడు, ఏ మాత్రం విచారం

కనబరచకుండా. "మామగారు చేసిందాంట్లో అన్యాయం ఏమీలేదు. పదిహేనేళ్ళ లోపున పరువుగల కుటుంబంలో పిల్లకు పెళ్ళిచెయ్యకపోతే లోకులు మాత్రం ఛీ! ఛీ! అని ఏవగించుకోరూ? ఈ లోపల అమ్మాయికి ఎలాగూ మంచిసంబంధం దొరుకుతుంది.'' అన్నది భర్తతో.

తన తలిదండ్రులు తన వివాహవిషయమై యిన్ని యిక్కట్లు పడుతున్నా, రాధారాణి అవేమీ మనసుకు పట్టించుకోలేదు. ఆమె రోజూ వెళ్ళినట్టే ఉదయపూజా సమయానికి దేవమందిరానికి వెళ్ళింది. ఆరోజు కొత్త పూజారి పూజచేయటానికి వస్తాడని ఆమె విన్నది. ఆ కొత్తపూజారివచ్చి పీటమీద కూర్చోవటం చూస్తూనే రాధారాణికి మొట్టమొదటగా మనసులో కలిగిన భావం ఏమిటంటే - ఇతడు చాలా పిన్నవయస్కుడు. ఇలాంటి బాధ్యతగల స్థానంలో కూర్చోవటానికి అర్హతగలవాడు కాదు - అని.

కొత్త పూజారి అంబర్‌నాధ్ కొంత సేపటికి పూజ ముగించి, లేచి వెళుతూంటే, రాధారాణి కనుబొమలు ముడిపడ్డాయి. కొంచెంసేపు మాట్లాడకుండా అతడు వెళ్ళిన ద్వారంకేసే చూస్తూ వూరుకుని, తరవాత నైవేద్యాన్నీ, పూజా ద్రవ్యాలనూ పక్కన పెట్టేసి ఆలయంనుంచి బయిటికి వెళ్ళిపోయిందామె. ఆ సమయంలో అక్కడవున్న బ్రాహ్మలు వాటిని యధావిధిగా వినియోగంచేశారు.

రాధారాణి దేవాలయం వెలుపలవున్న ఉద్యానంలో ప్రవేశించి, కోపంతో, చికాకుతో అందిన చెట్లపూలుకోసి, వాటిరేకులు తుంచిపారేస్తూ కొద్దిసేపు అటూ యిటూ తిరిగి, తర్వాత గృహంలోకి వెళ్ళిపోయింది. ఈమె ముఖం కోపంగా వుండటం గమనించిన తల్లి కృష్ణప్రియ ఆమెను, "కొత్తపూజారి పూజ ఎలాచేశాడే?" అని అడిగింది.

రాధారాణి విసురుగా, "పూజా, బుగ్గీనూ. మహాగొప్ప అర్చకుడులే. అంత చిన్నవాడు అప్పుడే దేవాలయ పూజారా?" అన్నది.

"అలాగా. అంతమరీ చిన్నవాడా? ఎన్నేళ్ళుంటాయి షుమారుగా?" అని ప్రశ్నించింది కృష్ణప్రియ.

తల్లిప్రశ్నకు రాధారాణి అవహేళనగా; నేనేం మీ పురోహితుడి జాతకచక్రం చూశానా? పైకి చూస్తేమాత్రం మహావుంటే యిరవైఏళ్ళుంటాయేమో అని పిస్తుంది." అన్నది

"అంతేనా?" అంటూ కృష్ణప్రియ ఆశ్చర్యపోయింది.

ఆ సాయంత్రం రాధారాణి యధాప్రకారం మందిరానికి వెళ్ళింది. ఆమె వెళ్ళేసరికి

విగ్రహాలకు హారతియివ్వటం అదీ ముగిసింది. ఇరవై స్వర్ణ పరికరాల మధ్య వెలుగుతున్న పంచప్రదీపం కాంతికి చలువరాతి మందిరంలోని నున్నటి గచ్చుప్రదేశం రత్నాలు పొదిగినట్టు ప్రకాశిస్తున్నది. రాధారాణి విగ్రహాల పక్కనున్న బంగారు పిడిగల వింజామరం తీసుకుని, దానితో గాలివీస్తూ విగ్రహాలమీదికి సుగంధ వాయువును వ్యాపింప చేయసాగింది. అంబర్ వాధ్ అటూయిటూ కదులుతున్న ఆమెచేతికేసి ఓ క్షణకాలం చూసి, మరుక్షణంలో తలతిప్పి పంచప్రదీపాన్ని అందుకున్నాడు. అతడు దానితో హారతియిస్తున్నప్పుడు, అతడి ముఖంలో విస్మయభావం రాధారాణి గుర్తించ గలిగింది. అంతేకాక - అతడు హారతియిస్తున్నప్పుడు, చెయ్యితిప్పటంలో కొన్ని పొరపాట్లు ఆమె కంటికి కొట్టొచ్చినట్టు కనిపించినై.

"మూర్ఖుడు! ఇలాంటివాడు రాధాకృష్ణ మందిరానికి పూజారా? ఊహుఁ, యిది సాగనివ్వకూడదు," అనుకున్నదామె మనసులో.

ఆ రాత్రి మందిరంనుంచి యింటికివస్తూనే, రాధారాణితండ్రిదగ్గిరకు వెళ్ళి, "ఈ కొత్తపూజారిని ఎప్పుడు సాగనంపదలిచారు. నాన్నా?" అని అడిగింది.

పత్రికచదువుతున్న రమావల్లభుడు దాన్ని టేబిల్‌మీద పడవేసి, చిరునవ్వు నవ్వుతూ. "పాప! ఎందుకతణ్ణిహఠాత్తుగా సాగనంపాలనుకుంటున్నావ్?" అని అడిగాడు.

"నువ్వూ, అమ్మ అడిగినట్టే అడుగుతున్నారా? అటువెలాంటిపూజారో చూడలేదా! ఎంతకుద్రాడని, ఇలాంటివాడా పూజారి! ఛీ," అన్నది. రాధారాణి,

"అంత మరీ కుద్రాడుకాదులే. ఇరవై రెండూ ఇరవై అయిదేళ్ళుంటాయి. ఇంతకీ అదో పెద్ద లోపమూ?" అన్నాడు రమావల్లభుడు.

రాధారాణి కనుబొమలుపైకెత్తి. "తాతయ్యే కనకపున్నట్టయితే అతణ్ణి ఒక్కనాడు కూడా మందిరంలో పూజచేయనిచ్చేవాడుకాదు. అతడివల్ల విధివిహితమైన పూజ జరగదు. ఒట్టి మూర్ఖుడు!" అన్నది

రమావల్లభుడికి ప్రత్యేకించి అంబర్‌నాధ్‌మీద ఎలాంటి సానుభూతీలేదు. అతడు వాత్సల్యంగా కూతురివీపు నిమురుతూ, "రాధారాణీ! నువ్వు చిన్నప్పటినుంచీ ఆపూజా విధులన్నీ తెలిసినదానివి గనక, అతడికి కాస్త అవన్నీ నేర్పు. ఇప్పుడతణ్ణి అర్చకత్వంనుంచి తొలిగించే అవకాశంలేదు," అన్నాడు.

రాధారాణికి తాతగారి వీలునామా గురించినవివరాలేమీ తెలియవు. అందువల్ల ఆమె ఆశ్చర్యంగా తండ్రిని, "అదేమిటి నాన్నా! తొలగించేందుకు అవకాశం ఎందుకని లేదు?" అనిప్రశ్నించింది.

శ్రద్ధగా వింటున్నది. అతడు మధ్యమధ్య ఆగి గొంతు సవరించుకుని, పెదవులు తడుపుకుంటూ బెదిరిపోయినవాడిలా అయిపోతున్నాడు. అది చూస్తున్న రాధారాణి ముఖంలో కోపం, ద్వేషం స్పష్టంగా కనిపిస్తున్నాయి. అక్కణ్ణించి లేచిపోదామని కూడా ఆమె అనుకున్నది.

ఆరాత్రి అంబర్‌నాథ్ కథచెప్పటం ముగించాక, జమీందారు రమావల్లభుడు అతణ్ణి తనగదికిపిలిచి, అతడుచెప్పిన ధ్రువచరిత్ర ఏమీ హృదయరంజకంగా లేదని చెప్పాడు. మర్నాడు దేవపూజసమయంలో అంబరుడు మందిరంలోకివచ్చి రాధా రాణి ముఖంకేసి చూడలేకపోయాడు.

కాని, రాధారాణి అతన్నేమీ అనలేదు. అంబర్‌నాథ్ పూజముగించి, బయటికి వచ్చి, 'అమ్మయ్యా ! బతికిపోయాను,' అనుకుంటూ ఒకసారి గట్టిగా నిట్టూర్చాడు. మళ్ళీ రాత్రికి హరికథ ప్రారంభమయింది. ఆరోజున కథ రక్తికట్టలేదు. అంబ రుడు తన శక్తినంతా ధారపోసిన ఫలితంగా నిన్నటికంటె కొంచెం బావున్నదని అనిపించినా — కథచెప్పటంలో ఆ ఒడుపూ, సారస్యంరాలేదు. కథముగిసి అందరూ వెళ్ళిపోయేటప్పుడు, "ఇదేం కథచెప్పటం ? ఛీ...ఇలానువ్వూ, నేనూ ఎవరైనా చెప్పొచ్చు," అనుకున్నారు కొందరు.

ఇలా పదిహేనురోజులు గడిచిపోయాయి. ధ్రువ, ప్రహ్లాద, పరీక్షిత్ శాపం, పారిజాతాపహరణంలాంటి కథలు చెప్పటం ముగిసింది. అన్నిటికన్నా పారిజాతాప హరణ కథచెప్పటం మరింత చప్పగా వున్నదనుకున్నారు అందరూ. రాధారాణికి ఎక్కడలేని ఆగ్రహం కలిగింది. దీనికి తగ్గట్టే మర్నాడు దేవమందిరంలో అంబ రుడు పూజచేసివెళ్ళాక, పుష్పపాత్రమీద ఆమెకు జపాకుసుమం ఒకటి కనిపించింది.

"ఏదో సర్వనాశనం కలగబోయేటట్టున్నది !" అనుకున్నది రాధారాణి. ఇక్కడికి రక్తజపాకుసుమం ఎలావచ్చింది ? వైష్ణవోపాసనా పద్ధతిలో శాక్తేయ విధానమా ? ఆమెకు దేవతాచరణాలమీద మరికొన్ని జపాకుసుమాలు కనిపించగానే, స్తంభితు రాలైపోయింది. ఏది దేవుడికి పూజచెయ్యాలో ఏదికూడదోకూడా తెలియనివాడు పురో హితపదవికి రావటం ఏమిటి ?

రాధారాణి చరచరా మందిరంనుంచి బయటికివచ్చి, అక్కడ కనిపించిన నౌక రుతో, "ఆ బ్రాహ్మణాయన్ని చప్పున పిలుచుకురా," అని ఆజ్ఞాపించింది.

"ఏ బ్రాహ్మణాయన్ని ? వంటబ్రాహ్మణ్ణా ?" అని అడిగాడు వాడు.

"కాదురా మొద్దూ ! పాఠశాలలో వుండే పురోహిత బ్రాహ్మణ్ణి," అని కసురు కున్నది రాధారాణి.

నౌకరు పాఠశాలలోకి వెళ్ళి అక్కడ అంబర్‌నాథ్ కనిపించకపోవటంతో, బహుశా తన యజమానురాలు చెప్పిన పురోహిత బ్రాహ్మడు ఆద్యనాధేమో అను కుని అతణ్ణి పిలుచుకువచ్చాడు. ఆద్యనాథ్ వస్తూనే ఆమెకు భక్తిగా నమస్కరించి, చేతులుకట్టుకుని నిలబడ్డాడు

రాధారాణి జరిగినసంగతి చెప్పినమీదట అతడు చాలాచాలా మాట్లాడాడు. కలి కాలంలో న్యాయానికీ, ధర్మానికీ విజయం అనేది లేదన్నాడు. కాకపోతే ఒట్టిమూర్ఖు డైనవ్యక్తి పాఠశాలలో ఆధ్యాపకపదవీ. మందిర పూజారిత్వం ఎలా పొందగల డన్నాడు. అంబర్‌నాథ్ ఇంతవరకూ చెప్పిన కృష్ణకథలు విని జనం ఏవగించు కున్నారని తెలియపరిచాడు.

అతడి మాటలన్నీ శ్రద్ధగావిన్న రాధారాణి, "అయితే మీరు కథచెప్పగలరా ?" అని ప్రశ్నించింది.

"నేనే చెప్పుకోవటం అహంకారం అనిపించుకుంటుంది. కాని, నాలాగా కథ చెప్పగలవాడు యీ ప్రాంతాల్లో మరొకడులేడు," అన్నాడు ఆద్యనాథ్.

"అలా అయితే, యీ రాత్రికి మీరు కథచెప్పండి.'' అన్నది రాధారాణి. ఆద్యనాథ్ సంతోషంతో అంగీకరించాడు. తరవాత ఆమె అతణ్ణి విగ్రహాలదగ్గి రకు తీసుకుపోయి, వాటిపాదాలమీదవున్న రక్తజపాకుసుమాలను వేలితోచూపుతూ, "ఇందుకు ప్రాయశ్చిత్తం ఏమిటి ?" అని ప్రశ్నించింది.

ఏదో భయంకరమైన వస్తువును చూసినవాడిలా ఆద్యనాధుడు రెండడుగులు వెనక్కువేసి, "శ్రీ వైష్ణవమందిరంలో శాక్తేయ విధానానికి చెందిన రక్త పుష్పాలా ? దీనికి ప్రాయశ్చిత్తంమాటా ! పంచామృతాలతో దేవవిగ్రహాలకు అభి షేకంచేయించి, పునః ప్రతిష్ఠచేసి, సువర్ణదానం చేయాలి. ఆ ప్రాయశ్చిత్త విధాన మంతా పన్నెండధ్యాయాలు గ్రంధంలో ఉటంకించివుంది. ఈ పూజారి యుక్తాయుక్త జ్ఞానశూన్యుడు. పాషండుడు !" అన్నాడు.

"ముందు ఆపూలను దేవవిగ్రహాల పాదాలమీంచి తీసిపారెయ్. ఆద్యనాథ్. తరవాత పుస్తకం చూసిచెప్పు. నే నీలోగా అన్నిఏర్పాట్లూ చేయిస్తాను; ఈ ప్రాయ శ్చిత్తకాండ పూర్తయేవరకూ నేను పచ్చి గంగయినా పుచ్చుకోను.'' అన్నది రాధారాణి ఉద్రేకంగా.

ఆ మధ్యాహ్నం రమావల్లభుడు కబురుచేయగా అంబరుడు ఆయన్ని చూడ బోయాడు, జమీందారు బాలీసుకు ఆనుకుని కూర్చునివున్నాడు. అంబరుడు నమ స్కారంచేసి నిలబడ్డాడు. ఆయన ప్రతినమస్కారంచేసి, కూర్చోమని ఆదేశించి,




"నీవు పూజాఅదీ సక్రమంగా చేయటంలేదని తెలుస్తున్నది. రోజూ నీమీద వచ్చే ఫిర్యాదులు వినలేకుండా వున్నాను." అన్నాడు.

అంబర్‌నాధ్ ఆ మాటలకు విస్తుపోయాడు. తనమీద ఫిర్యాదులు చేస్తున్నవాళ్ళెవరు? ఆమేనా? ఏమని ఫిర్యాదు చేసివుంటుంది? అత డీవిధంగా ఆలోచిస్తున్నంతలో రమావల్లభుడు, శాంతస్వరంతో, "అవసరం అయినగ్రంధాలూ అవీ చూసి, నీ విధుల్ని జాగ్రత్తగా నెరవేరుస్తూవుండు. రాధారాణి మా నాన్నగారి హయాంనుంచి ఆ పూజలూ అవీ చూస్తున్నపిల్ల. కనక, పూజావిధానంలో ఎలాంటి పొరపాటునూ సహించలేదు. సరేవెళ్ళు. మళ్ళీ యిలాంటిఫిర్యాదులు నాచెవిని పడకూడదు; నమస్తే," అన్నాడు.

అంబర్‌నాధుడు, జమీందారుకు నమస్కరించి బయటికివెళ్ళాడు. కాని, అతడికి తాను పూజావిధుల్లో దొర్లించిన పొరపాటేమిటో అర్థంకాలేదు. 'గ్రంధాలూ అవీ చూసి పూజావిధుల్ని చేస్తూవుండు' అని జమీందారుగారు అన్నారంటే – తప్పక తనవల్ల ఏదోపొరపాటు జరిగేవుంటుంది...

ఆరాత్రి అంబర్‌నాధ్ వ్యాకులమైన మనస్సుతో మందిరాన్ని సమీపించేసరికి అక్కడ తనవేదికను ఆద్యనాధ్ ఆక్రమించుకుని వుండటం అతడి కంటబడింది. అతడు రొమ్ములువిరుచుకుని, మెళ్ళో యింతలావు పూలదండ వేసుకుని, కడుపుబ్బ

నవ్విస్తూ, కంటతడిపెట్టిస్తూ - అభిమన్యవధ కథచెప్పుతున్నాడు. అతడు సమర్థుడైన కథకుడు, అందుకు సందేహంలేదు. హృదయవిదారకమైన అభిమన్యవధను ఆద్యనాథ్ వర్ణించి చెపుతూంటే, శ్రోతలు కంటతడిపెడుతూ నిశ్శబ్దంగా కూర్చుని వింటున్నారు. రాధారాణి మంత్రముగ్ధవలె స్తంభితురాలై పోయింది. అశ్రువులు ఆమె చెక్కిళ్ళమీదికి స్రవిస్తున్నాయి.

ఆద్యనాథుడు కథ పూర్తిచేసి, శాంతిమంత్రాలు చదివి, తీర్థఆరివేణం చేత పట్టుకుని, "తల్లులారా! తీర్థం తీసుకోండి, శిరస్సున చల్లుకోండి!" అంటూ బయలుదేరి, కొంతసేపటికి రాధారాణీ వున్నచోటుకు వచ్చి," అమ్మా, రాధారాణీ! తీర్థం తీసుకో, అమ్మా!" అన్నాడు.

రాధారాణి తీర్థం పుచ్చుకుని, "ఇవాళ కథ చాలా బాగాచెప్పారు. ఈ రోజు సద్వినియోగం అయింది. రేపుకూడా మీరే కథ చెప్పండి, చెపుతారా?' అని అడిగింది.

దానితో ఆద్యనాధుడు ఆనందంతో తబ్బిబ్బయిపోయి, దాన్ని బయటికి కనబడ నీయకుండా "తప్పకుండా చెపుతాను- మీకు సంతృప్తిగా వున్నదంటే, నా శ్రమ సార్థకమయినట్టే!" అన్నాడు.

* * * *

పూజా విధానంలో తాను చేసిన పొరపాటేమిటో తెలుసుకునేందుకు అంబర్‌నాథ్ దానికి సంబంధించిన తాళపత్ర గ్రంథాలన్నీ శ్రద్ధగా పరిశీలించాడు. మంత్ర ప్రక్రియలన్నీ అతడికి క్షుణ్ణంగా గుర్తున్నవి. దానికీ, గ్రంథాల్లో వున్నదానికీ పీసం ఎత్తు వ్యత్యాసం కనిపించలేదతడికి. మరి తాను చేసిన పొరపాటేమిటి? జమీందారు గారు తనమీద ఎందుకు కోపగించుకున్నారు.? –

ఇలా ఆలోచిస్తూ అంబర్‌నాధుడు తాళపత్ర గ్రంథాలను యథాస్థానంలో సర్ది పెట్టి, నదికేసి బయలుదేరాడు. రేవు ప్రాంతం నిర్జనంగా వున్నది. వానవచ్చే సూచనగా మేఘాలు ఆకాశంలో పరుగులుతీస్తూ, ఘూర్ణిల్లుతున్నవి. బరువెక్కిన హృదయంతో అంబర్‌నాథ్ నదీతీరంలో కొద్దిసేపు పచార్లుచేసి, ఉదయ పూజా సమయం కావటంతో, మందిరంకేసి బయలుదేరాడు. అతడు మహేశ్‌మండల్ ఇంటి దడిపక్కగా నడుస్తున్నంతలో, దడి అవతలినుంచి మండల్‌గొంతు విని పించింది. "బాబుగారూ, ఆగండి, కాసిని పూలు తీసుకుపోరూ," అన్నాడు మండల్.

"పూలిస్తావా? సరే, ఇయ్యి!" అంటూ అంబరుడు ఆగి, మండల్ అరటి దొప్పలో పెట్టియిచ్చిన జపాకుసుమాలు తీసుకుని త్వరత్వరగా రాధాకృష్ణ మందిరం

కేసి నడిచాడు. అతడు మందిరంలో ప్రవేశించేసరికి, రాధారాణి తాను కూర్చునే ఆసనానికి వెనకగా నిలబడి వుండటం అతడి కంటబడింది.

అంబరుడు విగ్రహాలను సమీపించేంతలో రాధారాణి అతడి చేతిలోవున్న అరటి దొప్పకేసి తీక్షణంగాచూస్తూ, "అందులో ఏమున్నవి?" అని ప్రశ్నించింది.

ఆ ప్రశ్న చాలా కటువుగావున్నట్టు తోచింది అంబర్‌నాథ్‌కు. అతడు ఓ క్షణం విస్మితుడై "పూలు," అన్నాడు తాపీగా.

"పూలా! ఏం పూలు? ఇక్కడ సజ్జ నిండావున్నవిగదా. ఎవరిచ్చారా పూలు?" అన్నది రాధారాణి.

"మహేశ్‌మండల్ - అని ఒకరు..."

"ఏమిటీ?...అయితే...అతడు చెప్పింది అబద్ధం కాదన్నమాట? శూద్రుడి పూలతో స్వామికి పూజ చెయ్యటమా?...ఇంతకీ అవేం పూలు? అని కఠినంగా ప్రశ్నించింది రాధారాణి.

అంబర్‌నాథ్ అరటిదొప్ప తెరిచాడు. ఎర్రటి జపాపుష్పాలు పాలరాతి గోడమీద పారాణి పూసినట్టు ప్రతిబింబించాయి. రాధారాణి వెనక్కు రెండడుగులువేసి, "పూజారీ!" అని గర్జించింది - ఆడసింహంలా, అంబరుడు నిర్ఘాంతపోయాడు.

"పూజారీ! నువ్వొట్టి మూర్ఖుడివని తెలిసికూడా యిన్నాళ్ళూ సహించాను. నిన్న నాన్న అంతగా హెచ్చరించినా, మళ్ళీ అదే పాపకృత్యం చేయటానికి వచ్చావిక్కడికి. నువ్వు తక్షణం బయటికి వెళ్ళిపో," అంటూ ఒళ్ళుపై తెలియనికోపంతో రాధారాణి గట్టిగా అరిచింది.

అంబరుడు నిర్విణ్ణుడయిపోయి, ఒకటి రెండు నిమిషాలు స్థాణువులా కదలా మెదలక వూరుకున్నాడు. తన తప్పేమిటో యిప్పటికి తెలిసిందతడికి. శూద్రుడి నుంచి తీసుకున్న పూలు! శ్యామసుందరుణ్ణి, శ్యామలకి ప్రియమైన రక్తకుసుమాలతో పూజించటం! "అయ్యో, ఎంత మూర్ఖుణ్ణి, అజ్ఞానిని!" అనుకున్నాడు అంబర్‌నాథ్.

రాధారాణి, దాసీదానితో పెద్దగొంతుతో చెపుతున్న మాటలు అతడి చెవిని పడ్డాయి. "చప్పున వెళ్ళి ఆద్యనాథ్‌రాకూరును పిలుచుకురా; స్నానం చేసి ఏకంగా పూజచేయటానికి తయారై రమ్మని చెప్పు. ఈ పూజారివల్ల ప్రయోజనం లేదు."

అంబర్‌నాథ్ మారు మాటాడకుండా తలవంచుకొని దేవమందిరంనుంచి బయిటికి నడిచాడు.

ఆ సాయంత్రం జమీందారునుంచి అంబర్‌నాథ్‌కు కబురువచ్చింది. అతడు వెళ్ళగానే, రమావల్లభుడు సానుభూతి పుట్టిపడే గొంతుతో, "జరిగిందానికి విచా

రిస్తున్నాను. విన్న నా దగ్గర మాటయిచ్చి, మరుచటి రోజుకే దాన్ని నిలుపుకోలేక పోయావు. మందిరంలో నీ చేత అర్చనాదులు జరిపించటం రాధారాణికి యిష్టం లేదు. పాఠశాలలోని విద్యార్థుల్లో అధికభాగం నీ దగ్గర చదువుకోవటానికి అభ్యంత రాలు చెపుతున్నారు. నేను వీ ళ్ళందరికీ నచ్చచెప్పటం సాధ్యంలా తోచదు. అందు వల్ల వీలునామాలో సూచించబడినట్టు, ఇప్పుడు యీ రెండు బాధ్యతలూ నిర్వహిం చేందుకు మరొకర్ని నియమించటం ఉచితంగా వుండేలా కనబడుతున్నది. నీ అభి ప్రాయం ఏమిటి?" అన్నాడు.

అంబర్‌నాధ్ తలవంచుకుని, "తమ చిత్తం!" అన్నాడు.

అంబరుడింత పెద్ద పదవుల్ని వదిలెయ్యటానికి రవంత అభ్యంతరంకూడా చెప్పకపోవటం చూసి, రమావల్లభుడు కొంచెం ఆశ్చర్యపోయి, అతడికేసి చూస్తూ కొంచెంసేపు వూరుకుని, ప్రసన్న కంఠంతో, "ఇందులో నీ తప్పు ఏమీ లేదు. నాకు తెలుసు, నువ్వు నీ అసమర్థతగురించి మొదట్లోనే చెప్పుకున్నావ్. కనక ఈ పదవులు పోతున్నవనే విచారం నీ కేమీ లేదనుకుంటాను. అందువల్ల, ఎవరైతే యీ పదవులకోసం పాకులాడుతున్నారో, అందరూ ఎవర్ని యీ పదవుల్లో నియ మించాలనుకుంటున్నారో - వారినే యీ పదవుల్ని తీసుకోనియ్. ఏమంటావ్?" అని అడిగాడు.

అంబర్‌నాధ్, రమావల్లభుడికి సవినయంగా నమస్కరించి, లోగడ అన్నట్టే, "తమ చిత్తం," అన్నాడు.

# 5

కాలం గడిచిపోతున్నది. చనిపోయిన జమీందారు హరివల్లభుడు రాసిపోయిన వీలునామా, అతడి కొడుకైన రమావల్లభుడి మెడకు యమపాశంలా బిగుసుకుపో తున్నది. ఇంకొక్క నెలరోజుల్లో రాధారాణికి పదిహేనవ ఏడు ముగిసి, పదహారో ఏడు వస్తుంది. ఈ నెల లోపల తాను కుమార్తె వివాహం చేయలేకపోతే, ఆస్తి పాస్తులు వదిలి సకుటుంబంగా అరణ్యమార్గాలు పట్టవలసిందే!

ఈ గడిచిన కాలంలో రమావల్లభుడు, కూతురుకు తగిన సంబంధాలకోసం చాలా ప్రయత్నాలు చేశాడు. కాని, తండ్రి వీలునామాలోని షరతులకు అనుకూ లించే సంబంధా లేవీ అతడికు తారసపడలేదు; చివరకు తండ్రిపెట్టిన గడువు మరో నెలలో ముగుస్తుందనగా, అతడు భార్యతో ఆలోచించి, మృణాక మోహనుణ్ణి ఒక సారి అవసరంగా వచ్చిపొమ్మని ఉత్తరం రాశాడు. పదిహేనో ఏడు వెళ్ళే లోపల




రాధారాణి వివాహం జరక్కపోతే, యావదాస్తీ యీ మృగాంకమోహనుడికే చెందాలని హరివల్లభుడు వీలునామా రాసివున్నాడు. ఈ మృగాంకుడు పెద్ద జమీందారుకు వేలువిడిచిన మేనత్త కుమారుడు.

ఉత్తరం అందిన మర్నాడే బయలుదేరి మృగాంకుడు రాజనగర్ వచ్చాడు. అతడు పెద్ద జమీందారు బతికివుండగా రెండు మూడు సార్లు వచ్చిపోయాడు. ఆ కారణంగా రమావల్లభుడి ఇంట్లోని వారందర్నీ అతడు బాగా ఎరుగు. ఈసారి వచ్చి రాధారాణిని చూసి విస్మితుడయిపోయాడు. అతడు కృష్ణప్రియను పిలిచి, "ఏం అత్తా! రాధూకి వివాహం ఎప్పుడు చేస్తారు? బాగా ఎదిగింది కదా. ఇంత ఎదిగిన పిల్లను పెళ్ళిచెయ్యకుండా యింట్లో పెట్టుకుంటే, మీలాంటి గొప్పవాళ్ళకు మంచినీళ్ళు గొంతు దిగవంటారు!" అన్నాడు నవ్వుతూ.

"ఆ దిగులుతోనే కుంగిపోతున్నాం, నాయనా! ఈ విషయంలో నువ్వేదయినా సలహా యిస్తావనే, నిన్ను రమ్మని వుత్తరం రాశాం," అన్నది కృష్ణప్రియ.

"ఏం సలహా కావాలో చెప్పు, మరి," అన్నాడు మృగాంకుడు.

కృష్ణప్రియ, తన మామగారు రాసిపోయిన వీలునామా సంగతంతా అతడికి చెప్పింది. ఈ కొద్ది రోజుల్లో తాము పిల్లకు వివాహం చెయ్యలేకపోతే, తన మామగారి సంపదంతా అతడికే చెందుతుంది. ఈ విషయం తెలిసికూడా మృగాంకుడు

ఏ మాత్రం తొణకలేదు. అతడు అతిసాధారణ విషయంగురించి మాట్లాడుతున్న వాడిలా, "ఆ వీలునామా సంగతి ఎవరెవరికి తెలుసో, చెప్పు," అని అడిగాడు.

"బయటివాళ్ళకెవరికీ తెలియదు. ఆ వకీలుగారికి తప్ప," అన్నదికృష్ణప్రియ.

"ఇంకేం-ఆయనకింత దాణా వెయ్యండి, సరిపోతుంది," అన్నాడు మృగాంకుడు.

ఆ సలహాకు కృష్ణప్రియ కంపించిపోతూ," అలా కుదరదు, నాయనా! ధర్మానికి కట్టుబడివుండే సంసారం యిది," అన్నది.

"ఇందులో అధర్మం ఏమీలేదు. ఆయనికి ముసలితనంలో మతిపోయింది. కాకపోతే, ఎవరైనా యింత తలతిక్క వీలునామా రాస్తారా?" అన్నాడు మృగాంకుడు.

"మామగారికి మేలనితోచిన దేదో చేశారు. ఏది ఏమయినా యిప్పటికీ యీ ఆపదనుంచి బయటపడేందుకు ఓ ఉపాయం వున్నది. ఆ ఉపాయంకూడా నీ చేతిలోనే వున్నది." అన్నది కృష్ణప్రియ.

"నువ్వనేది అర్థం కావటంలే దత్తా, చివరిలగ్నానికి ఉన్నగడువు పదీ పదిహేను రోజులు. నువ్వు, ఊఁ అంటే బి. ఏ. ఎమ్. ఏలను పట్టుకురాగలను. కాని కులీనులు దొరకటం మాత్రం కష్టం..."

మృగాంకుడు మాట ముగించేలోపల కృష్ణప్రియ అందుకుని, "నువ్వున్నావుగా, నాయనా!" అనేసింది.

ఈ మాటకు మృగాంకుడు ఉలిక్కిపడి, "నేను ప్రస్తుతం ఎలావున్నానో అలాగే వుండిపోవటం మేలు, అత్తా; నీ కూతురు ఆడతాచులాంటిది. ఆమె సవతిబాధను సహించగలదా! వివాహం అయిననాటినుంచీ, కొన్ని కారణాలవల్ల నా భార్యను కేవలం నేస్తంగానే చూస్తున్నాను... కాని, రాధా మాత్రం ఆమెని సవతికిందే జమకట్టుతుంది," అన్నాడు.

హఠాత్తుగా పైన పిడుగుపడ్డట్టు స్తంభితురాలై పోయింది, కృష్ణప్రియ ఆమె ఎంతో కష్టంమీద, తడబడే గొంతుతో, "సవతా? నీకు పెళ్ళయిందా ఏం?" అన్నది.

"అయింది... నేనొక రకంగా దౌర్భాగ్యుణ్ణి; వంచకుణ్ణి మాత్రంకాదు. నేను రాధారాణిని వివాహం ఆడలేను. కాని, ఒక సహాయం మాత్రం చెయ్యగలను. మా వూళ్ళో ఒక యువకుడు... ఆ మధ్యనే వచ్చినవాడు, తన జ్ఞాతి సోదరుడిఇంట్లో వుంటూ, వూళ్ళో సంస్కృత పాఠశాల పెట్టాలని ప్రయత్నిస్తున్నాడు. అతడు మన కోవలోనివాడని నాకు బాగా తెలుసు. మీరు ఒప్పుకునేటట్టయితే, అతణ్ణి తీసుకువచ్చి

మీకు అల్లుణ్ణి చెయ్యగలను. మీ సిరిసంపదలమీద నాకు రవ్వంతయినా లోభంలేదు. అవి చెక్కు చెదరకుండా మీకే వుండాలని నా ఆకాంక్ష." అన్నాడు మృగాంకుడు.

"అలా చేసినా బతికిపోతాం, నాయనా? ఆకుర్రవాడి పేరేమిటి?" అన్నది కృష్ణప్రియ.

"పేరా? అంబర్‌నాథ్," అన్నాడు మృగాంకుడు.

ఈమాటవిని కృష్ణప్రియ కొంతసేపు నిశ్చేష్టురాలై, చివరకు మనస్సు సరి పెట్టుకుని భర్త దగ్గరకువెళ్ళి, సంగతి సందర్భాలన్నీ చెప్పింది. ఇల్లరికపు అల్లుడు కావాలనుకున్నప్పుడు యిలాంటివాళ్ళే దొరుకుతారన్నది. అతడికి పూజాఅదీ సక్ర మంగా చెయ్యటం తెలియదు అనేది పెద్ద దోషం కాదనీ, అది మీకూ చేతకాదుగదా అన్నది. అంతేకాక, మామగారు పెట్టిన గడువు దాటిపోతున్నదనీ, యీ పదీ పది హేను రోజుల్లోపల రాధారాణి వివాహం చేయలేకపోతే, అందరం బికార్లమైపోవ లసి వస్తుందనీ గుర్తుచేసింది.

రమావల్లభుడు, భార్యమాటలకు ఊఁ కొడుతూ వూరుకున్నాడు. ఏ తండ్రీ తన కూతురుకు యింతఘోరమైన శిక్ష విధించలేడనిపించిం దతనికి. అయోగ్యుడని నిర్ణ యించబడి వెళ్ళగొట్టబడిన తమ పూర్వ నౌకరు అంబర్‌నాథుణ్ణి వివాహం ఆడమని తన కుమార్తెకు ఎలా చెప్పగలడు?

భార్యాభర్తలు యీ విషయంమీద కొంత చర్చ సాగించారు. భార్యఎన్నిచెప్పినా రమావల్లభుడు యీ సంబంధానికి మనస్సును సరిపెట్టుకోలేక పోయాడు. అయితే, పదీ పదిహేనురోజుల తరవాత తనకు పట్టనున్న దుర్దశ మాటేమిటి?

తన తలిదండ్రులు చేస్తున్న వాదోపవాదాల సంగతి దాసీలద్వారా రాధారాణి చెవినిపడింది. ఆమె తోకతొక్కిన తాచులా అయి, తల్లి గదినుంచి బయిటికి రాగానే, ఆమెను సమీపించి, "నీ కెందుకొచ్చిన మనస్తాపం! నేను ఇల్లువిడిచి ఏ అరణ్యాలకో పోతాను. నేను లేకపోతే తాతయ్య వీలునామా పాటించవలసిన అవ సరంలేదుగదా?" అని అడిగింది.

"ఏం జరిగింది? ఎందుకలా మాట్లాడుతున్నావ్?" అన్నది కృష్ణప్రియ.

"జరగటానికేముందీ? నువ్వు నాకోసం ఎక్కడెక్కడ ఎలాంటి మూర్ఖులూ, మూర్ఖాగ్రేసరులూ వున్నారో - వాళ్ళందరికోసం వెతుకుతున్నావ్!" అన్నది రాధారాణి రౌద్రంగా.

"బ్రాహ్మణి... సజ్జనుణ్ణి అలా తిట్టిపోస్తావెందుకు? ఏమిటా సాహసం.

ఇన్నాళ్ళూ మందిరంలో పూజలూ, జపాలూ చేసి నువ్వు నేర్చుకున్న దిదా?" అన్నది కృష్ణప్రియ.

"ఓహో, చాలా గొప్ప బ్రాహ్మడే! జపాకుసుమాలని హరిపూజకు ఏ ఆస్తికు డైనా వుపయోగిస్తాడా? తులసిదళాలతో శివపూజా, జపా కుసుమాలతో విష్ణుపూజ చేసేతంట మహాజ్ఞాని!" అన్నది రాధారాణి విపరీతమైన ఉద్రేకంతో.

కూతురు ధోరణిచూసి కృష్ణప్రియ మరేం మాట్లాడలేకపోయింది. తల్లి అలా వూరుకోవటంతో రాధారాణి అక్కడినుంచి చరచరా తన గదిలోకి వెళ్ళిపోయింది. దుఃఖంతో, అభిమానంతో, అవమానంతో ఆమెకళ్ళు నిప్పులు కురుస్తున్నాయి.

ఒకటీ రెండు గంటలకాలం గడిచిపోయింది. రాధారాణి కొంత కోపం చల్లారిన తరవాత తన పరిస్థితీ, తలిదండ్రులకు రానున్న దుస్థితినిగురించి ఆలోచించసాగింది. తను గడువులోగా వివాహిత కాకపోతే, అందరితోపాటు తనూ, ఈ ఇంటినీ, తన జీవితానికి వెలుగులాంటిదయిన రాధాకృష్ణ మందిరాన్నీ వదిలి మరెక్కడికో పోవ లసి వుంటుంది. ఆ స్థితికన్న దుర్భరమైనది మరొకటి వుండదు...

హఠాత్తుగా ఆమెకొక ఆలోచన కలిగింది. ఆ వెంటనే ఆమె గదినుంచి బయ టికివచ్చి, తుఫానులా తండ్రివున్న గదిలోకి దభాలున తలుపు తెరుచుకుని ప్రవేశిం చింది. రమావల్లభుడు తలవంచుకుని ఆలోచిస్తున్నవాడల్లా, తలఎత్తి కూతురుకేసి చూసేంతలో. ఆమె, "నాన్నా! ఏమిటీ దుర్వార్త? ఇంతకంటెనన్ను చిత్రాసదిలో పారవెయ్యరాదూ? అన్నిచిక్కులూ తీరిపోతాయి," అన్నది.

రమావల్లభుడు వ్యాకులపడుతూ కూతురుకేసి చూసి, "అమ్మా! ఇదంతా నా పాపానికి ప్రాయశ్చిత్తం; నాకు మతి చెడింది. ఏ దిక్కూ తోచకుండా వుంది. చెప్పు, నన్నేం చెయ్యమంటావ్?" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

తండ్రి కళ్ళనీళ్ళు చూస్తూనే రాధారాణి విచలితురాలై పోయి, చప్పున ఓ నిర్ణ యానికి వచ్చి, బొంగురుపోయిన గొంతుతో, "నాన్నా! ఎలా జరగవలసింది అలా జరిగి తీరుతుంది! కాని ఒకటి... అతడు వివాహం అయినతరవాత యిక్కడ వుండటానికి వీల్లేని షరతుమీద, ఈ సంబంధానికి ఒప్పుకుంటానని నువ్వు మాట యివ్వు. నే నెలా వున్నదాన్ని అలాగే వుండిపోతాను. అతడు శాశ్వతంగా దేశం విడిచి వెళ్ళిపోతాడా?" అని అడిగింది.

కూతురు యిలా అనేసరికి రమావల్లభుడికి అంధకారంలో ఏదో కాంతిరేఖ కనిపించినట్టయింది, అతడు నెత్తిమీంచి పెద్దభారం తొలగిపోయినవాడిలా ఒక్క సారి నిట్టూర్చి, "అమ్మా, రాధారాణీ! నువ్వు నన్ను బతికించావ్, తల్లీ, అతణ్ణి




పిలిపించి నువ్వు చెప్పినమాటే చెపుతాను. నీ సూచన అన్నివిధాలా బావుంది." అన్నాడు

"అయితే, అలాగే చెయ్యి, నాన్నా! నే చెప్పింది మాత్రం బాగాగుర్తుపెట్టుకో," అన్నది రాధారాణి కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"అఁహ్హా, యిది మరిచిపోయే మాటా, తల్లీ!" అన్నాడు రమావల్లభుడు తడబడుతున్న గొంతుతో.

## 6

మృగాంకమోహనుడి జమీందారీ గ్రామంలో పురోహితుడుగా వుంటున్న గంగారామశర్మ, అంబర్‌నాథ్‌కు వరసకు అన్న అవుతాడు. రాజనగర్‌లో అవమానం పొంది, సంస్కృత పాఠశాల ప్రధానాధ్యాపక పదవీ, రాధాకృష్ణ మందిరపు అర్చకత్వం కోల్పోయిన తరవాత కొన్నాళ్ళకు అంబరుడు, గంగారామశర్మ ఇంటికి చేరాడు. గంగారామ్ చాలా బీదవాడు, పైగా అతడిది గంపెడు సంసారం. అంబరుడు ఊళ్ళోని పెద్దల సాయంతో సంస్కృత పాఠశాల ప్రారంభించేందుకు గట్టి ప్రయత్నాలు చేస్తున్నాడు. అతడు రాజనగర్‌లో తాను పొందిన భంగపాటుసంగతి దాదాపు మరిచేపోయాడు.

ఈ దశలో ఒకనాడు గంగారామశర్మ ఊళ్ళో పౌరోహిత్యపు పనులు ముగించుకుని స్వయంపాకాలమూటతో యింటికి హడావిడిగా వచ్చి, మూటను వంటయింటి గుమ్మంలో పెట్టి, నడవలో తాళపత్ర గ్రంథాలు చూసుకుంటున్న అంబరుడి దగ్గరకు వెళ్ళి "అంబర్! నీ కొకప్పుడు ఆశ్రయం యిచ్చిన జమీందారు రమావల్లభబాబు నా పేర ఉత్తరం రాశాడు. నిన్ను ఒకసారి వెంటనే రాజనగర్ కు పంపవలసిందిగా- ఆయన అభ్యర్థిస్తున్నారు. నిన్ను అక్కడికి తక్షణం పంపించగలిగితే, నాకు వార్షికం ఏర్పాటు చేస్తానన్న సూచనకూడా వుంది వుత్తరంలో. ఇంతకీ సంగతేమయి వుంటుందంటావ్?'' అని ప్రశ్నించాడు.

అన్న మాటలు విని అంబర్‌నాథ్ చాలా ఆశ్చర్యపోయాడు. రమావల్లభబాబు తన నెందుకు రమ్మని రాసినట్టు? తా నెన్నడూ ఆయనికి రవంతగానైనా ఉపయోగ పడలేదే?...

ఇలాంటి ఆలోచనల్లో మునిగితేలుతున్న అంబరుణ్ణి, గంగారామశర్మ ఓసారి పరీక్షగాచూసి, అతడు వెళ్ళేందు కేదో సంశయిస్తున్నాడనుకుని, "అంబర్! నువ్వు రాజనగర్ వెళతావా?" అని అడిగాడు.

"వెళ్ళటానికేం. ఉత్తరం మీరు బాగా చదివారా? జమీందారుగారు నన్ను రమ్మన్న ఆదేశం అందులో స్పష్టంగావుందా?" అని అడిగాడు అంబర్‌నాథ్.

"స్పష్టంగానేవుంది. ఎందుకు సంశయిస్తున్నావ్?" అన్నాడు గంగారామ్.

అంబరుడు కాస్త విచలితుడైపోయి, నేలచూపులు చూడసాగాడు. ఇదంతా ఏదో కలగా తోస్తున్నదతడికి, రాజనగర్ స్మృతులన్నీ ఎంతో బాధాకరమైనవి; అయినా వెళ్ళకతప్పదు. "వెళ్ళకపోవటం ఎలా? పిలిచినప్పుడు వెళ్ళక తప్పుతుందా? వెళ్ళాలి." అన్నాడు అంబరుడు దీర్ఘంగా నిట్టూర్చుతూ.

"బాగా చెప్పావు, వెళ్ళకపోవటం అంటే కృతఘ్నతా పాపాన్ని పైనవేసుకోవటమే అవుతుంది. శాస్త్రాల్లో అన్నదాతకు తండ్రికిచ్చే స్థానాన్నీ, గౌరవాన్నీ ఇచ్చారు." అన్నాడు గంగారామశర్మ.

అంబర్‌నాథ్ ఆ సాయంకాలమే బయలుదేరి మర్నాటి ఉదయానికల్లా రాజనగర్ చేరాడు. వెంటనే అతడికి రమావల్లభుడినుంచి పిలుపువచ్చింది. అతడు వెళ్ళేసరికి ఆయన తివాచీలు పరిచివున్న పెద్దహాల్లో, మెత్తని పరుపులమీద బాలీసులకు చేర గిలబడి కూర్చునివున్నాడు. అంబర్‌నాథ్ ఆయన్ని సమీపించి నమస్కరించగానే, రమావల్లభుడు ముఖంలో ఎక్కడలేని ఆనందాన్నీ కనబరుస్తూ, "వచ్చావా?

అమ్మయ్య! బతికిపోయాను. వస్తావా? రావా—అన్న సందేహంలో పడి చచ్చిపోతు న్నాను," అన్నాడు.

తరవాత రమావల్లభుడు, అంబరుణ్ణి కూర్చోమని, "నిన్ను పిలిపించిందెందుకో బహుశా యింకా నీకు తెలిసివుండదనుకుంటాను. ఇవ్వాళ నా సర్వస్వం నీమీద ఆధారపడివున్నది. అందుకే నీకోసం కబురంపాను," అన్నాడు.

అంబర్‌నాథ్ ఆ మాటలువిని ఎక్కడలేని ఆశ్చర్యం పొందాడు. "జమీందారేమిటి యిలా మాట్లాడుతున్నాడు? ఏమిటిదంతా?" అన్న విస్మయం కలిగిందతడికి. రమా వల్లభుడది గ్రహించి, "నా మాటల్ని నువ్వు విశ్వసించలేక పోతున్నావ్, అవునా? కాని, యీ మాటమాత్రం నిజం. ఈనాడు నీమీదనే నా మానమర్యాదలూ, సిరిసంప దలూ — అన్నీ ఆధారపడివున్నాయి అంతా వివరంగా చెపుతాను. ప్రస్తుతం నువ్వేం చేస్తున్నావో చెప్పు. నీ భవిష్యత్తుగురించి ఏమైనా ఆలోచించుకున్నావా?" అని అడిగాడు.

అంబర్‌నాథ్‌కి అంతా అయోమయంగా తోచింది. ఏమిటీ మాటలు? అయినా, తను ప్రశ్నించటం మంచిదికాదు. ప్రశ్నకు జవాబు చెప్పటమే ఉచితం. ఇలా అను కుని, "నాలుగైదు మాసాలుగా నేను గంగారాంశర్మ అన్నగారి ఇంటివద్ద వుంటు న్నాను అంతకుముందు విద్యకోసం నేను చాలాప్రాంతాలు తిరిగాను. నాకు శాస్త్ర విద్యలునేర్పి, దీక్షయిచ్చిన గురుదేవులు స్వర్గస్థులయారు. ఆయన అస్సాంలోని కుమిల్లాలోనూ, మరి రెండుమూడుచోట్లా సంస్కృత పాఠశాలలు స్థాపించాలని ప్రయత్నించారు. ఆభారం వారు నా కప్పగించిపోయారు. కనుక, నేను ఆ ప్రాంతా లకువెళ్ళి వారు అప్పగించి పోయినపనులు పూర్తిచేయగలనేమో ప్రయత్నించా లనుకుంటున్నాను," అన్నాడు.

"ఆ పనులకు వారేమైనా ఆస్తి సంపాదించి వదిలి పోయారా?" అన్నాడు రమావల్లభుడు.

"ఆ మొత్తం చాలా స్వల్పం. చందాలు వసూలుచేసి ఆపనులు నిర్వహించవల సిందే," అన్నాడు అంబర్‌నాథ్.

ఆ జవాబుతో రమావల్లభుడు కొంచెం ఉత్సాహితుడై, "చాలా గొప్పకార్యం! సంస్కృతభాష సాక్షాత్తూ దేవభాష. ఆ భాషద్వారానే మనం దేవతల్ని అర్థంచేసు కోగలం. నీ కార్య నిర్వహణకోసం నేను ఏడాదికి పదివేలరూపాయల చొప్పున విరాళం యివ్వగలను.'' అన్నాడు.

"చాలా గొప్పసహాయం. తమరు మహనీయులు," అనేశాడు అంబర్‌నాథ్

ఆనందం పట్టలేక. కాని, ఆ వెంటనే అతడికి తన స్వభావ విరుద్ధమైన ఆ 'మహనీయులు' అన్నపొగడ్త వాడినందుకు మనస్సు చివుక్కుమన్నది.

"ఈ నిమిషంలో నాలో మహత్వం ఏమీలేదు నువ్వు నాకో గొప్ప సహాయం చెయ్యాలి," అన్నాడు రమావల్లభుడు.

"ఆదేశించండి," అన్నాడు అంబర్‌నాథ్ వినమ్రంగా.

"మా నాన్నగారు నామీద కోపంకొద్దీ ఓ వీలునామా రాసిపోయారు. నాకూతురు రాధారాణికి పదిహేనోఏడు వెళ్ళేలోపుగా, ఆమెను మాతో సరితూగే కులీనుడైన వరుడికిచ్చి వివాహం చెయ్యకపోతే, ఆ మరుచటిరోజునే మా స్థిరచరాస్తియావత్తూ, మాకు దూరపుబంధువైన ఒకరికి చెందుతుందని. ఆయనకి మొదటినుంచీ ఆ బంధువైన కుర్రాడంటే చాలాయిష్టం. రాధారాణిని అతడికివ్వాలని ఒకటిరెండుసార్లు ప్రయత్నించాడుకూడా. కాని, నే నా కుర్రాడిప్రవర్తన మంచిదికాదని అభ్యంతరం చెప్పాను. తప్పనిసరి పరిస్థితివచ్చి, నేను అతడికి రాధారాణిని యిస్తానన్న నమ్మకంతో మానాన్న ఆ స్తికంతకూ అతణ్ణి ఉత్తరాధికారిగా చేసిపోయాడు. కాని, యిప్పుడతడు వివాహితుడు. నే నిస్తానన్నా రాధారాణిని చేసుకోటానికి యిష్టపడేలా లేడు. ఈ కష్టాన్నుంచి బయటపడేమార్గం యిప్పుడొక్కటే వున్నది..." ఆగాడు రమావల్లభుడు.

అంబర్‌నాథ్ ఏదో విచిత్రగాథ వింటున్నట్టు అబ్బురపడిపోయి, రమావల్లభుడు చెప్పటం ఆపేసరికి, అతడిముఖంకేసి చూస్తూ వినయంగా, "నావల్ల కాదగిన పనేమిటో- ఆదేశించండి," అన్నాడు.

"నువ్వు ఒక్కమాటతో మా కష్టాలన్నీ తొలగించగలవు. నే చేయగల ప్రయత్నమంతాచేసి విఫలుణ్ణయాను. నువ్వు మా శాఖీయుడివి. రాధారాణిని వివాహం ఆడు," అన్నాడు రమావల్లభుడు.

అంబర్‌నాథ్ ఆ మాటలువింటూనే మెరుపుదెబ్బ తిన్నవాడిలా నిర్విణ్ణుడైపోయి, రమావల్లభుడికేసిచూస్తూ వూరుకున్నాడు అతడి నోటినుంచి ఒక్కమాటకూడా పెగల్లేదు

రమావల్లభుడు అతడి మానసస్థితిని గ్రహించి, "చూడు, అంబర్! నేచెప్పింది అర్థమయిందా ? నువ్వీందుకు ఒప్పుకోకపోతే నా యావదాస్తీ పదిహేనూ- ఇరవై రోజులతరవాత పరులపాలవుతుంది," అన్నాడు

అంబరుడు తలవంచుకుని కొద్దిసేపు ఆలోచిస్తూ వూరుకుని, తలఎత్తకుండానే, "క్షమించండి. ఇందుకు నే నంగీకరించలేను " అన్నాడు.




"ఎందుకని, అంబర్?" అని ప్రశ్నించాడు రమావల్లభుడు-ఉద్వేగంగా.

"మా గురుదేవులు నాపై వుంచిపోయిన భారం చాలా పెద్దది. సంస్కృత పాఠశాలలూ అవీ స్థాపించాలనే నా ప్రయత్నానికి, వివాహం విఘ్నకారి అవుతుంది," అన్నాడు అంబర్‌నాథ్. ఇది చాలా పేలవమైన జవాబని అతడికి తెలుసు, కాని, నిజకారణాలు చెప్పాలంటే, తను చాలా చిత్తక్షోభ పడవలసి వస్తుంది.

"నీ ప్రయత్నాలకు వివాహం విఘ్నం కలిగించదు. నేను నీకు ఆర్థికసాయం చెయ్యబోతున్నాను. అంతేకాక మా అమ్మాయి..." అని చెప్పదలచుకున్న మాటను సగంలో మింగేసి, రమావల్లభుడు, "నేను యిచ్చేవిరాళంతో నువ్వు ఒకటికాదు-అయిదు సంస్కృతపాఠశాలలు స్థాపించవచ్చు. నీ సొంతఖర్చుకి వేరే కొంత ధనం యిస్తుంటాను." అన్నాడు.

"నన్ను ప్రలోభపెట్టకండి ఇందులో చాలా ఇబ్బందులున్నాయి. అవన్నీ మీతో చెప్పటం సాధ్యంకాదు-నాకు," అన్నాడు అంబర్‌నాథ్.

"నన్ను అపార్థం చేసుకోకు, అంబర్! ఇందులో ప్రలోభం ప్రసక్తి ఏముంది? నా అల్లుడుగా నువ్వు, నేనిచ్చే ధనాన్ని స్వీకరించవచ్చు." అన్నాడు రమావల్లభుడు.

అంబరుడు హతాశుళ్ళా ముఖంపెట్టి, "గురుదేవులు నాకాదేశించిన కార్యం నెరవేర్చకుండా నేను అస్సాం ప్రాంతాలను విడవకూడదనుకున్నాను. కొద్ది నెలల

కాలం వుండేందుకు మాత్రమే నేను మా అన్నగారి గ్రామం వచ్చాను. అస్సాంలోని షిల్లాంగ్ ప్రాంతాలు చాలా చాలా అనారోగ్యకరమైనవి. మామూలు దినాల్లోకూడా అక్కడి కెవరూ సకుటుంబంగా రావటానికి సాహసించరు. మరి, నేను కొన్నేళ్ళ పాటు అక్కడే వుండిపోవలసి వస్తుందిగా?" అన్నాడు.

ఏమి టా మాటలు? ఏమి టా అతిశయం? అనుకున్నాడు రమావల్లభుడు మనసులో. రమావల్లభ జమీందారుకూతురు దరిద్రుడైన భర్తతో అస్సాం కొండ ప్రాంతాల పూరిపాకలో నివసిస్తుందా? ఈ అంబరుడి కేమైనా పిచ్చా?

"పోనీయ్. నువ్వా ప్రాంతాలలో వున్నన్నాళ్ళూ, మా అమ్మాయి మా ఇంటనే వుంటుంది. ఈ వివాహానికి నువ్వంగీకరించాలి. ఉన్న వ్యవధి బహు స్వల్పం. ఆ తరవాత మేం బికారులమైపోతాం.'' అంటూ రమావల్లభుడు పెద్ద నిట్టూర్పు విడిచి మెదలకుండా వూరుకున్నాడు.

జమీందారు మాటల్లోని నిస్పృహా, నిరాశలు అంబరుడి కోమల హృదయాన్ని బాగా కలతపరిచాయి. "నాకు ఆలోచించుకునేందుకు కాస్త వ్యవధి ఇవ్వండి." అన్నాడతడు

"అలాగే. ఇందులో ఓ ముఖ్యవిషయంకూడావుంది. వివాహం అయింతరవాత మా అమ్మాయి, మా ఇంటనే వుంటుంది. కుటుంబానికి మేలు చేయాలనే ఉద్దేశంతోనే, అసలామె నిన్ను వివాహం ఆడుతున్నది. నీకూ, యీ వివాహం అంత యిష్టం కాదు గనక ... యిందుకు నీ అభ్యంతరం ఏమీ వుండదనుకుంటాను; మరింత స్పష్టంగా చెప్పాలంటే పెళ్ళి తరవాత నీకూ, మా అమ్మాయికీ ఎలాంటి సంబంధమూ ఉండబోదు; ఇది నీకు యిష్టమేనా?"అని ప్రశ్నించాడు రమావల్లభుడు.

అంబర్‌నాథ్ ముఖంమీది నరాలు కొంచెం ఉబికాయి. అతడు ముఖం ఎత్తి జమీందారుకేసి నిశితంగా చూస్తూ, "కాదు," అన్నాడు.

''కాదా? ఎందువల్ల? ఈ వివాహం నీకూ యిష్టమైంది కాదుగా!'' అన్నాడు రమావల్లభుడు.

"వివాహం నాకు ఇష్టంలేని మాట నిజమే. కాని, చేసుకోక తప్పనిసరి అయితే మాత్రం శాస్త్ర విధిని ఉల్లంఘించటం కుదరదు. అగ్నిముందు, బ్రాహ్మణుల ఎదట, వివాహమంత్రం నా చేత చేయించే ప్రతిజ్ఞ ఏమిటి? ఐహికాముష్మికాలకోసమై పవిత్ర బంధాన్ని అంగీకరించటానికి సిద్ధపడినప్పుడు, సుఖదుఃఖాలలో యిరువురూ పాలుపంచుకోవటానికి అంగీకరిస్తూ మనసులో మాత్రం ఆ వివాహోద్దేశా



లను అంగీకరించక, పైకి మాత్రం ఆ మంత్రాన్ని వూరికే ఉచ్చరించనా ? పితృ తుల్యులు తమరు; నన్నిలా ఆదేశించకండి, క్షమించండి," అన్నాడు అంబర్‌నాథ్.

రమావల్లభుడు ఆసనం మీదినుంచి లేచి గదిలో అటూ ఇటూ కొంత సేపు పచార్లుచేసి, తరవాత అంబరుడిదగ్గిరకు వచ్చి, అతడి భుజంమీద చెయ్యివేసి, "అంబర్, నువ్వు అన్నదంతా నిజమే; కాని, నేను చాలా కష్టదశలో వున్నానన్న మాట గుర్తుంచుకో. నే నీ నాడు నీ సహాయాన్ని అర్థిస్తున్నాను. నువ్వు భార్య విషయంలో కర్తవ్యపాలన సంగతి మాట్లాడావు. ఆమె తాలూకు ఆస్తిపాస్తులు, ఆమె తలిదండ్రుల పరువుప్రతిష్ఠలు కాపాడటం–ఆ కర్తవ్యపాలనలో భాగం కాదా ?" అన్నాడు.

అంబర్ ఏమీ మాట్లాడలేదు, చలించలేదు. అతడు చాలాసేపు వ్యాకులమైన హృదయంతో తలవంచుకు వూరుకున్నాడు. అతడి మనస్సులో రేగుతున్న మిశ్రమ భావాల తుఫానుగురించి స్పష్టంగా ఏమీ చెప్పటం సాధ్యం కాదు. కొన్ని క్షణాలు గడిచినై. అంబరుడు తలఎత్తి, రమావల్లభుడి ముఖం కేసి చూపకుండా చూపుల్ని

పక్కలకు ప్రసరింపచేస్తూ, వణుకుతున్న కంఠంతో, "నన్ని రాత్రికి ఆలోచించుకో నివ్వండి." అన్నాడు.

రమావల్లభుడు ఏమీ మాట్లాడలేదు అందరుడాయనకు నమస్కరించి అక్క ణ్ణించి మెల్లిగా బయటికి వెళ్ళిపోయాడు.

ఆనాటి సంధ్యాసమయంలో రాధారాణి, రాధాకృష్ణ మందిరానికి వెళ్ళింది. హారతికి యింకా ఆలశ్యం వుంది. మందిరంలో ఎవరూలేరు. స్వర్ణమండిత స్ఫటికాధారాల్లోని దీపాల వత్తుల వెలుగులో మందిరమంతా పట్టపగలులా వుంది. రాధారాణి మోక రించి కూర్చుని, ఊర్ధ్వ ముఖియై దేవతావిగ్రహాలకేసి చూడసాగింది. ఆమె హృద యంలో దుఃఖతరంగాలు సుళ్ళు తిరిగి, అశ్రురూపంగా బయలువెడలసాగాయి; "ప్రభూ! నే చేసిన ఏ పాపం మూలంగా నాకీ శిక్ష విధించబోతున్నావ్?" అంటూ ఆమె ఆక్రోశించసాగింది

ఆ సమయంలో తలుపుగొళ్లెం కొంచెం కదిలినట్టయింది ఎవరో గొళ్ళెం మీద చేయివేసి, నిశ్శబ్దంగా తలుపుతెరిచారు రాధారాణి నివ్వెరపోయి, తన కన్నీళ్ళు ఎవరైనా చూస్తారన్న భయంతో చప్పున తుడిచేసుకున్నది. ఆమె తల తిప్పిచూసే సరికి మందిరంలోకి రావాలనుకున్న వ్యక్తి, తలుపులను దగ్గరకువేసి వెనక్కి తిరిగి పోయాడు. ఆ వచ్చిన వ్యక్తి పురోహితుడైన ఆద్యనాధుడు కాదని రాధారాణి గ్రహించింది. అతడైతే తిరిగెందుకుపోతాడు? "వెనక్కి తిరిగిపోతున్నారేం? స్వామికి నమస్కరించాలని వచ్చినవారు నమస్కరించే పోరాదూ!" అంటూ రాధారాణి గట్టిగా పిలిచింది.

ఆ పిలుపు వింటూనే అంబర్‌నాథ్ తలుపుతెరుచుకుని మందిరంలో ప్రవేశించాడు. రాధారాణి అతణ్ణి చూస్తూనే నిలువెల్లా వణికిపోయింది. అంబరుడామెను గుర్తించ నట్టే ముందుకు వచ్చి, దేవుడికి ప్రణమిల్లి లేచి వెనక్కి తిరిగాడు. ఆ సమయంలో రాధారాణి అతణ్ణి వుద్దేశించి, "ఆగండి, మీతో మాట్లాడాలి," అన్నది.

అంబర్‌నాథ్ గతుక్కుమన్నాడు; ముఖం ఆమెకేసి తిప్పకుండానే, వున్నచోటున స్థాణువులా నిలబడిపోయాడు. రాధారాణి అడుగులో అడుగు వేసుకుంటూ అతణ్ణి సమీపించి, "నాన్నగారిని కలుసుకున్నారు గదా?" అన్నది.

"ఆఁ" అంటూ తలాడించాడు అంబర్‌నాథ్.

"వారికి సమాధానం యిచ్చారా?"

"రేపు చెపుతానన్నాను," అన్నాడు అంబరుడు కొంచెంగా వణుకుతూ.

"నా అభిప్రాయం ఏమిటో యిప్పుడే చెప్పటం మంచిది. వివాహం అయిన

మర్నాటినుంచే నేను స్వతంత్రంగా వుండదలిచాను. ఆ ఒక్కరోజున తప్ప యిక జీవితంలో ఉభయులం కలుసుకోవటమంటూ వుండదు. ఒకరి యోగక్షేమాలను గురించి మరొకరు తెలుసుకోవలసిన అవసరంకూడా వుండగూడదని నా కోర్కె," అన్నది రాధారాణి.

అంబర్‌నాథ్ ఓసారి గట్టిగా గాలిపీల్చుకున్నాడు. అతడి ముఖం వెల వెల పోయింది. ఇలాంటి కఠినమైన షరతుతో ఎవరైనా వివాహమాడతారా? కాని, జమీందారు కుటుంబ రక్షణకోసం తా నీ షరతుకు ఒప్పుకోక తప్పదు. ఇలా నిశ్చయించుకున్న తరవాత అతడు రుద్ధమైన కంఠంతో, "సరే! అలాగే!" అన్నాడు

ఆ జవాబుకు రాధారాణి తృప్తిపడి. "శపథం చెయ్యండి! ఈ దేవమందిరం మధ్య నిలబడే శపథం చెయ్యండి! వివాహం నాటినుంచీ " ఆమె యిలా అనే సరికి అంబరుడు ఎదట పిడుగుపడినట్టు స్తంభితుడయిపోయి. అంతలోనే తెప్ప రిల్లి, "ఊహు(, శాస్త్రీయమైన వైవాహిక విధులన్నీ ముగిసిన మర్నాటినుంచీ–" అన్నాడు

రాధారాణి కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. ఆనాడెంతో అవమానితుడై కూడా తన ఎదట నోరెత్తనివ్యక్తి ఈనాడు తా నన్న మాటకు ఎదురు చెప్పటమా? పరిస్థితు లంతగా తారుమారయినై? అన్నమాట, చేయగలిగిందేముంది –



రాధారాణి కోపాన్ని తొక్కిపట్టి. "సరే; శాస్త్రీయమైన వైవాహిక విధులన్నీ ముగిసిన మర్నాటినుంచీ ఇద్దరికీ ఎలాంటి సంబంధమూ వుండబోదు.' అన్నది.

"శపథం చేస్తున్నాను!" అన్నాడు అంబరుడు. రాధారాణి మారు మాటాడకుండా దైవ విగ్రహాల దగ్గిరకు వెళ్ళిపోయింది. అంబర్‌నాధ్ మందిరంనుంచి వెలుపలికి వెళ్ళాడు.

ఆ రాత్రి కృష్ణప్రియ ఎంతకీ కూతురు భోజనానికి రాకపోయేసరికి, దీపం ఆర్పి, తలుపులు మూసివున్న ఆమె గదిదగ్గరకు వెళ్ళి పిలవటం మొదలెట్టింది. కొంతసేపటికి రాధారాణినుంచి. "నేను తినను." అన్న జవాబు వచ్చింది.

కృష్ణప్రియ ఆ జవాబుకు కొంచెంకోపం తెచ్చుకుని. "తినవా? ఎందుకని తినవు? ఇప్పుడేమయింది?" అన్నది.

"ఏమయిందా? ఇంతకంటె ఘోరం జరగటానికి అవకాశం ఏమున్నది?" అని రాధారాణి తనలోతాను గొణుక్కున్నది. కూతురునుంచి జవాబు రాకపోవటంతో కృష్ణప్రియ. "లేచిరా. రాధారాణీ! నన్ను అనవసరంగా వేధించకు," అన్నది విసుక్కుంటూ.

రాధారాణి మనస్సులోని అక్కసునంతా తల్లిమీద వెళ్ళగక్కుతూ. "నేను మీకు నెత్తిమీద కుంపటిలా తయారయాను. నేను చస్తే మీ అందరికీ హాయి. నాకూ హాయి- ఎందరికో వస్తూంటుంది, చావు- నాకుమాత్రం రాదు," అన్నది.

# 7

మరుచటిరోజున అంబర్‌నాధ్, రమావల్లభుణ్ని కలుసుకుని వివాహానికి తన అంగీకారం తెలిపాడు. ఆ తరవాత రెండురోజులకు వివాహం జరిగిపోయింది. ఆఖరిక్షణంలోనన్నా, ఏదైనా దైవయోగంవల్ల తనకీ అవమానంనుంచి విముక్తి కలగకపోతుందా - అని రాధారాణి ఎంతగానో ఆశపడింది. కానీ, అలాంటి హఠాత్సంఘటన ఏమీ జరగలేదు. ఒకవేళ తాతగారు మరో వీలునామా రాసి వుండొచ్చనీ, అదిసరిగా ముహూర్తసమయానికి బయటపడి తనకీబెడద తప్పిపోతుందనీ కూడా, రాధారాణి ఆశపడింది. అదీ వట్టి ఆశే అయింది. వివాహం మొదటినుంచి చివరివరకూ ప్రతీదీ నిర్విఘ్నంగా ముగిసిపోయింది.

వివాహ సమయంలో 'శుభదృష్టి' అంత శుభంగా కాకపోయినా, ఒకరకంగా ఎలాంటి కలతా లేకుండా జరిగిపోయింది. నిర్మలంగా వుండే అంబరుడి కళ్ళల్లోకి రాధారాణి మెరుపులా ఒకసారి చూసి, తల దించుకున్నది. అది సిగ్గువల్లకాదు- కోపం మూలంగా.

ఏమూర్ఖ పురోహితుడికి లక్షయోజనాల దూరంలోవుంచే తనప్రాణానికి హాయిగా వుంటుందని రాధారాణి భావించిందో, అలాంటివాడి ఉత్తరీయానికి తన పమిటచెం గును ముడిపెట్టారు పెళ్ళి పెద్దలు. ఆ సమయంలో రాధారాణికి తన పమిటచెంగు లాక్కుని, ముడి వూడదీసుకుని దూరంగా పారిపోదా మనిపించింది. కాని, చుట్టూ వున్నవారి కళ్ళన్నీ తనమీదనే వున్నాయి అలాచేస్తే అపహాస్యంపాలు కావలసి వస్తుందని ఆమె అతికష్టంమీద తనను తాను సంబాళించుకున్నది.

ఆ రాత్రి 'వాసరగృహం'లో ఆనందంగా గడపటానికి పెద్దఎత్తున ఏర్పాట్లు జరి గినై. చుట్టపక్కాలే కాక, పిలవగావచ్చిన ముత్తయిదువులు చాలామంది అక్కడ చేరారు. కృష్ణప్రియ నీళ్ళు చిలకరిస్తూ, ఆనందబాష్ప నేత్రాలతో, అంబర్‌నాథ్‌ను "రా, నాయనా? ఇక్కడకూర్చునికాస్త ఫలహారం చెయ్యాలి," అని ముత్తయిదువు లతో, "ఇదుగోనమ్మా! మీరంతా మా అల్లుణ్ణి సరిగ్గా చూశారా?" అన్నది.

ముత్తయిదువులందరూ కోలాహలంగా, కొందరు మనస్ఫూర్తిగానూ, మరికొం దరు లాంఛనప్రాయంగానూ పెళ్ళికొడుకు చక్కదనాన్నీ, గుణగణాలనూ ప్రశం సించటం ప్రారంభించారు. సన్నని మునుగు చాటున కోపంతో వణికిపోతున్న రాధారాణి పెదవులమీద వెటకారపునవ్వు తొంగిచూసింది. ఆమె మనస్సులో, "అమ్మది అల్ప సంతోషం... ఆఁ అడగాలి చక్కదనం! ఇంత చక్కదనం లోకంలో ఎక్కడా లేదు!" అనుకున్నది.

అంబర్‌నాథ్ ఉత్తరీయానికి, రాధారాణి పమిటచెంగు ముడివేసి వుండటంతో ఆమె వాసరగృహంలో అతడివెనకే తిరగవలసి వచ్చింది. అతడు నుంచుంటే నుంచోవాలి, కదిలితే కదలాలి. "ఈయన అప్పుడే నన్నేదో కొనివేసుకున్నట్లు ప్రవర్తిస్తున్నాడు. అదృష్టంకొద్దీ రెండురోజుల్లో వెళ్ళిపోతాడుగనక బతికిపోతాను. లేకపోతే, నాకు సర్వనాశనం తప్ప మరేమైనా ఉందా!" అనుకున్నదామె.

ఆచారం ప్రకారం 'ఒక కంచంలో తినటం' దగ్గిర్నుంచీ, ప్రతిదానికీ ఒంట్లో బాగు లేదనో, మరేవో యితరసాకులో చెప్పి అంబర్‌నాథుకు, రాధారాణిని చాలా చిక్కులనుంచి తెలివిగా తప్పించాడు. ఇది గ్రహించిన ఆమెకు మొదటిసారిగా అతడిమీద కాస్త కృతజ్ఞతాభావం కలిగింది. ముఖ్యంగా ఆమెకు యీ వాసర గృహపుతంతు ఊహించుకున్నప్పుడల్లా శరీరం భయంతో బిగుసుకుపోసాగింది. ముత్తయిదువు లిక్కడ వధూవరుల్ని పట్టుకుని చేసేరగడసంగతి లోగడే వినివుండ టంతో ఆమెకు యిది మరీ బాధాకరంగానూ, అవమానకరంగానూ తోచింది. కాని, అంబరుడు ముత్తయిదువులంతా గదిలోనుంచి వెళ్ళిపోగానే, బ్రహ్మముడి వేసివున్న

తన ఉత్తరీయాన్ని రాధారాణికి వదిలి గోడపక్కగావున్న ఒక సోఫాలోకి పోయి కూర్చున్నాడు. తనకోసం చక్కగా అలంకరించబడివున్న పట్టెమంచంమీదికి పోయి ఆమె పడుకున్నది.

తూర్పు తెల్లనవుతూండగా రాధారాణికి మెలుకువవచ్చింది. సుగంధ ద్రవ్యాలతో గదిలోనిగాలి, ఉద్యానవనంలోని వాతావరణంలా సువాసనల్ని వెదజల్లుతోంది ఆమెకు సమీపంలోనే వెండి, బంగారు జరీపూలు కుట్టిన నీలిరంగు ముఖమల్ దుప్పటి పరిచిన పక్కవుంది. ఆ పక్కమీద జరీదారాలపూలూ, ఆకులూ కుట్టివున్న దిండ్లు అమర్చబడి వున్నాయి. రాధారాణిదృష్టి దానిమీద పడగానే కొంచెం ఉలిక్కిపడింది. ఇంద్రుడి సింహాసనంలా వున్న ఆ పడకమీద పడుకునివున్న వారెవరు? ఆ ఆకారం నీలాకాశంకిందవున్న రజతాద్రిలా మెరిసిపోతున్నది. అంబరుడింకా నిద్రపోతున్నాడు. ఆచ్ఛాదనారహితంగావున్న అతడి వక్షస్థలంమీద రాధారాణి వేసిన పూలదండ అలాగే వున్నది.

రాధారాణి కళ్ళప్పగించిచూస్తూ, కదలక మెదలక వూరుకున్నది. ఇతడా అంబర్ నాథుడు? ఈనాడు మెరిసిపోతున్న ఎర్రటి వస్త్రాన్ని ధరించి, దేవతుల్యుడిలావున్న యితడేనా — ఆనాటి లజ్జతో తలవంచుకుని తనతో మాట్లాడిన దేవమందిర పూజారి? ఎక్కడినుంచి హరించి, లేక ఏ దేవుణ్ణి మెప్పించి యింత హఠాత్తుగా యీ రూప యౌవనాలను పొందివచ్చాడితడు? జానపద గాథల్లోని ఛద్మవేషి అయిన రాజకుమారుడా — లేక శాపగ్రస్తుడైన గంధర్వుడా?...

అంబర్‌నాథ్ నిద్రలో చేయికదిలించాడు. ఆసమయంలో అతడి వేలివుంగరం లోని మరకతం, దీపపుకాంతిపడి కళ్ళు మిరుమిట్లుగొల్పేలా మెరిసింది. ఆకాంతి రాధారాణి కళ్ళల్లో పడటంతో, ఆమెదృష్టిని కిందికిమరల్చింది. క్షణంలో ఆమె మనస్సును నిగ్రహించుకున్నది. సిగ్గుతో చెక్కిళ్ళు ఎర్రనైనప్పటికీ, మరు క్షణంలోనే నవ్వొచ్చిందామెకి. బాగా అలంకరించుకుంటే ఎవడు మాత్రం అందంగా కన్పించడనుకున్నదామె — రఘువల్లభ జమీందారు కూతుర్ని నేను. నన్ను యీ కోతిలాంటి మనిషి పట్టుకుని ఆడించగలడా? ఉహుం, నేనేమయినాసరే యితణ్ణి సహించను — అనుకున్నది రాధారాణి మనస్సులో.

ఈ రోజుతో వివాహ విధులన్నీ ముగుస్తాయి. హోమవేదికమీద హవిస్సులతో అగ్నిదేవుడు ఊర్ధ్వశిఖుడై ప్రసన్నముఖంతో నవ్వుతున్నాడు. ఆ అగ్నివేదిమీకి అంబర్‌నాథుని గౌరవర్ణముఖంలో అగ్నిహోత్రునిలాగానే అనైసర్గికమైన సౌందర్యం ప్రకాశిస్తోంది. రాధారాణి, అతడిముఖంలోకి చూసి కనుబొమలు చిట్లించుకుని తల




దించుతున్నది. ఆక్షణంలోనే గంభీరమైన వేదమంత్రం ఒకటి ఆమె కర్ణపుటాల్లో ప్రతిధ్వనించింది. ఆమె ఇంద్రియాలన్నీ ఆ మహామంత్ర ప్రభావానికి కట్టుబడిపోయినై. ముగ్ధురాలై ఆమె ఆమంత్రాన్ని శ్రద్ధగా వినసాంగింది. ఆమెభర్త అంబర్ నాధుడు మంత్రాన్ని ఉచ్చరిస్తున్నాడు; 'ఓం మమవ్రతే తే హృదయం దధాతు, మమచిత్త మనుచిత్త స్తే ఒ స్తు. మమవాచా మేకమనా జుషస్వ. బృహస్పతిస్త్వా నియనక్తు మహ్యామ్'—

* * *

ఆ నాటి ఉదయం ఏడుగంటలవేళ అంబర్‌నాధ్ పక్కచుట్టా, ట్రంకుపెట్టే. సామానులతో గుర్రబ్బండీఎక్కి స్టేషనుకు బయలుదేరబోయే సమయంలో కృష్ణప్రియ అక్కడికి వచ్చి ఆశ్చర్యంతో ప్రూన్పడిపోయింది. బండిపక్కన అల్లుడితో తనభర్త ఏదో మాట్లాడుతున్నాడు. అల్లుడు అయిష్టంగా తల వూపుతున్నాడు. కృష్ణప్రియ వుండబట్టలేక బండిదగ్గిరకుపోయి,'' ఇదేమిటీ? ఎక్కడికీ ప్రయాణం నాయనా ?" అని అంబర్‌నాధ్‌ను ప్రశ్నించింది.

అంబరుడు జబాబిచ్చేలోపలే, రమావల్లభుడు అందుకుని, "చాలా అవసరం అయిన పనిమీద అస్సాం ప్రాంతాలకు వెళ్ళాలట. ఒక వంటవాణ్ణీ, నౌకరునూ వెంటతీసుకు పొమ్మన్నా, వద్దంటున్నాడు'' అని భార్యతో చెప్పుతున్నాడు.

కృష్ణప్రియ కళ్ళనీళ్ళ పర్యంతమై, ప్రయాణం ప్రస్తుతానికి మానుకోమని అంబర్‌నాథ్‌ను బతిమాలింది. కాని, అతడు తన గురువుగారి ఆదేశంసంగతి సంస్కృత పాఠశాలల సంగతీచెప్పి, అత్తగార్ని క్షమించవలసిందిగా కోరాడు.

కృష్ణప్రియ అల్లుణ్ణి రుద్ధకంఠంతో అస్ఫుటంగా ఆశీర్వదించి, ''కొంచెం ఇంట్లోకి ఓసారిరా, నాయనా!' అంటూ వెంటపెట్టుకుపోయి, రాధారాణివున్న గదిగుమ్మం చూపిస్తూ, "అలా వెళ్ళు ఒకసారి," అనిచెప్పి, కన్నీళ్ళు తుడుచుకుంటూ దూరంగావెళ్ళిపోయింది.

అత్తగారు అలా కోరినా అంబరుడు ఆ గదిలోకి వెళ్ళలేకపోయాడు. ఏమిచేయటమూ - అని అతడు ఆలోచిస్తున్నంతలో తలుపులచాటునుండి గాజుల సవ్వడి వినిపించింది. తలుపులు కొంచెంగా తెరుచుకున్నాయి. అంబరుడి కళ్ళకు సూర్యాస్తమయ కాలపు మేఘంలాగ ఎర్రటి చీరెకన్పించింది. పమిట సరిదిద్దుకుంటూ అతడికి సుకుమారమైన హస్తంకూడా కన్పించింది. అతడిమనస్సు ఉరకలువేయబోయి, అంతలోనే తిరోహితమయింది. "ఊహుఁ, అక్కర్లేదు. జీవితానికంతకూ ఆఖరిసారిగా మరోసారి చూస్తేనేం? చూడకపోతేనేం!" అనుకుంటూ అంబరుడు వెనుదిరిగి బండిదగ్గరకు వెళ్ళిపోయాడు. అతడు వెనుదిరగటం చూస్తూనే, రాధారాణి తలుపులుమూసేసి, గడియపెట్టింది.

ఈ సంఘటనతో ఆమె స్వాభిమానాహంకారాలు బాగా దెబ్బతిన్నవి. తాళికట్టినంతమాత్రాన యీయన నా ప్రభువనుకుంటున్నాడేమో! ఉహుఁ! ఏ దారుణమైన పరిస్థితుల్లో అందుకు నేనంగీకరించవలసివచ్చిందో ... ఆయనకు బాగాతెలుసు. నా ప్రభువు - మందిరంలోని శ్యామసుందరుడు - నా జీవితసర్వస్వం ఏనాడో ఆయనకంకితమైపోయింది...

రాధారాణి యిలాంటి వ్యగ్రభావాలతో తనను తాను సమర్థించుకోసాగింది. రోజులూ, వారాలూ, నెలలూ గడిచిపోతున్నాయి, రాధాకృష్ణమందిరంలో రోజూ పురోహితుడు ఆద్యనాథుడు గంటవాయిస్తూ పంచప్రదీపాన్ని తిప్పుతూవుంటాడు. రాధారాణి మౌనంగా అంతదూరంలో నిలబడి చూస్తూవుంటుంది. పూజాద్రవ్యాలు అమర్చటంలో, ఆమె లోగడలా అంతశ్రద్ధ వహించటంలేదు. త్రిదళపత్రాలు వుంచవలసినచోట పంచదళపత్రాలు పెట్టివుంటున్నాయి. పూజాసమయాల్లో రాధారాణి చేయి పట్టుతప్పి, వింజామరం జారి కిందపడిపోవటంకూడా అప్పుడప్పుడు జరుగుతున్నది పూజామంత్రాలతో, వాద్యధ్వనులతో దేవమందిరం ప్రతిధ్వనిస్తున్నప్పుడు ఆ సమస్త ధ్వనులమధ్యనుంచీ వివాహంనాడు విన్న వేదమంత్రం ఆమె కర్ణపుటా

లలో స్పష్టంగా వినబడేది... మమవ్రతే హృదయం దధాతు, మమచిత్తమనుచిత్తం తేఽస్తు - వేదమంత్రాల కింతటి మహాప్రభావమా? రాధారాణి రాత్రింబవళ్ళు దీన్నిగురించే ఇలదిమ్మెక్కేట్టు ఆలోచిస్తూండేది.

కృష్ణప్రియ అల్లుడికోసం ఎంతో వ్యాకులపడిపోసాగింది. పెళ్ళయినమర్నాడే పరదేశం వెళ్ళిపోయిన కుర్రవాడు, సంవత్సరం గడిచినా తిరిగిరాలేదు. అంబరు డెప్పుడొస్తాడు? అని ప్రశ్నిస్తే భర్త అవేలానవ్వి, "అతడిప్పు డెలా రాగలడు? ఇంతవరకూ మూడు సంస్కృత పాఠశాలలు స్థాపించాడు. ఎన్ని తీరనిపను లత డికి?" అనేవాడు.

ఈ రకం జవాబులతో విసిగిపోయి - ఒకనాడు కృష్ణప్రియ కూతుర్ని, "అంబ రుడిదగ్గిర్నుంచి ఉత్తరాలేమైనా వస్తున్నయ్యా?" అని అడిగింది.

"నాకేం తెలుసు?" అన్నది రాధారాణి సగర్వంగా.

"అలాగా. అయితే, నువ్వే అతణ్ణి ఉత్తరం రాయవద్దనీ, ఇక్కడికి రావద్దనీ ఆజ్ఞ పెట్టివుంటావ్!" అన్నది కృష్ణప్రియ కోపంగా

తల్లికోపంచూసిన రాధారాణి కొంచెం బెదురుగా, "ఆజ్ఞపెడితే పెట్టానేమో. మంచిపనేగా?" అన్నది. ఈరకం జవాబు నిచ్చేకూతుర్ని ఎలా దారినపెట్టాలో తెలియక కృష్ణప్రియ బెంబేలెత్తిపోయింది.

మరో ఆయిదారుమాసాలు గడిచింతర్వాత ఒకనాటిఉదయం రమావల్లభుడు టపాలోవచ్చిన ఉత్తరాలూ, పత్రికలూ చూసుకుని భార్యనిపిలిచి, "ఇదుగో, చూశావా, నీ అల్లుడికెలాంటి పేరుప్రఖ్యాతులు వస్తున్నవో!" అంటూ వార్తాపత్రిక నొకదాన్ని ఆమె చేతికిచ్చాడు. అందులో అంబర్‌నాథ్ గురించి ఒకవార్తపడింది;" రాజనగర్‌లో విఖ్యాత విష్ణుభక్తులైన జమీందారు హరివల్లభరాయ్ కుమారులైన రమావల్లరాయ్‌గారి అల్లుడు - ఆయన సంపదకంతకూ ఉత్తరాధికారియైన అంబర్‌నాథ్-అస్సాం రాష్ట్రంలోవి నాలుగు ప్రదేశాల్లో సంస్కృత పాఠశాలల్ని స్థాపించి ఎంతో ఆదర్శప్రాయంగా నడుపుతున్నారు. ఆయన, న్యాయ, సాంఖ్య, యోగ, వేదాంతాలు నాలుగింటికీ నాలుగు పాఠశాలలు స్థాపించారు, స్వతః ఆయన గొప్ప పండితులు. అనాథులనూ, ఆర్తులనూ తండ్రిలా ఆదుకునే అంబర్‌నాథ్ ఎంతో ఐశ్వర్యసంతులైవుండి కూడా, నిరుపేదజీవితం గడుపుతున్నారు..."

కృష్ణప్రియ ఒక్కొక్క వాక్యాన్నీ అయిదేసిసార్లు చొప్పున దాదాపు అరగంట సేపు యీవార్త చదువుకున్నది. చదువుకున్నంతసేపూ ఆమె ముఖంలో ఒక విధమైనగర్వం, కళ్ళల్లో ఆనందాశ్రువులూ తొణికిసలాడాయి. ఆమర్నాడు ఎంతో

ఆలోచించి, ఆలోచించి ఆమె అల్లుడికో వుత్తరంరాసింది: "ఎప్పుడు వస్తావునువ్వు? నిన్ను చూడాలని యిక్కడ మేమంతా చాలా ఆతృత పడుతున్నాం. త్వరగా బయలుదేరి రా... "

కొన్నాళ్ళ తర్వాత అంబర్‌నాధ్‌నుంచి ఆమెకు సమాధానం వచ్చింది: "మీ ఆదేశాన్ని పాటించేందుకు కొంత ఆలస్యం అవుతుంది. ఇక్కడ ఎడతెరిపిలేని పనుల్లో మునిగివున్నాను. నన్ను బిడ్డగాభావించి క్షమించండి."

రోజులు దొర్లుతున్నాయి. ఆకాశంలో శరచ్చంద్రుని నిర్మలకాంతులు ప్రస రించటం ప్రారంభమయింది. శరద్రాత్రోత్సవాలు దగ్గిరపడుతున్నాయి. ఆ సమ యంలో రాజనగర్‌లోని జమిందారుగారింట మబ్బులేకుండా పిడుగుపడింది, హఠాత్తుగావచ్చిన భయంకరమైన వ్యాధితో కృష్ణప్రియ బంగారంలాంటి సంసా రాన్ని శ్మశానవాటికగా చేసిపోయింది. మరణం నిశ్చయం అని తెలుసుకున్నాక కృష్ణప్రియ తతిమ్మావారి నందరినీ దూరంగాపంపి, కుమార్తెను దగ్గిరకు తీసుకోవా లనేకోర్కె తెలియపరచగానే, ఆమె అంతిమకోర్కెను తక్షణమే తీర్చారు.

రాధారాణి దగ్గరకురాగానే కృష్ణప్రియ ఎంతో వాత్సల్యంగానే, ఆమె నుదుటిమీద ముద్దుపెట్టుకుని, ఇవాళ నాచిట్టచివరి విచారాన్నుంచి నన్ను విముక్తురాల్ని చెయ్యి, తల్లీ. అంబరుడింక యిక్కడికి రానేరాడా?" అని అడిగింది.

ఈప్రశ్న వింటూనే రాధారాణి రెండు చేతులతో తల్లిని కావిలించుకుని రాళ్ళు బద్దలయేటంతగా ఏడుస్తూ— అవునమ్మా! ఆయన యింకరారు. నువ్వానన్ను విడిచి పెట్టి పోతున్నావా?" అన్నది.

"ఉండటం పోవటం ఎవరిచేతుల్లోనూ వుండేవిషయంకాదు, తల్లీ! అల్లు డెందుకనిరాడు? నువ్వు రావద్దని నివారించావా?" అనడిగింది కృష్ణప్రియ.

రాధారాణి ఏడుపు దిగమింగుకుని, "ఇవాళ యికనీదగ్గిర ఏమీ దాచనమ్మా! ఊరికే వారించటంకాదు, దేవమందిరంలో ప్రతిజ్ఞ చేయించాను. ఈ జీవితంలో యింకెన్నడూ నన్ను కలుసుకోకుండా వుండాలని," అన్నది,

"నువ్వుచేసింది చాలా తప్పుపని, రాధారాణీ! చిన్నతనంవల్ల ఏదో తెలియక చేశావ్. నిన్ను అతడు తప్పక క్షమిస్తాడని ఆశీర్వదిస్తున్నాను. నువ్వు అతణ్ణి పిలిపించి క్షమాపణకోరుకో..."

రాధారాణి తల్లిమాటలకు అడ్డొచ్చి, "అదిజరిగేది కాదమ్మా! ఈజన్మలో యింక ఒకరితో ఒకరం ఎలాంటి సంపర్కం పెట్టుకోకూడదని, ఇద్దరం ప్రతిజ్ఞలు చేశాం," అన్నది గద్గదకంఠంతో.




''స్త్రీ భర్తను త్యజిస్తాననే ప్రతిజ్ఞ ఏం ప్రతిజ్ఞ? ఈ చేసినదానికి మహాపాపం తెచ్చుకున్నావ్. బతికున్నన్నాళ్ళూ అతడికి సేవచేసి, సర్వదా అతడి ఆజ్ఞానువర్తినివై వుండి, యీ పాపానికి ప్రాయశ్చిత్తంచేసుకో... ఏడవకు, తల్లీ! మీ నాన్నగారిని ఒకసారి యిలాపిలువు... వచ్చారా? పాదధూళి శిరస్సున ధరించనీయండి; రాధా రాణిని కనిపెట్టివుండండి. అంబరుణ్ణి తీసుకురండి. ఆడదానికి భర్తకంటె అన్య దేవతలు వుండకూడదు... ఇలాంటిశిక్షణ యివ్వండి - అమ్మాయికి... ఇంకా స్త హరినామం చెవినిపడనీయ్. రాధారాణీ. కాస్త గంగోదకం నోట్లోపొయ్యి; నువ్వే కూతురువేకాదు నాకు, కొడుకువికూడా..."

తూర్పు తెలవారకముందే. ఎప్పుడూ సంతోష ధ్వనులతో మార్మోగుతూవుండే రాజప్రాసాదంలోంచి. హృదయవిదారకములైన ఏడ్పులూ, హాహాకారాలూ, విన్పించసాగాయి.

## 8

భార్య అంతిమకోర్కె రమావల్లభుణ్ణి మానసికంగా చాలా బాధపెట్టింది. ఒకానొక పరిస్థితుల్లో కూతురుమాట కాదనలేక. ఆమెమీద వాత్సల్యంకొద్దీ ఒక పెద్ద పొరపాటుచేశాడు. కాని, యిప్పుడుదాన్ని మరిచిపోయినట్లు నటిస్తూ అల్లుడికి యిక్కడికి రావలసిందిగా వుత్తరం రాయటంఎలా? ఈ సమస్యతో కొన్నాళ్ళు

మధనపడిపడి చివరకు ఓ దృఢనిశ్చయానికివచ్చి అంబర్‌నాథ్‌కు ఉత్తరం రాశాడు. "—ఈసమయంలో నువ్వు యిక్కడవుండటం మా అందరికీ ఎంతో మనశ్శాంతినిస్తుంది నువ్వింక త్వరలో యిక్కడికిరా. ఇది, నా వాంఛేకాదు, మీ అత్తగారి అంతిమ కోర్కెకూడా—"

కొద్దిరోజులతరవాత అంబరుణ్ణుంచి వుత్తరం వచ్చింది: స్వర్గస్తురాలైన అత్త గారి కోర్కె మన్నించవలసిందే. ఆమె యిక లేదనేవార్త వాస్తవంగా. నన్నుచాలా బాధిస్తున్నది. కాని, రావటం సాధ్యంకాదు. సోనాపూర్ పాఠశాలలో తొలిపరీక్షలు ప్రారంభం కాబోతున్నాయి. ఆ పరమేశ్వరుడు తమ మనస్సుకు శాంతిని కలిగించా లని ప్రార్థిస్తున్నాను.

ఈ ఉత్తరంచదివి రమావల్లభుడు హతాశుడయ్యాడు. బహుశా తనఅల్లుడు యిక యిక్కడికి యీ జన్మలో రాకపోవచ్చు- అన్న భావం అతడి హృదయాన్ని తొలిచివేయ సాగింది.

హఠాత్తుగా ఒకరోజున రాధారాణి తండ్రితో, "నాన్నా, మనం ఎక్కడికైనా వెళ్ళి కొద్ది వారాలపాటు తిరిగివద్దాం," అన్నది.

రమావల్లభుడు దీర్ఘంగా నిట్టూర్చి, "ఎక్కడి కెళదామంటావో, నువ్వే చెప్పు; తల్లీ!" అన్నాడు.

"చంద్రనాథ్‌కు వెళదామా, నాన్నా? అమ్మ వెళ్ళినప్పుడు మనం వెళ్ళలేక పోయాం," అన్నది రాధారాణి

"చిటగాంగ్ ప్రాంతంలోని చంద్రనాథ్‌కా? సరే, అలాగే వెళదాం," అన్నాడు రమావల్లభుడు.

చంద్రనాథ్‌కు వెళ్ళేందు కవసరంఅయిన ప్రయాణపు ఏర్పాట్లన్నీ పూర్తవ గానే, రాధారాణికి హఠాత్తుగా అభిప్రాయం మారిపోయింది. ఆమె తండ్రితో "దుర్గాష్టమివస్తోంది. కాళీఘాట్ వెళ్ళి కాళీమాతను దర్శిద్దాం. చంద్రనాథ్ సంగతి తరవాత ఆలోచించుకోవచ్చు," అన్నది.

రమావల్లభుడు చాలా ఆశ్చర్యపడ్డాడు. తన కుమార్తెలో ఏమిటీ ప్రవర్తన అనిపించిం దతనికి. కాళీమాతమీద యింతభక్తి ఏనాటినుంచీ కలిగిందామెకు?...

ఎంతో ప్రయాణశ్రమకూ, ఇబ్బందులకూఓర్చి జాహ్నవీజలాల్లో స్నానంచెయ్య గానే రాధారాణికి హృదయంలోని భారం చాలావరకు తొలగిపోయిన ట్లనిపించింది. ఆమె మనస్సులో, "కలుషనాశిని, మాతా! ఈ పాపిష్ఠురాలి హృదయంలోని కల్మషాన్నంతా క్షాళితం చేసెయ్," అనుకున్నది.

మధ్యాష్టమిరోజున కాళికాలయంలో జనం విపరీతంగా వున్నారు. రాధారాణి తండ్రివెంట ఎలాగో గుడిలో ప్రవేశించి, మనస్ఫూర్తిగా కాళీమాత పాదసన్నిధిని రక్తజపాకుసుమాంజలి వుంచింది

ఆలయంనుంచి తిరిగివచ్చేటప్పుడు రమావల్లభుడు కూతురుతో, "ఎలాగూ బయలు దేరినవాళ్ళం బయలుదేరాం. ఇంట్లోకంటె యిలా తీర్థయాత్రల్లోనే ఎక్కువ మన శ్శాంతిగా వుంటుంది. జగన్నాథం కాని, కామాఖ్యగాని వెళదాం," అన్నాడు.

రాధారాణి గతుక్కుమని, జగన్నాథమా? సరే – అలాగే వెళదాం,'' అన్నది.

"ముందుగా కామాఖ్యవెళ్ళి తిరిగివచ్చి, జగన్నాథం వెళ్ళటం బావుంటుందని నా అభిప్రాయం," అన్నాడు రమావల్లభుడు.

"కామాఖ్యవద్దు. ఆ దారి చాలా అసహ్యంగా వుంటుందట "

"అవును. అయినా ఓసారి ఆ కామాఖ్య చూడటం మంచిది. అక్కడున్నంత గొప్ప సిద్ధపీఠం మరెక్కడా లేదు." అన్నాడు రమావల్లభుడు. రాధారాణి తలాడించి వూరుకున్నది.

ఆ మర్నాడే బ్రహ్మపుత్రానది రేవు అయిన ధుబడినుంచి స్టీమరులో బయలు దేరారు. నదికి అటూ యిటూ వున్న ప్రకృతి రమణీయతను చూసి, రమావల్లభుడూ, రాధారాణీ ఎంతో ముగ్ధులై పోయారు. కామాఖ్యచేరి కామాఖ్యాదేవిని దర్శించటం పూర్తవగానే, "ఓసారి షిలాంగ్ కూడా వెళ్ళివస్తే బావుంటుందిగదా," అన్నాడు రమావల్లభుడు కూతురుతో,

రాధారాణి దృష్టి కిందికి దించి –అవును, కాదు – అన్న జవాబేమీ చెప్పకుండా వూరుకున్నది. తండ్రీ కూతుళ్ళ మనసుల్లో ఒకే రకమైన భావతరంగం ప్రవహిస్తున్నది. అది ఇద్దరూ గుర్తించకపోలేదు.

వాళ్లు షిలాంగ్‌లో ఒక రోజు మాత్రం వుండి, సామాన్లవీ సర్దుకుని మెయిల్ ట్రెయిన్ పట్టుకునేందుకు బయలుదేరారు. ఎక్కడికి వెళ్ళటం అన్న సంగతి తండ్రికూతుళ్ళు నిశ్చయించుకోలేదు. స్టేషన్‌కు చేరింతరవాత రమావల్లభుడు నౌకరు చేత టిక్కెట్లు తెప్పించి, బండిరాగానే కూతురుతో రిజర్వుడు కంపార్టుమెంట్‌లో ఎక్కి కూచున్నాడు.

తెల్లవారకట్ల ఏదో స్టేషన్‌లో రైలు ఆగగానే, కళ్ళు మూసుకుని పడుకునివున్న రాధారాణి చెవులకు, "వేడి వేడి టీ, బీడీ, సిగరెట్" అన్న కేకలమధ్య హఠాత్తుగా తండ్రి కంఠస్వరం వినిపించింది. "అరె, వచ్చావా నువ్వు? రా, కులాసాగా వుంటున్నావా?"

"చిత్తం, కులాసాయే!"

"ఏం కులాసా? అలా కన్పించటం లేదు. చాలా చిక్కిపోయావు. మనిషివి నల్లబడిపోయావు...రేయ్ రామ్‌సింగ్! బిందే తివారీ . సామాన్లన్నీ దించండిరా. మనం యిక్కడే దిగేది." అంటూ కేక పెట్టాడు రమావల్లభుడు.

రాధారాణి శరీరంలో రక్తం ఉరకలూ పరుగులతో ప్రవహించసాగింది. ఆమె బలవంతాన కళ్ళు మూసుకుని కదలా మెదలక వూరుకున్నది కళ్ళుకనుక తెరిస్తే, కన్నీళ్ళను ఆపుకోవటం తన వల్ల సాధ్యంకాదని ఆమె గ్రహించింది.

"ఇక్కడ దిగుతారా? ఇక్కడ ఆహార పదార్థాలేమీ దొరకవు. అదీగాక యీ ప్రాంతాలు విషజ్వరాలు వ్యాపించటంతో జనం గ్రామాల్ని విడిచి పారి పోతున్నారు. ఇక్కడ దిగకండి," అన్నమాటలు వినిపించాయి రాధారాణికి.

"అయితే, యింత అనారోగ్యకరమైన ప్రాంతాన నువెందుకున్నట్టు? రా, అంబర్ చప్పున పెట్టెలోకి ఎక్కెయ్...రాంసింగ్! అల్లుడికూడా ఒక టిక్కెట్టు తీసుకురా... ఓహో, రిజర్వుడు కంపార్టుమెంట్ గదా. సరే. అంబర్, ఎక్కు, బండి కదలబోతున్నది." అన్నాడు రమావల్లభుడు అదుర్దాగా.

తెల్లబోయి చూస్తున్న అంబరుణ్ణి, రమావల్లభుడు చేయి పుచ్చుకుని పెట్టెలోకి ఎక్కించాడు. బండికదిలింది. అంబర్‌నాథ్ పెట్టెలోకివచ్చిన మరుక్షణం రాధారాణి ఏదో షాక్ తగిలినట్టు కొయ్యబారిపోయింది. చేతివేలు కదిలించగల శక్తికూడా లేదామెకు.

రమావల్లభుడు అల్లుణ్ణి యీ అనారోగ్యకరమైన ప్రదేశంవదిలి తమతో రావలసిందిగా ఒకటి రెండుసార్లు అడుగుతున్నాడు, దానికి అంబర్‌నాథ్, "ఇప్పుడు నేను మీతోరావటం అసంభవం. వచ్చే సోమవారం గురు గ్రామంలో పాఠశాల ప్రారంభించేందుకు నిర్ణయం జరిగింది. నేనిప్పుడు మీవెంటరాలేను. మూడు స్టేషన్ల అవతల దిగిపోయి, మళ్ళీ వెనక్కివస్తాను," అన్నాడు అంబరుడు.

రమావల్లభుడు దీర్ఘంగా నిట్టూర్చి, "నువ్వలాఅంటే నేనేం చెప్పేది?" అని పక్కస్టేషన్లో బండాగగానే, కంగారుగా పెట్టెలోంచిదిగి," నేనుకాస్త ముఖం అదీ కడుక్కోవాలి... ఆపెట్టెలోకి వెళతానొకసారి. వచ్చే స్టేషన్‌లో మళ్ళీ యిందులోకి ఎక్కుతాను," అన్నాడు.

అంబర్‌నాథ్ కూర్చున్న బెర్త్‌కు ఎదురుగావున్న బెర్త్‌మీదే రాదారాణి పడుకుని వున్నది. ఆమె కావాలనే, కొంగునున్న తాళపుచెవుల గుత్తిని కదిలించి చప్పుడు చేసి, దాన్ని సరీగా సర్దుకున్నది. అయినా అంబర్‌నాథ్ ఆమెకేసి చూడలేదు.



అతడు కిటికీలోంచి ఎదురుగావున్న పర్వతపంక్తులకేసి తన్మయుడై చూస్తున్నాడు. రాధారాణి హృదయంలో, అభిమానం, వేదన, నిరాశ — ఏకమై భగ్గున మండుతున్నాయి.

మరోస్టేషన్‌లో బండాగి, కదిలింది. రమావల్లభుడు పెట్టెలోకి రాలేదు. ఇంకొక సదవకాశం చేజారిపోయింది_అనుకున్నది రాధారాణి. తండ్రిసూచన ఆమె

స్పష్టంగా గ్రహించింది. ఆయన తన నౌకర్ల కంపార్ట్ మెంట్ లోకి వెళ్ళి కూచుని, తనకీఅవకాశం కల్పించాడు. తనాలోచిస్తున్నదేమిటి? ఛీ! ఆనాటి ప్రతిజ్ఞసంగతి తాను మరిచిపోతున్నదా? అది తమయిద్దరిమధ్యా దాటరాని మహా పర్వతంలా నిలిచివున్నది. ఆయన తన ప్రతిజ్ఞను భంగపరుచుకోడు... భంగపరుచుకుంటే మాత్రం తాను సుఖపడ గలుగుతుందా? ఈసారి రైలెక్కడ ఆగుతుందో ఆ ప్రదేశంలోనే తన భవిష్యత్తంతా సమాధయిపోతుంది...హఠాత్తుగా అంబరుడు కిటికీలోంచి చూపును రాధారాణిమీదికి ప్రసరింపచేశాడు. ఎవరో శోకిస్తున్నట్టు సన్నగా ఓధ్వని అతడిచెవులను తాకింది. రాధారాణి కళ్ళు నులుపుకుంటున్నది. కళ్ళల్లో బొగ్గు నుసి ఏమయినా పడిందా? అనుకుంటూ అతడు ఆమెదగ్గిరకువెళ్ళి, "కళ్ళల్లో బొగ్గేమన్నా పడిందా? నీళ్ళులేవూ? ఇదుగో, అలాగేవుండు నీళ్ళు తెస్తాను," అంటూ కూజాలోంచి నీళ్ళుతీసుకుని, ఆమె కళ్ళల్లో నాలుగైదు బొట్లువేసి, ఊదాడు.

రాధారాణి కా సమయంలో కళ్ళనుంచి అశ్రువులు జరజర స్రవిస్తున్నాయి. అంబరుడు ఓ క్షణ కాలం ఆగి, "బొగ్గునుసి పోయినట్టేనా?"అని అడిగాడు. రాధారాణి తలాడించి, పమిట చెంగుతో కళ్ళు తుడుచుకున్నది.

బండి మరో స్టేషనులో ఆగింది. అంబర్‌నాధ్ లేచి నిలబడి, మొదటిసారిగా రాధారాణికేసి తేరిపారచూస్తూ, "కాస్త యివతలికి జరిగి కూర్చో. మళ్ళీ కళ్ళల్లో బొగ్గు పడొచ్చు," అని చెప్పి, తలుపుతీసుకుని ప్లాట్‌ఫారం మీదికి దిగాడు. ఆమెకు వెళుతున్నాననయినా చెప్పలేదతడు. ఇదే తా నామెను ఆఖరుసారిగా చూడటం అని అతడికి స్పష్టంగా తెలుసు ...

రాధారాణికి బిగ్గరగా కేకేసి, కెవ్వున ఏడవాలనిపిస్తోంది. కాని, ఏడవలేకపోయింది. మానాభిమానాలనూ, లజ్జనూ కాలదన్ని, పరుగెత్తుకుపోయి అతడి చేయి పుచ్చుకుని, "ఇదే మన ఆఖరుచూపులు. కొంచెం ఆగి, నా అపరాధాలన్నిటినీ క్షమించానని చెప్పండి. ఒక్కగా నొక్కసారి 'రాధారాణీ' అని నాకు జన్మంతా మరుపురానట్టుగా పిలిచివెళ్ళండి," అని అడుగుదామనిపించిం దామెకు. కాని, ఏం లాభం, అడగలేకపోయింది.

మళ్ళీ బండి కదలగానే రమావల్లభుడు కుమార్తెవున్న పెట్టెలోకి ఎక్కాడు. రాధారాణి గమనించనేలేదు. ఆయన చిన్నగొంతుతో. "అంబర్ వెళ్ళిపోయాడా? ఎప్పుడు తిరిగివస్తాడో ఏమైనా చెప్పాడా, అమ్మా?" అని అడిగాడు.

"ఊహూఁ," అంటూ రాధారాణి తల అడ్డంగా తిప్పింది. రమావల్లభుడు

దుఃఖంతో వివశుడై పోయి, తలగడ దగ్గిరగా లాక్కొని పడుకున్నాడు. రాధారాణి మాత్రం దిగ్భ్రాంతురాలులా కిటికీలోంచి బయిటికిచూస్తున్నది. అంబరుడు పెట్టెలోంచి కిందికి దిగగానే ఎవరో అంబరుడి పరిచయస్థుడై వుండవచ్చు - అతణ్ణి, "అంబర్ ! యిక్కడున్నావేం ? పెట్టెలో ఎవరో ఆడవాళ్ళున్నట్టున్నారే ?'' అని అడిగాడు.

ఈ ఒక్కమాటా రాధారాణికి తన్మయత్వం తెప్పించింది. 'నా భార్య' అన్నమాట- ఆమె కర్ణపుటాల్లో పదేపదే ప్రతిధ్వనించసాగింది. అంటే ఆయన తనను భార్యగా అంగీకరిస్తునారన్నమాట! ఎంతమధురాతి మధురమైన మాటయిది!

రాధారాణి ఆలోచిస్తూనే వున్నది: "అవును...ఆ మాట అన్నప్పుడు ఆయనకంఠ స్వరం అలాకంపించిందేం? అందులో ఏదోభావం గర్భితమై వుంది. ఏనాడూ ఎవరి మాటా అంత మధురంగా వినిపించివుండలేదు. నిజంగా అలాతోచిందా? నా భార్య... నా భార్య..."

కొంత సేపటి కామె మగతగా కళ్ళు మూసింది. ఆ స్థితిలో ఆమెకు వివాహం నాడు ప్రజ్వరిల్లుతున్న హోమాగ్నిపక్క, హోమంచేస్తున్న అంబరుడు కవివించాడు. ఆ సమయంలో అతడుచ్చరిస్తున్న గంభీరమైన వేదమంత్రం, ఆమె కర్ణకుహరాల్లో ప్రతిధ్వనించ సాగింది! ఓం మమవ్రతే తే హృదయం దదాతు—

# 9

వారంరోజుల తరవాత రమావల్లభుడు కూతురుతో రాజనగర్ చేరాడు. రాధా రాణికిప్పుడు గృహం సుఖనివాసంగా కన్పించటంలేదు. ఆ ఇంటి శోభనంతటినీ ఎవరో హరించేసి, విస్పారమైన దాన్ని తనకు వదిలిపోయినట్టుగా తోచసాగింది. ఇక తండ్రి ఆరోగ్యంకూడ అంత బావుండటంలేదు. హఠాత్తుగా వార్ధక్యలక్షణాలు అతడిలో కన్పించసాగాయి. నల్లటిజుట్టులో అక్కడక్కడా తెల్లటి వెంట్రుకలు వెండితీగల్లా మొలకలెత్తాయి. నుదుటిమీద ముడతలు ప్రారంభమయ్యాయి.

ఒకరోజున ఉండబట్టలేక రమావల్లభుడు కూతుర్ని, "అంబరుడెంత చిక్కిపోయాడో చూశావుగదా, అమ్మా ? లేదంటాడుగాని, అతడి ఆరోగ్యం పూర్తిగాచెడి పోయిందని నా నమ్మకం: నువ్వేమైనా అడిగావా ?" అన్నాడు.

రాధారాణి యీ ప్రశ్నకు గతుక్కుమని జవాబేమీ యివ్వకుండా వూరుకున్నది. రమావల్లభుడు కాసేపాగి, "బహుశా మలేరియాతో బాధపడుతూ వుంటాడు. నేను రెండుమూడు ఉత్తరాల్లో, ఒంట్లో ఎలావున్నదీ రాయమని రాస్తే: - నన్నుగురించి బెంగ పడకండి, కులాసాగానే వున్నాను - అని రాశాడు. నువ్వేమయినా వుత్తరం రాస్తే, నిజం చెపుతాడేమో రాసిచూడరాదూ," అన్నాడు.

చివరి మాటల్ని రమావల్లభుడు కొంత తటపటాయిస్తూనే అన్నాడు; రాధారాణి కొంచెం కంగారుపడింది. తండ్రి వుద్దేశం తెలుసామెకు. రాస్తానన్నట్టు తలవూపి, ఎంతో ఆలోచించి ఆలోచించి అంబరుడికి ఉత్తరం రాసిందామె. "మీరు అస్వస్థతగా, దుర్బలంగా వుండటం గమనించి నాన్న చాలా దిగులుపడుతున్నారు. మీరు కొన్నాళ్ళ పాటు యిక్కడికొచ్చి వుండటం గాని, లేక ఆరోగ్యవంతమైన మరే ప్రదేశానికైనా వెళ్ళివుండటం గాని మంచిదని, నాన్న రాయమన్నారు. మీ ఆరోగ్యాన్ని గురించి యధార్థపరిస్థితి రాయమని నాన్న మిమ్మల్ని అడగమన్నారు. ఇక్కడ అంతా క్షేమం..." ఈ ఉత్తరం రాస్తున్నంతసేపూ దానిమీద కన్నీటి చుక్కలు ఎక్కడ పడతాయో అని, ఆమె మాటిమాటికీ కళ్ళుతుడుచుకున్నది,

కొద్ది రోజుల అనంతరం అంబరుడినుంచి వుత్తరం వచ్చింది-రాసింది తన పేరకాదు-తండ్రిపేర." నమస్కారాలతో - నా ఆరోగ్యవిషయమై మీరు చాలా ఆదుర్దా పడుతున్నారని తెలిసి చాలా విచారించాను. అప్పుడప్పుడు జ్వరం వస్తూంటుంది. దానికోసం బెంబేలుపడి ప్రయోజనం లేదు. మలేరియా జ్వరం అని డాక్టరు చెప్పారు. త్వరలోనే చట్టగ్రామానికి వెళ్ళవలసివుంది, అక్కడి వాతావరణం చాలా మంచిది. బహుశా యీ మలేరియా వదిలిపోవచ్చు-విధేయుడు; అంబర్‌నాధ్."

తండ్రి యిచ్చిన వుత్తరం చదివి రాధారాణి నిట్టూర్పువిడిచి వూరుకున్నది. అంబరు డిక్కడికి వచ్చే మార్గం లేదన్న సంగతి ఆమె కొక్కదానికే తెలుసు.

రోజులు గడుస్తున్నాయి. రాధారాణి మానసికంగా నానా వ్యధలతో కుంగిపోసాగింది. తను అంబరుడికి వుత్తరం రాసింతరవాత, అతడు అయిదారు మాసాల పాటు తండ్రికి ప్రతివారం వుత్తరంరాస్తూ వచ్చాడు. ప్రతి ఉత్తరంలోనూ తాను కులాసాయే అని తెలియపరుస్తూండేవాడు. తరవాత వుత్తరాలసంఖ్య తగ్గసాగింది. వారానికో వుత్తరం బదులుగా పక్షానికొకటి, నెలకొకటి ఆ తర్వాత రెండు నెలల కొకటిలో దిగింది. రమావల్లభుడు అల్లుడి క్షేమసమాచారాలు తెలుసుకువచ్చేందుకు నౌకరును పంపాడు. వాడు తిరిగివచ్చి, "అల్లుడుగారు బాగా చిక్కిపోయారు. అడిగితే-ఎప్పుడూ ఒకేలా వుంటారా మనుషులు - అన్నారు. రమ్మని ప్రార్థించాను. బోలెడన్ని పనులున్నాయి. రాలే నన్నారు," అని చెప్పాడు.

ఇది విని రమావల్లభుడు, కూతురుతో, "అమ్మా; ఇక లాభం లేదు, మనమే అక్కడికి వెళదాం, రా" అన్నాడు.

రాధారాణి తలవంచుకుని, చేతులు నలుపుకుంటూ, "దేవుణ్ణి వదిలి యిప్పుడెలా




రాను, తర్వాత కొద్ది దినాల్లో అధికం వస్తుంది; ఇప్పుడు కాదులే, నిదానంగా వెళదాం,'' అన్నది.

నెలరోజుల తరవాత ఒకనాడు హఠాత్తుగా పిడుగుపాటుగా అంబరుణ్ణించి ఓ ఉత్తరం వచ్చింది. "చాలా రోజులుగా వుత్తరాలు రాయలేకపోయాను; కారణం ఒంట్లో అస్వస్థతే. పక్కకి దొర్లటానిక్కూడా ఓపికలేనంత అస్వస్థతగా వుంటున్నది. అస్సాంలోని విషజ్వరాలు నాలోని జీవశక్తిని క్షీణింపజేశాయని గ్రహించాను. మీకు బాధాకరంగా వుంటుందని యీసంగతి యిన్నాళ్ళుగా రాయలేదు. కాని, ఇప్పుడు వాస్తవం మీకు తెలియపరచక తప్పలేదు. నేను రెండు మూడు రోజులకంటె ఎక్కువ బతకనని డాక్టరుచెప్పారు. కనుక, నావుత్తరంచూసి మీరువచ్చినా, మనం కలుసుకోలేం. దయవుంచి బయలుదేరిరాకండి. ఇదే నా ఏకైకప్రార్థన; తుదికోరిక – విధేయుడు ; అంబర్‌నాథ్."

రమావల్లభుడు ఆ వుత్తరాన్ని రెండుసార్లు చదివి, మూడోసారి చదవబోతూండగా రాధారాణి అతడున్న గదిలోకివచ్చింది. కూతురు ముఖంచూసి అతడు కొయ్యబారిపోయాడు. తండ్రి ముఖంలోనిభయం, విషాదంచూసిన రాధారాణి," నాన్నా, ఏమిటి ? ఏం జరిగింది ? అంటూ చటుక్కున గోడను ఆధారంగా పట్టుకున్నది. ఏదో మహావిపత్తు ముంచుకున్నదనే భయంతో ఆమెగుండెలు దడదడ కొట్టుకోసాగాయి.

అంబరుడు, రమావల్లభుడికి రాసిన వుత్తరంతోపాటు మరోవుత్తరం రాధారాణికి రాసి, రెంటినీ ఒకేకవరులో పెట్టాడు. రమావల్లభుడు తన ఆదుర్దాలో దాన్ని గమనించలేదు. రాధారాణి టేబిల్‌మీద చించినకవరు పక్కనేపడివున్న ఆ రెండో వుత్తరాన్ని తీసుకుని చదవసాగింది; "సౌభాగ్యవతికి – నీవు లోగడరాసిన వుత్తరానికి అప్పట్లో సమాధానం రాయలేకపోయాను. ఇప్పుడు రాస్తున్నాను. మీ నాన్నగారికి నా ఆరోగ్యాన్నిగురించి వివరంగా రాశాను, అంచేత మళ్ళీ విడిగా అసంగతులన్నీ రాయటంలేదు. ఈ ఉత్తరంవల్ల మన శపథం భంగపడినట్టు కాదనుకుంటాను. ఇక సెలవు. నామనస్సులో నీపైన ఎలాంటి అసంతృప్తీలేదు. మీదయవల్ల యీ జీవితంలో కొన్ని వుపయోగకార్యాలు చేయగలిగాను. నామృత్యువుకు నువ్వు దుఃఖించవద్దు. నిన్ను తుదిసారిగా నేను కోరేదేమంటే, మీ నాన్నగారు నిన్ను వెంటబెట్టుకుని, నేనున్నచోటుకు రాదలిస్తే, ఏ పరిస్థితుల్లోనూ నువ్వురావొద్దు. ఈశ్వరుడునీకు సౌఖ్యాన్ని ప్రసాదించుగాక : అంబర్‌నాధ్."

ఉత్తరంచదివి రాధారాణి మ్రాన్పడిపోయింది. ముఖం కాయితంలా తెల్లబడిపోయింది. తనభర్త తనకు తొలిసారిగా తుదిసారిగా రాసిన ఆ వుత్తరంకేసి కన్నార్పకుండా చూస్తూ వుండిపోయింది. రమావల్లభుడు పసివాడిలా దుఃఖిస్తూ, "పద ! మనం అతడిదగ్గిరకు వెళదాం. వెళ్ళకుండా ఎలా వుండగలం," అన్నాడు.

"నేను రావటాన్ని వారు నిషేధించారు; అయినా వెళ్ళకతప్పదు." అంటూ రాధారాణి కన్నీళ్ళుతుడుచుకుని, "ఉహుం, నాకు, వారి ఆజ్ఞను అతిక్రమించగల ధైర్యంలేదు. నేను నీతోబయలుదేరి, దారిలో పిన్నిగారి ఊరు చాంద్‌పూర్‌లో దిగిపోతాను, నాన్నా !" అన్నది.

ఆ రోజే తండ్రికూతుళ్ళు ప్రయాణమై, మర్నాటికి షియాల్ చేరారు. అక్కడ వా ళ్ళున్న పెట్టెలోకి, రమావల్లభుడి ప్రాణమిత్రుడైన డాక్టర్ జగద్బాబు వచ్చాడు. మిత్రులిద్దరూ మాటల్లోపడ్డారు. ఆ సమయంలో కిటికీలోంచి- బయటికిచూస్తున్న రాధారాణికి, కొందరు మనుషులు స్ట్రెచర్‌మీద ఒక మనిషిని మోసుకుపోతూండటం కంటబడింది. దాని వెంట ఒక పోలీసూ, డాక్టరూ వున్నారు. ఆమె స్ట్రెచర్‌లో వున్న మనిషిముఖం చూస్తూనే, బాణం దెబ్బతిన్న ప్రాణిలా కెవ్వున అరిచి, "నాన్నా, నాన్నా ! ఎవరది ? అయ్యో, భగవంతుడా !" అంటూ వాపోసాగింది.

రమావల్లభుడు కూతురి కేక వింటూనే ప్లాట్‌ఫారం మీదికి దూకి, స్ట్రెచర్‌లో వున్న వ్యక్తి ముఖాన్ని పరిశీలించి చూసి, "అంబర్ ! మా అంబర్ !" అన్నాడు క్రిమగొంతుతో.

స్ట్రెచర్ మీద వున్నది అంబర్‌నాథుడే! అతడి పాలిపోయిన ముఖంలో ఎక్కడా జీవం వున్న సూచనలు లేవు. దేహం అస్థిపంజరంలా అయిపోయింది. ఒక చేయి సన్నని కాడలా స్ట్రెచర్ మీదినుంచి కిందికి వేలాడుతున్నది. ఆ చేతి సన్నని వేళ్ళకు పొడవాటిగోళ్ళు - నల్లగా కప్పువేసి వున్నాయి. ఏదో దీర్ఘవ్యాధితో పోరాడి, అతడు శాశ్వత నిద్రపోయినట్టు కనబడుతున్నాడు.

రమావల్లభుడు మా అంబర్ అంటూ కేక వెయ్యగానే, స్ట్రెచర్ వెంట నడుస్తున్న డాక్టరు, మోసేవాళ్ళను ఆగమని, రమావల్లభుడి కేసి ఆశ్చర్యపోతూ చూసి, "ఇతడు మూడవతరగతి పెట్టెలో పడివున్నారు. ఈ మనిషి చాలా దరిద్రుడిలా కనిపిస్తున్నాడు. దగ్గర దమ్మిడీలేదు. ధరించిన దుస్తులుకూడా కటికపేదవాళ్ళు ధరించేవి...మీ పరిచితుడనుకుని ఇతడిదగ్గిర రాజనగరుకు మూడోక్లాసు రైల్వే టిక్కెటు మాత్రం వుంది, మీ రేం పొరబడటం లేదుగదా?'' అన్నాడు.

రమావల్లభుడు అల్లుడికేసి నిర్విణ్ణుడై చూస్తున్నంతలో, డాక్టర్ జగద్బాబు అక్కడికి వచ్చి, ''పొరపాటేం లేదు, ఈయన వీరి అల్లుడు. మా యిల్లు హారిసన్ రోడ్డులో వుంది. నా పేరు జగద్బాబు; డాక్టర్ని; స్ట్రెచర్‌ని అక్కడికి తీసుకు పదండి,'' అన్నాడు. తరవాత ఆయన కింద వేలాడుతున్న అంబరుడిచేయి పట్టుకుని స్ట్రెచర్ మీద పెట్టబోయాడు. ఆ చేయి శవం చేయిలా అతిచల్లగా వున్నది.

స్ట్రెచర్ వెనక రమావల్లభుడూ, రాధారాణీ నడిచారు. పావుగంట తరవాత అందరూ డాక్టర్ జగద్బాబు గృహం చేరారు. జగద్బాబు స్ట్రెచర్‌ను తన మేడలోని పై అంతస్తుకు చేర్పించి, అక్కడవున్న ఒక పెద్దమంచంమీద అంబరుణ్ణి పడుకోబెట్టించాడు.

డాక్టర్ జగద్బాబు, అంబరుడి చేయిపట్టుకుని నాడేమైనా ఆడుతున్నదేమో అని పరీక్షిస్తున్నంతలో, రాధారాణి అతణ్ణి సమీపించి, "బాబుగారూ, వీరు నా భర్త. ఇన్నేళ్ళ తర్వాత నా దగ్గిరకు తిరిగివస్తున్నారు." అన్నది శోకతప్తమైన కంఠస్వరంతో.

జగద్బాబు ఆమెకేసి జాలిగాచూసి, రమావల్లభుడితో, "ఇంకా ప్రాణంవుంది. నాడి క్షీణంగావుంటే మాత్రం ఏం? ఉఛ్ఛ్వాస నిశ్వాసాలున్నాయి, రమావల్లభ్! అధైర్యపడకు...అమ్మా, రాధారాణీ! నువ్వు వూరికే బెంబేలుపడకు." అన్నాడు.

రాధారాణి కన్నీళ్ళుతుడుచుకున్నది. తనభర్త ఆఖరిక్షణాల్లో తనదగ్గిరకు రావద్దని ఎందుకురాశాడో, యిప్పు డామె గ్రహించింది. ఆయన స్వయంగా బయలుదేరి తనదగ్గిర కొస్తున్నారు ...

మరిద్దరు డాక్టర్లు ఆ గదిలోకివచ్చారు. వాళ్లు డాక్టరు జగద్బాబు అసిస్టెంట్లు.

వాళ్లురాగానే జగద్బాబు, "రాధారాణీ! నువ్వు అధైర్యపడకు. మేం చేయగలిగిన దంతా చేస్తాం. అతడికి ఏ క్షణంలోనైనా స్పృహ రావచ్చు. అప్పుడు పిలుస్తాం, ప్రస్తుతానికి నువ్వు కాస్త పక్కగదిలోకిపో." అన్నాడు.

"స్పృహవచ్చి నప్పుడు మీరు నన్ను పిలవటం మరిచిపోవచ్చు. లేకపోతేనేను రావటం ఆలశ్యం కావచ్చు. బాబుగారూ, నన్ను కాస్త యీ పక్కన నిలుచోనివ్వండి. నే నేం మాట్టాడను. మెదలకుండా వుంటాను," అన్నది రాధారాణి గాద్గదికంగా.

డాక్టరు జగద్బాబు ఆమెను బతిమాలుతున్న ధోరణిలో. "అమ్మా, నిన్ను తప్పకపిలుస్తాం, నా మాట విను," అన్నాడు. రాణి మారుమాటాడకుండా కదిలి, ఆ గదికి ఎదురుగా వున్న మరోగదిలోకి వెళ్ళి అక్కడున్న ఒక ఈజీ చైర్లో చేర గిలబడి కళ్ళు మూసుకున్నది.

నాలుగైదు గంటలకాలం గడిచింది. రాధారాణి తన నెవరోకొట్టి చెప్పినట్టుగా ఉలిక్కిపడి కళ్లుతెరిచి ఎదురుగావున్న గదికేసి చూసింది. తలుపులు మూసి వున్నాయి. ఆమె అడుగులో అడుగువేసుకుంటూ వెళ్ళి ఒకతలుపును మెల్లిగా నెట్టింది. తలుపు తెరుచుకున్నది. ఆమె గదిలో ప్రవేశించింది.

రాధారాణి గదిలోకి రావటం చూస్తూనే, అంబరుడు పడుకుని వున్న మంచం పక్కన కుర్చీలో కూర్చుని వున్న నర్సు, అదుర్దాగాలేచి, రాధారాణిని సమీపించి, "ఇప్పుడు మీరు బయటికి వెళ్ళండి. డాక్టరూగారూ, ఆయన అసిస్టెంట్లూ మీ భర్తకు ఇంజక్షన్లూ అవీ యిచ్చి, వేరేమందు లేవో తయారుచేస్తున్నారు పక్కగదిలో ... ఒక్క అరనిమిషం మాత్రం యింతకుముందు స్పృహ వచ్చింది. మళ్ళీ స్పృహ రాగానే మీతో చెప్పమని, డాక్టరుగారు చెప్పారు," అన్నది.

"నే నిక్కడ కూర్చుంటాను...నన్ను వారించకు. నువు బయటికి వెళ్ళికూర్చో. అవసరం అయితే సహాయంకోసం నేనే నిన్ను పిలుస్తాను. డాక్టరుగారు కోప్పడతా రంటావా...ఉహుఁ, అభయంలేదు..." అంత కావాలంటే వెళ్ళి వారినే అడుగు," అన్నది రాధారాణి ఆజ్ఞాపిస్తున్నట్టు.

నర్సు రాధారాణి కళ్ళల్లోని ఉద్వేగతనిచూసి, మారు మాటాడకుండా గది బయటి వరండాలోకివెళ్ళి నిలబడింది. నర్సు వెళ్ళగానే రాధారాణి భర్తపక్కన కూర్చుని, చల్లగా చైతన్యరహితంగావున్న అతడి చేతిని తన గుండెలమీదికి లాక్కుని, తలను తన బాహువుమీద ఆనించుకుని, కలవరపాటులేని స్థిరదృష్టితో అతడి ముఖంలోకి చూడసాగింది. ఇప్పుడామె హృదయంలో బాధగాని, కళ్ళల్లో అశ్రువులుగాని లేవు. అంబరుడు సుఖంగా నిద్ర పోతున్నట్టున్నా డిప్పుడు. అతడి శరీరం యిదివరకంతటి చల్లగాలేదు.

అరగంట గడిచింది. అంబరుడు కళ్ళు తెరవకుండానే, ఓసారి నీరసంగా మూలిగి. చిన్నగొంతుతో, "నేనెక్కడున్నానిప్పుడు? రాజనగర్ ఎంతదూరం వుంది?" అని అడిగాడు.

"ఇంకెంతో దూరంలేదు. మీరు, మీభార్య రాధారాణిఒళ్ళో పడుకుని వున్నారు. తెలుస్తున్నదా?" అన్నది రాధారాణి స్థిరకంఠంతో.

"రాధారాణి దగ్గిరున్నానా? రాధారాణి...." అన్నాడు అంబరు అస్ఫుటమైన కంఠస్వరంతో, ఆశ్చర్యపోతున్నట్టు!

"అవును. మీ రాధారాణి... మీభార్య... మీదాసీ... మీ ధర్మపత్ని. ఒక్కసారి కళ్లుతెరిచి చూడండి. నాకు చెప్పవలసిందేదో చెప్పకుండానే వెళ్ళకండి. నేనూ మిమ్మల్ని ప్రేమిస్తున్నాను... నేను మిమ్మల్ని చాలా కష్టపెట్టాను... అయినా, నేను మీ భార్యను, సేవకురాల్ని — నన్ను క్షమించరూ?" అన్నది రాధారాణి.

"నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా, రాధారాణీ?" అన్నాడు అంబరుడు, యీమాట నమ్మశక్యంగా లేదన్నట్టు. ఆ తరవాత అతడి పాలిపోయిన పెదవులమీద నవ్వు లాంటిది కన్పించింది.

రాధారాణి శాంత తరళకంఠంతో, "మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను; వివాహం అంటే ఎలాంటిదో నాకు అర్థమైంది. వివాహమంత్రాలు కేవలం మౌఖికమైన ఉపదేశాలుమాత్రమేకాదు — అవి తమప్రభావంద్వారా అన్ని అటంకాలనూ తొలిగించి భార్యాభర్తల సంయోగత్వాన్ని సాధించితీరుతాయి," అన్నది.

"నువ్వునన్ను ప్రేమిస్తున్నావా — రాధారాణీ? ఇప్పు డిక నాకు మృత్యువు..." అంటూ ఆగిపోయాడు అంబర్‌నాథ్.

"మృత్యువా? మృత్యువుగురించి యిక ఆలోచించకండి!" అంటూ రాధారాణి చిక్కి-శల్యమైవున్న భర్తచేతిని తన చెక్కిలిమీదికిచేర్చుకుంది. ఉష్ణరక్తం ఆచేతిప్రతి నరంలోంచి ప్రవాహవేగంతో బయటికిరావాలనే ప్రయత్నంలో ఉడికిపోతున్నది.

కొంచెంసేపయాక అంబరుడు. "ఏమీ తెలియటంలేదు. నీ శరీరంలోంచి ఏదో ఒక శక్తి. ఏదో ప్రభావం. ఏదో తేజస్సు — నాలో ప్రవేశించినట్టు తోస్తున్నది. నిజమా యిది, రాధారాణీ? లేక నా భ్రాంతిమాత్రమేనా? నా కేదో నిద్రవస్తున్నట్టున్నది," అన్నాడు.

"నిద్రపోండి," అన్నది రాధారాణి. అంబరుడు ఒకటి రెండుసార్లు ఆనంద పారవశ్యంలో ఆమె గుండెలమీద తన తలను అటూ యిటూ కదిలించి, కళ్లు మూసుకున్నాడు.

రాధారాణి, భర్తతలను అలాగే పొదివి పట్టుకుని, తన శారీరకబాధలన్నిటినీ మరిచిపోయి కదలామెదలక కూర్చున్నది. ఆమె కా క్షణంలో మృతతుల్యుడైన తన భర్తను తప్పక బ్రతికించుకోగలనన్న ఆత్మవిశ్వాసం కలిగింది. ఉష్ణత కోల్పోయి, రక్తవిహీనాలై నల్లబడిపోయిన అంబరుడి నరాలమీద, కవోష్ణరక్తం ప్రవహిస్తున్న తన ధమనుల్ని జాగ్రత్తగా ఆన్చింది. ఏ అదృశ్యశక్తి ప్రభావం వల్లనయినా, తన శరీరంలోని ఉష్ణరక్తం, భర్తశరీరంలోకి ప్రవహించి తీరుతుం దన్న అనుభూతి, నమ్మకం, ఆ క్షణంలో ఆమెకు కలిగింది.

గది నిస్తబ్ధంగా వుంది. డాక్టర్ జగద్బాబు మాటిమాటికీ గదిదగ్గిరకువచ్చి వెనక్కు తిరిగిపోతున్నాడు. గదిలో కన్పిస్తున్న దృశ్యం అతడి హృదయాన్ని స్తంభింపచేసింది, రాధారాణి మహాతపఃపరాయణ అయిన యోగినిలా అతడికి కని పించింది. రోగి తమ చికిత్స విజ్ఞానానికి అందకుండాపోయాడు. చేతనైతే సమాధి మగ్నురాలై, ఏకాగ్రసాధనతో అర్ధాంగి అతణ్ణి బతికించుకోవలసిందే! కాని, తను గదిలోకి వెళ్ళటమా, మానటమా?...

ఒకప్పుడు సతికి ధ్యానభంగం కలిగించటానికి యమధర్మరాజంతటివాడే సాహ సించలేకపోయాడు, సాధారణ వ్యక్తి కది సాధ్యమయే పనా!— ★






# మారుతున్న వ్యవస్థ

వెంకటరంగం మేష్టారంటే ఇంకా పెద్దముక్కు ఖద్దరుదుస్తులతో నున్న ఆజానుబాహువైన విగ్రహమే శంకరం కళ్ళముందు ఉంది. మేష్టారు పెట్టుకున్న నియమాలు దాటకుండా నిష్ఠతో జీవితాన్నిగడిపి, ఆ తక్కువ ఆర్జనతో బిడ్డలను చదివించాడు. వాళ్ళని అదుపాజ్ఞనలలోనే ఉంచాడు. అతనిచే మొట్టికాయలుతిన్న విద్యార్థులలో తనూ ఒకడు.

శంకరం ఏదో గది ఖాళీగా ఉందంటే అద్దెకు అడుగుదామనివచ్చి చూస్తే మంచంమీదను జ్వరంతోపడున్న వ్యక్తి వెంకటరంగం మేష్టారు! తను చదువు

కునే రోజుల్లో మేష్టారికి స్వంత ఇల్లు లేదు. శంకరం ఊరూర్లూతిరిగి ఉద్యోగ రీత్యా మళ్ళీ యీ ఊళ్లో కాలుపెట్టి రెండుహోటళ్ళు మార్చి ఈయన ఇంటి దగ్గరే కాలుపెట్టాలా?

మేష్టారు బాగా చిక్కిపోయి ఉన్నారు. లోతుకు పోయినకళ్లు, అభి మానమనే కన్నీటితో ఒక్కసారి తేలి పోయాయి. ఆరుపదులు దాటిన జీవితం మోపిన బరువుభారంతో క్రుంగుతూ మూల్గినమూలుగు మరో క్షణంలో వినిపించింది. ఆనందంతో ముదిమిని గడపడానికి అనువుగా బరువును తమ భుజాలపై వేసుకోగలిగే బిడ్డలుండగా మేష్టారింతగా చితికిపోయారేం? శంకరం ఒక్కసారి ఇంటిచుట్టూ చూసాడు. అంగట రెండుగదులు, పెరటవరండా. వరండాకు వంటగదికీ మధ్య గచ్చునేల. వంటయింట్లో మేష్టారి చిన్నకూతురు వండుతోంది. పెరటి వరండాలో ఒకామె కూర్చుంది. ఆమె చాలా నీరసంగాఉంది. ముగ్గురుపిల్లల్లో కుర్రాడు తాతదగ్గర నిల్చున్నాడు. మిగతా ఇద్దరూ ఆడపిల్లలు; చేతిపిల్ల యేడుస్తోంది. ఆమె మేష్టారి పెద్దమ్మా యని పోల్చుకున్నాడు.

ఆ పరిస్థితిలో ఇంకే ప్రశ్నలూ వెయ్యకుండా తనెందుకువచ్చాడో చెప్పాడు. మేష్టారు సంశయించడానికి గల రెండు కారణాలు శంకరంకి తెలుసుకానీ అవసరం. "మీ కెటువంటి యిబ్బంది కలుగనివ్వనని హామీ ఇస్తు న్నాను - కాదనకండి."

"సరే! ఈవేళ మంచిది. దిగిపో కూడదూ?" అన్నారు.

శంకరం ఆవేళనే అంగటి రెండు గదుల్లో ఒకగదిలో దిగిపోయాడు. మరుచటిరోజు రాత్రిసరికి ఇంకా జ్వరం తగ్గలేదు. హోటల్లో భోజనంచేసి ఇంటికి వచ్చేసరికి జ్వరతీవ్రతతో మేష్టారు రాగాలుతీస్తున్నారు. శంకరం అతని దగ్గరగా కూర్చొని చూసేసరికి శరీరం బాగా కాలిపోతోంది. తడి గుడ్డను నెత్తిమీదవేసి ఇంకో తడి గుడ్డతో శరీరాన్ని ఒత్తుతుంటే మేష్టారు ఏవేవో అనుకుంటున్నారు. జ్వరతీవ్రత తగ్గాక శంకరంవేపు చూసి కళ్ళు తుడుచుకుంటూ "ఈరోజు ఎండా కాలం-రేపు శీతాకాలం-నేను చచ్చేక ఈ కట్టెను ఎవడు ముట్టుకుంటేనేం?"

మేష్టారు పడుకున్నాక శంకరం తన గదిలోనికి వచ్చేసాడు. చాల రాత్రివరకు ఈ మాటలు తనను కలవర పరుస్తున్నాయ్. మేష్టారు ప్రోవిడెంటు ఫండుతో ఈ ఇల్లుకొన్నారు. శక్తి వున్నన్నాళ్ళూ ప్రైవేట్లు భుక్తికోసం చెప్పారు. హేమాహేమీల్లాంటి ఆర్జి స్తున్న ముగ్గురుకొడుకు లుండగా అత నింతగా బాధపడ్తున్నా రెందుకు? భార్య గతించి అప్పుడే పదేళ్ళయింది.

ముసలికాలంలో ఇల్లాలు లేకపోతే ఒంటికాలు మనిషిలా బ్రతకాలి.

వారంరోజులసరికి శంకరం ఇంచుమించు వాళ్ళ ఇంటిమనిషిలా అయిపోయాడు. వద్దన్నా మందు తెచ్చి ఇవ్వటంవలన మేష్టారు కోలుకున్నా ముఖంలోని ఒకో మడతలో ఒకో పరాభవం తొంగిచూస్తున్నట్లుంది. ఇల్లు కదలకుండా మంచంమీదనే ఉంటున్నారు

"మీ పెద్దమ్మాయికి మందు..."

మేష్టారు నవ్వారు. ఆ నవ్వు జీవితంపై విరక్తివలన వచ్చినది.

"పెళ్ళిచేశాను. ముగ్గురుపిల్లల తల్లయింది. కానీ ఆ మొగుడికి పెళ్లాన్ని ఎలా చూడాలో తెలీదు. అదొక మనిషన్న కనికరమైనాలేదు. ఆస్తి తగలేసాడు. తాగుడు. అడగలేను-అడక్కుండా ఉండలేను. దానిని కేన్సరు జబ్బుతో నా యింట్లో పిల్లలతో వదిలేసాడు. వాడికి బరువని-కన్నప్రాణం-నాకు బరువా?"

"పోనీ - అన్నదమ్ములు సహాయం చేస్తే మెడ్రాన్ తీసుకువెళ్తే బాగుణ్ణేమో?"

"అయ్యో! అంత అదృష్టమా? దీనిని ఇంట్లో పెట్టాననీ, దానివల్ల అల్లుణ్ణి మరింత పాడుచేస్తున్నానని నా యింట్లో అడుగుపెట్టడమే మానేసారు"

"ఏమిటి? మీరంటే గజగజవణికే మీ అబ్బాయిలు...మీకు యెదురాడుతున్నారా?"

"సానుభూతికోసంకాదు. చెప్పుకుంటే కాస్త గుండెలో బరువు తగ్గుతుందని చెప్తున్నాను. పెళ్ళిళ్ళుకాగానే వీళ్ళిలా జంటజంటలుగా ఎగిరిపోతారని కలలోనైనా అనుకోలేదు. వాళ్ళ క్రింద ఖర్చుపెట్టినట్లే ఈ చిన్నమ్మాయి క్రిందా ఖర్చుపెట్టేవాడిని. వాళ్ళమీద ఆశతో దీని గొంతుక కోసాను."

చిన్నమ్మాయి సరస్వతి వంటయింట్లోనించి ఈ మాటలు వింటోంది. ఒంట్లో విజృంభించిన యౌవ్వనం మెరుగులు పెట్టుకోనట్లేవుంది. కళ్ళల్లో విచారం పొరలుగామారి ఆ తళుకును కప్పేసింది. అలంకరణ, ఆభరణాలూ నోచుకోలేని అతివఅందమంతా మబ్బుతెర కప్పిన వెన్నెల్లా అగుపిస్తోంది. నీలికొండలచాటున దాగున్న దినకరునిలా మండుకపోతున్న మనిషి బయటకు ప్రశాంతంగా కనిపిస్తోంది.

"ఆడపిల్లకు పెద్దచదువు లెందుకని తెలివిగా చదువుతున్నా ఆపేసాను. ఇదే ఒక డాక్టరైవుంటే నాకీ బాధ వుండేదా? చదువు ఆపి, చిన్నపెళ్ళి చెయ్యలేకపోయాను. చదివించి దాని పెళ్ళి అది చేసుకోగలిగే సమర్థతకు దూరంచేసి వంటయింటి కుందేల్ని చేసాను."

"మీ పెద్దబ్బాయి మంచి ఉద్యోగంలో ఉన్నాడుకదా...ఈ మాత్రం బాధ్యత తీసుకోలేకపోయాడా ?"

"పెళ్ళిళ్ళుచేసాక తెలుసుకున్నా - యీ ముగ్గురికొడుకులపై నాకేం అధికారంలేదని. ఇదివరలా మందలించబోతే నేనే తిరిగి మాటలుపడే అవస్థ వచ్చింది. పెద్దకోడలు మామగార్ని లోపలికిరమ్మనదు. పెద్దకొడుకు పెద్ద మాటలు నేర్చాడు. ఏదో కసి తీర్చుకున్నట్లు మాట్లాడుతాడు. రెండోవాడు ఒక అమ్మాయిని ప్రేమించాడు. కట్నం పుచ్చుకోలేదు. అత్తారివాడయ్యాడు. మూడోవాడిచదువు సాగలేదు సరిగ్గా. వాడు తెచ్చుకున్నది వాడి కుటుంబానికే చాలదు. ఇంటి మీద అప్పుతెచ్చి తింటున్నాను. ఇంక కూతురి పెళ్ళేమిచ్చి చేస్తాను?"

"ఏమైనా సంబంధాలు వస్తున్నాయా?"

"ఏవో వచ్చాయ్. అన్నీ హిరణ్యాక్ష వరాలు. పది వేల కట్నం. పానకంబిందెలు, వెండిగిన్నెలు, పట్టు పంచెలు. నలుగురు ఆడపడుచులకు మంగళ హారతికి నాలుగువందల పదహార్లు...నడుంవిరిగి కొడుకులు దగ్గరకువెళ్తే... మన తలకు సరిపడ్డది చూసుకోవా అన్నారు... పెద్దవాడు ఇంకోటికూడా అన్నాడు. ఏదో రెండో పెళ్ళి సంబంధం చూడండి - చవగ్గా వస్తుందన్నాడు. ఒరే, నీ కిది న్యాయంరా? - అంటే...ఇరవై మూడేళ్లు దాటాయికదా..,తప్పేంటి అన్నాడు. తలమీద కండువా వేసుకుని వచ్చేసాను."

"అయితే ఏ కొడుకూ మీ కేం పంపించటంలేదా ?"

"వాళ్ళ సాయమేవుంటే మందు లేకుండా మంచంమీద పడుంటానా?"

"పెద్దవాడు బాగా సంపాదిస్తున్నాడు కదా - వెళ్ళి వాళ్ళ పై ఆఫీసర్ని కలవలేకపోయారా? అమ్మాయి పెళ్ళికి సహాయం దొరికేదేమో ?"

"మొదట్లో కోపంతో ఆ ఆఫీసర్నే కలిశాను. అత నేమన్నాడో తెలుసా? "మీ బాధలకు సానుభూతి చూపించి మీ కుమారునితో చెప్పగలను. వినటం తనయిష్టం." "ఒకప్పుడు వినకపోతే?" అని అడిగాను. "మేం యేమీ చెయ్యలేము. ఎంచేతంటే కుటుంబం అంటే భార్య, పిల్లలు. వాళ్ళను పోషించకపోతే మేం జోక్యం చేసుకోగలం, కానీ మీరు కుటుంబంలో మనిషి కారు" ... ఒళ్ళుమండి నేనూ అనేశాను."

"ఏమని?''

"ఈ దేశంలో - అతిథుల్ని కుటుంబంలో మనుషుల్లా చూసుకునే సంస్కృతి ఎప్పుడు మంటగలిసిపోయింది? ఏనాడో రాముడికి సహాయం చేశాయని కోతుల్ని చంపకూడదన్న

మన కనికరం యెక్కడకు పారిపో యింది? ఇహలోకం గురించేకాక పర లోకం గురించి యెక్కువగా తాప త్రయపడే మనధర్మం యేమైంది? ఈ జాతిరక్తం యింతగా యేనాడూ కలుషితంకాలేదు. ఫేమిలీ అంటే పెళ్ళాం, పిల్లలట-కాళ్ళుచేతు లున్నవాళ్ళంతా ఒకే ఫేమిలీ... ఒకే ఫేమిలీ" అని అరుస్తూ వచ్చేశాను.

"పర్యవసానం?"

"పెద్దకొడుకు ఇదివరకు నెలకు యిస్తుండిన ముప్ఫయిరూపాయల భరణంకూడా ఆపేశాడు."

"అప్పు డేం చేశారు?"

"ఏం చేస్తాను? నేను పాతవాడిని. పాతవ్యవస్థలోని ఆలోచనలతో యీ కొత్తమనుషుల క్రొత్తవ్యవస్థలో నిల్చోలేక కుతకుత వుడికిపోతున్నాను. ఉమ్మడికుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నమై పోయింది."

"అది సమర్థిస్తారా?"

"నేను సమర్థించనంత మాత్రాన అది నిల్చిపోదు. పాతనీరుమీద ఎక్కడినించో ఒకపొంగువచ్చి ప్రవాహమైంది. నేను ఆపినా ఆగిపోదు. ఏదో - నా కడుపుశోకంతో అరచినంత మాత్రాన-... విత్తనాలు మొలకెత్తకుండాపోవు. తెలివిగలవాణ్ణయితే ఆ మొక్కలను పెంచి వాటిఫలాలను అనుభవించ వలసిందే!"

"మీ రలా అంటున్నారు, కానీ మీకు పాతమీది రుచిపోదు. మీకు భయం హెచ్చు."

మేష్టారు శంకరం మాటలువిని ఒక సారి తేరిజూశారు.

"అవును ... సంఘానికి భయపడొద్దా?"

"ఎవరా సంఘం?"

"నే నున్నది - నా చుట్టూ వున్నవారు."

"మీ కొడుకులతో సహా..."

కాస్సేపాగి "అవును."

"అయితే మీరు మిమ్మల్ని సహాయపడని సంఘానికీ, మిమ్మల్ని బాధపెట్టి చివరకు మ్రింగడానికి సంసిద్ధమైన సంఘానికీ భయంతో భీరువై కొలుస్తున్నా రెందుకు? సంఘనియమానికి అతిక్రమించటంవలన వచ్చే సంతోషాన్ని మీ రాహ్వానించ రెందుకు?"

"సంఘంలో బ్రతకాలని..."

"ఎలాగో సంఘంలో బ్రతికేబదులు ...ఈనాడు మనిషి ధైర్యంతో, ఆత్మవిశ్వాసంతో, నిజమని నమ్మిన సిద్ధాంతాలతో నాటినమొక్కలు యేనాటికైనా పెద్దవై - అతను వాటి ఫలాలను అనుభవించకపోయినా - అభ్యుదయం అతనే సాధిస్తాడు."

మేష్టారు ఒకనాడు తను బెంచీ ఎక్కించిన శిష్యుడే ఈనాడు గురువు

గారికి బోధిస్తున్నాడని కామోసు-ఒక సారి శంకరంవేపు చూశారు. శంకరం బరువైన కళ్ళల్లో బ్రహ్మాండమైన వూహాలు కదలుతున్న ట్లున్నయ్. మేష్టారు యింకా శిష్యుణ్ణి తనకంటే గొప్పవానిగా తీసుకోడానికి యిష్టపడనట్లుంది.

"అబ్బాయ్! ఈ లోకం ఆరు పదులుపైబడి చూశాక నేను యిప్పుడొక్క నిర్ణయాని కొచ్చానోయ్. మనిషికి డబ్బుంటే యేదిచెప్పినా చెల్లుతుంది. డబ్బులేనివాడు సంఘంపెట్టిన నియమాలుదాటితే తప్పు. డబ్బున్నవాడు దాటితే అభ్యుదయం."

"మనిషికి డబ్బు అవసరంలేదని నే ననలేను. కానీ డబ్బునే కొలబద్దను చేసి మనిషిలోని ధైర్య స్థైర్యాలను, త్యాగాన్ని, ఉత్సాహాన్ని కొలవటానికి నే నిష్టపడను. మీరు సుఖంగా వుండాలన్న మనోనిబ్బరం మీలోవుంటే వుండగలరు."

"ఎలా?"

"చెప్పనా?"

"చెప్పవోయ్."

"మీ దృష్టిలో నేను మీ కొడుకుల కంటే నయమేనా?"

"వాళ్ళతో పోల్చకు. నీ తలిదండ్రులు అదృష్టవంతులు."

"అయితే - మీకు మహదానందం, తృప్తియిచ్చే ఏ పనిచెయ్యమంటారో నన్ను ఆజ్ఞాపించండి."

"నిజంగా శిరసావహిస్తావా?"

"మిమ్మల్ని నేను దేవుని గొప్పతనానికి చిహ్నంగా ఎంచుకున్నాను. దేవుని ప్రేమిస్తున్నట్టే మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. దేవుని కొలుస్తున్నట్లే మిమ్మల్ని కొలుస్తున్నాను. దైవకార్యం నెరవేర్చడానికి ప్రయత్నిస్తున్నట్లే మీకార్యం నెరవేర్చడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. ఆజ్ఞాపించండి."

"నాకు యీ ఆఖరిదశలో యేది మహదానందం - తృప్తి యిస్తుందో నీకు తెలుసునుగా...అదే చెయ్యి."

"కులానికి అతీతులై అభ్యుదయ మార్గంలో అడుగుపెట్టారు - నేను చాలా అదృష్టవంతుణ్ణి."

మేష్టారి వంగిన వెన్నుపూసలు తిన్నగా నిల్చున్నయ్. పొంచివింటున్న సరస్వతిలో ఆ క్షణంలోనే పెళ్ళికళలు తళుక్కున మెరిశాయ్.

# కొత్త జీవితం

కళ్యాణి



"ఇంతకీ మీరు విచారిస్తున్నారా?" అన్నది జానకి.

"దేనికి?" అన్నాడు భాస్కరం.

''అదేనండి, నన్ను పెళ్ళిచేసుకున్నందుకు!" అంది జానకి చిరుకోపంతో.

"ఆ ప్రశ్న పదిహేనేళ్ళ తర్వాత అడుగుతున్నావా?" - అన్నాడు భాస్కరం కొంటెగా.

"కొన్నేళ్ళపాటు కాపరం చేశాకనే అడగవలసిన ప్రశ్న అది. నిజం చెప్పండి" అంది గోముగా జానకి.

"నీకేమనిపిస్తోంది చెప్పు?"

స్వెటర్ అల్లికఆపి, చుట్టూ చూసింది

జానకి పెద్దవాడు రామం గిటార్ పట్టుకుని ఏదో రాగం పలికించటానికి ప్రయత్నిస్తున్నాడు. సుమిత్ర ఓ నవల్లో తనచుట్టూ ప్రపంచాన్ని మర్చిపోయి, మునిగిపోయింది. ఆఖరివాడు బాబు 'మెకానిక్' తో కుస్తీపడుతున్నాడు. ఇహ అతను భోజనం కానిచ్చి హాయిగా సిగరెట్టు కాల్చుకుంటూ ఉదయం చదవగా మిగిలిన న్యూస్ పేపర్ని చూస్తున్నాడు. ఎవరిలోనూ అసంతృప్తి గాని, చికాకుగాని లేదు.

"నాకు తృప్తిగానే ఉంది సుమండీ!" అంది జానకి.

"నాకూ అంతే. కాని, జానీ! నువ్వా రోజుల్లో కలవకపోతే మనమీరోజు ఇలా ఉండేవాళ్లమంటావా? మొదట్లో నిన్ను చాలానే తిట్టుకున్నా. 'హాయిగా ఉన్నవాడిని వదిలిపెట్టదేమిటా' అని. కాని ఇపుడుమటుకు..."అంటూ సగంలోనే ఆపి ఆప్యాయంగా చూశాడు–భార్యవేపు;

"కాని ఈ 'హాయి' మనది కావటానికి ఎంత కష్టపడ్డాం!"

"ఫలితం దక్కిందికదా మరి ?"

"కాదని అనగలనా?"

"కాని ఆ రోజుల్లో నన్ను తెగ బాధపెట్టేశావు సుమీ! శ్రీనుని కూడా చాలా తిట్టుకున్నాను." ఇప్పుడు ఎక్కడో దూరంలోవున్న శ్రీను, ఈ ఢిల్లీలోనే తను పూర్వం గడిపిన జీవితం జ్ఞాపకంవచ్చినవ్వుకున్నాడు–భాస్కరం.

నిజమే! భాస్కరం అప్పట్లో పెళ్లాడ తగ్గ బ్రహ్మచారి. చదువూ, ఉద్యోగం దృష్ట్యా చూస్తే. అతనిలోని లక్షణాలు కొన్నిమటుకు పెళ్ళికూతుళ్ల తండ్రుల్ని దగ్గరకురాకుండా ఆపినాయి...ఒకటి–అప్పుడప్పుడు అయినా త్రాగటం, రెండు – అతనికివున్న లెక్కలేనంత మంది కాకపోయినా, గర్ల్‌ఫ్రెండ్స్. అతను జాన్సన్ అండ్ జాక్సన్‌లో పని చేసేవాడు. ఆఫీసులో రిసెప్షనిస్ట్ కేథరిన్ దగ్గర్నుండి పక్కింటి సిన్హాగారి అమ్మాయి ఆశతోసహా అందరూ అతనితో జంటగా పిక్నిక్కులకూ, షైర్లకూ వెళ్ళినవాళ్ళే. వీలయినంతవరకు ఒకరికి తెలియకుండా ఇంకొకర్ని మేనేజ్ చేసేవాడు – అతని స్నేహితులెవరయినా.

"ఇది తప్పయ్యా. అల్లా చేయకూడదు. ఆడపిల్లల్ని అలా పాడు చేయొచ్చా?" –అంటే.

"చూడు బ్రదర్, నేనయినేను వాళ్ళ వెంటబడి ఏమయినాచేస్తే బాధ్యత నాదవుతుంది. మరి 'హల్లో, సాయంకాలం మీకు మరేం పనిలేకపోతే, ఇంటికేసి రారూ?' అంటూ ఆహ్వానాన్ని కళ్ళలో నింపుకుని అడిగితే రానని అంటావా?" అనేవాడు.

"అనను"

"మరి, 'ఇంకా తెలుగుపుస్తకాలు లేవాండి' అంటూ మాటిమాటికి పైట సరిచేసుకుంటూ, కొంటెచూపులు చూసే పదిహేడేళ్ళబాలను చూసి నీ మనస్సు చెదిరిపోదూ?"

"పోతుంది."

"మీతోబాటు ఆ సీరియల్ చదవద్దూ - అంటూ పక్కనే కూర్చుని చక్కటి అమ్మాయి మీద పడుతూంటే నువ్వు చేతకాని చవటలా ఊరుకుంటావా?"

"ఊరుకోను"

"మరి నన్నెందుకయ్యా - ఆడిపోసుకుంటారు? ఛాన్సు దొరికితే వదిలేవాళ్ళెవరు? పైగా నీతివాక్యాలు - పోనీ, నేనేమయినా నవమన్మథుణ్ణా?"

"అబ్బే, ఆలోచించకుండా కాదని చెప్పచ్చు. కాని వీళ్ళంతా నీ వెంట ఎందుకు పడుతున్నట్టు?"

"అదా?" కొంచెం ఆలోచించి అన్నాడు భాస్కరం.

"చూడు, వాళ్ళకు తెలిసిన మిగిలిన అబ్బాయిల్లా నేను జంగ్లీని కాను. చక్కగా కబుర్లు చెబుతాను. తర్వాత నేను చాలా నమ్మకస్తుడినని వాళ్ళ అభిప్రాయం. వాళ్ళంటే పడిచావను. నువ్వు రంభలా ఉన్నావని చచ్చినా అబద్ధం చెప్పను. అదేనేమో నాలోని ఆకర్షణ."

అలాంటి భాస్కరం, జానకి కలిసి తిరుగుతున్నారనేసరికి అందరూ ఆశ్చర్యపోయారు. జానకి, శ్రీనివాస్ అన్నాచెల్లెళ్ళు. జానకి అన్నయ్యదగ్గరే ఉండి ఇంద్రప్రస్థలో ఎకనమిక్స్ లెక్చరర్‌గా పనిచేసేది. ఆమె కొలీగ్ అరుణ అస్తమానం "మా భాస్కర్" అని చెబుతూంటే కుతూహలంగా వినేది. ఓమారు శ్రీనివాస్‌తో ఆమె అతని గురించి చెప్పేసరికి అతను -

"భాస్కరా? జాన్సన్ అండ్ జాక్సన్‌లో ఉన్నాడు, అతనేనా?" అన్నాడు.

"అవునన్నయ్యా, నీకెలా తెలుసు?" అంది జానకి. తనేదో కొత్తవిషయం చెబుతున్నాననుకుని చెబితే అతనలా అనటంతో తెల్లబోతూ.

"తెలుగువాడుకదా మరి, తెలీకపోతుందా? ఆమధ్య పెదనాన్నగారు శశిని ఈ అబ్బాయి కిద్దామనుకుని వాకబు చెయ్యమంటే చేశాను. అన్ని సంగతులూ తెలిశాయి అతను చదువుకున్నాడనుకో, మంచి ఉద్యోగమే. కాని తాగుతాడట. మీ కరుణలాంటి స్నేహితురాళ్లు ఎంతమందోనట.అచ్చం గోపాలకృష్ణుడేననుకో." అన్నాడు- కొంచెం తిరస్కారంతో శ్రీనివాస్.

"అయితే ఓమారు ఇంటికి పిల్చుకురాకూడదూ" అంది జానకి కుతూహలంతో.

"ఏంవి.. టీ!" కుర్చీలోంచి ఎగిరి గంతేసినంత పనిచేశాడు శ్రీనివాస్.

"ఏమీలేదు, ఇంటికి పిల్చుకు రాకూడదా? అన్నానంతే;" అంది జానకి తన కుట్టుపనిని ఆపకుండానే.

"ఎందుకు?" కొంచెం దూకుడుగానే అన్నాడు - శ్రీనివాస్.

"మరేంలేదు, కరుణేమో 'చాలా మంచివాడు అదీఇదీ' అని చెబుతోంది. నువ్వేమో ఇలా మాట్లాడుతున్నావు? ఎలా ఉంటాడో, ఎలాంటివాడో నిజానికి చూద్దామని-అంతే" అన్నది జానకి తాపీగా.

"అమ్మాయ్! ఇలాంటి కుతూహలమే ఎంతలేసివాళ్ళనీ గోతిలోకి దింపేది. అతని సంగతి నాకు బాగా తెలుసు. జాగ్రత్త" అన్నాడు శ్రీనివాస్ - తేల్చేస్తూ.

"నేను ఏ గోతిలోకీ తెలీకుండా మటుకు దిగను" అంది జానకి కుట్టుపనిని ఎత్తిపెట్టేస్తూ...చెల్లెలి సంగతి తెలిసిన శ్రీనివాస్ ఇంకేమీ మాట్లాడలేదు. అంతటితో ఆ ప్రస్తావన ఆగిపోయింది.

ఆ వారంలోనే ఏదో సినిమాకి కరుణని తీసుకువెళ్ళటానికి వచ్చిన భాస్కరాన్ని కరుణే పరిచయంచేసింది. సన్నగా పొడుగ్గా ఉన్న అతన్ని పరీక్షగా చూసింది జానకి, చాలా మర్యాదగా మాట్లాడుతున్నాడతను. అతని ఛలోక్తులు కూడా చాలా తీక్ష్ణంగా ఉన్నాయి. అక్కడ అతనువున్న పది నిమిషాల్లోనూ కరుణ భాస్కరానికిచ్చిన రూపం నిజమయింది కాదు, అతని నిజమయిన వ్యక్తిత్వాన్ని ఛలోక్తుల, నవ్వులచాటున దాచేస్తున్నాడనుకుంది జానకి. కుతూహలంగా, పరీక్షగా చూసే ఈ అందంలేని అమ్మాయిగురించి పట్టించుకోలేదతను.

అందుకే ఓ వారం తర్వాత ఓ సాయంత్రం కన్నాట్ ప్లేసులో 'అమెరికన్ ఎక్స్‌ప్రెస్' ఆఫీసులో ఏదోపని చూసుకుని హడావిడిగా వస్తూంటే కనపడి.

"నమస్తే" అన్న ఆమెని వెంటనే పోల్చుకోలేదు భాస్కరం.

"కరుణ ... ఇంద్రప్రస్థ" అంటూ జ్ఞప్తికి తెచ్చింది జానకి.

ఎస్! జ్ఞాపకం వచ్చింది. మీ రెటు వెళుతున్నారు?" అన్నాడు భాస్కరము-తన తొందరపాటునుకప్పిపుచ్చుకుంటూ. 'అయిదు ముప్పావయింది, సలీమా చిరాకు పడిపోతుంది' అనుకున్నాడు.

"మీ రెటు వెడుతున్నారు? తనకు జవాబివ్వకుండానే ఎదురు ప్రశ్న వేస్తున్న అమ్మాయివల్ల కలిగిన చిరాకులో మరి ఆలోచించకుండా.

"చా తీసుకోటానికి," అన్నాడు.



"నేనూ అంతే. కలిసివెళ్ళటానికి మీ కేమయినా అభ్యంతరమా?''

'అవును' అని చెప్పాలనిపించినా దిగమింగుకుని.

"పదండి, అభ్యంతర మేముంది?" అన్నాడు.

అయిష్టంగానే ఆమెతో అడుగులు వేశాడు. ఇన్నాళ్లూ అందమయిన అమ్మాయిల పక్కన నడిచి అలవాటు పడిన అతనికి ఈ అమ్మాయితో నడవా లంటే ఎలాగో ఉంది. బిగుతుగా వేసుకున్న జడ, ఉదయం ఎప్పుడో మేకప్ అయి ప్రస్తుతం కాస్త జిడ్డుగా ఉన్న మొహం, అతిసామాన్య మయిన చీర. అతిసామాన్యంగా ఉన్న ఆ అమ్మాయిని చూస్తే అతనికి తమాషాగా అనిపించింది. అవును, పెదాలకు లిఫ్ స్టిక్, బుగ్గలకు రోజ్ లేని అమ్మాయిల మొహం చూసినఅలవాటు లేదు; మరి. ఆతనిదా పొరపాటు?

అలా తన ఎంగేజ్ మెంట్ని పాడు చేసి, సలీమాకి కోపం తెప్పించిన జానకంటే ఎంత ఒళ్లుమండినా, తెలివిగా మెరిసేకళ్లూ చకచకా చెప్పే కబుర్లతో ఆ అమ్మాయంటే మొదట ఉన్న అయిష్టం పోయిందతనికి. నిజానికి గదికి వెళ్ళేదాకా సలీమా గుర్తుకు రాలా.

మరుచటి రోజునుండి మామూలే - అతనూ అతని షికార్లమధ్యలో జానకిని గుర్తు తెచ్చుకోవాల్సి రాలేదు.

ఆ రోజు ఆఖరినిమిషంలో రాలేనని ఆశ ఫోన్ చేసేసరికి చాలా నీరసించి పోయాడు. ఆ రోజు కేథరిన్, నిరుపమ, కరుణ ఎవరికీ తీరుబడిలేదు. చికాగ్గా కనీసం గొంతయినా తడుపుకుందామని బయలుదేరి నాలుగడుగులు వేసేసరికి ఎదురుగుండా నవ్వుతూ కనిపించింది జానకి.

"హాలో! ఈ మధ్యను ఊళ్ళోలేరా?" అంటూ పలకరించిందామె.

"లేకేమండి! ఏంవిటి - చాలా కులాసాగా ఉన్నట్టున్నారే!" అన్నాడు భాస్కరం, టీజ్ చేస్తున్నట్టుగా.

"మీకు తెలిదేమోగాని నే నెప్పుడూ కులాసాయే ... ఇపుడే కరుణ ఇచ్చిన పార్టీనుండి వస్తున్నానండి. తనకి పెళ్ళి సెటల్ అయింది కదా!"

"అవునవును" అంటూ వ్యంగ్యంగా నవ్వుకున్నాడతను, ఆ పెళ్ళిగొడవంతా తల్చుకుని.

"మా ఇంటికి టీకి రాకూడదూ? మరో ఎంగేజిమెంట్ ఏమీ లేకపోతే" అంది జానకి కొంటెగా చూసి.

ఒక్కనిమిషం తెల్లబోయాడతను. "అబ్బే. మరో ముఖ్యమయిన పనేం లేదులెండి," అన్నాడు సర్దుకుంటూ.

"నిజం?" అంటూ ఇంటికి దారి తీసింది జానకి. ఆ అమ్మాయితో ఎందుకో అంతా చెప్పుకో బుద్దేసింది-భాస్కరానికి. ఆశ, సలీమా లందరి గురించి చెప్పాడు-అంతా విని.

"ఇంతకీ వీళ్ళలో ఎవరిమీదయినా మీకు గాఢమయిన అనురాగంలాంటిది, అదేదో ప్రేమ అంటారు చూశారూ- అది ఉందా?" అంది సగం సీరియస్ గా.

"చూడండి. నే నేదో ప్రేమలో ఉన్నానని, వాళ్ళకి నే నంటే అచలమయిన విశ్వాసం ఉందని నే ననుకోవటంలేదు. మరికొంచెం బ్లంట్ గా చెప్పాలంటే నాకు వాళ్ళతో అవసరం ఉంది. వాళ్ళకి నాతో బంధం అటువంటిదే - కాలక్షేపం. వాళ్ళకోరికల్ని తీర్చుకోవటానికో మార్గం-ఇహ ప్రేమలాంటివి మామధ్య రావటానికి ఆస్కారం ఏదీ?"

"మరి మీకు ఆప్తులు, స్నేహితులు అంటూ లేకపోతే మరి చాలా వంటరిగా ఫీలవరా?"




"ఈ వంటరితనం నాకలవాటే. కిండర్ గార్డన్ నుండి చదువంతా పై ఊళ్ళోనే జరిగింది. ఆ తర్వాత కారణాంతరాలవల్ల మా తల్లిదండ్రులకూ నాకూ పడలేదు. ఆఖరికి తోడబుట్టినవాళ్లుకూడా దూరంగా ఉండటానికే ప్రయత్నించారు. మనసుని గాయపరిచే సంఘటనలు చాలానే జరిగాయి. అందుకనే "ఏకాకిని – ఏకాకిగానే ఉంటాను," అని అప్పుడప్పుడూ నాకు నేనే ధైర్యం చెప్పుకుంటూ ఉంటాను. అయినా అలాంటి సమయాల్లో 'సీసా' తోడునీడగా ఉండనే ఉంటుంది. ఇక, వంటరిగా ఉన్నానని అనుకునే సమయము ఏదీ? అసలు దేనిగురించయినా ఆలోచించే వ్యవధి ఏదండి?"

"నేను మీకన్నా చిన్నదాన్ని. మీకు చెప్పగలదాన్ని కాను. అయినా వ్యవధి కల్పించుకోండి. అప్పుడీ రకమయిన సంబంధాలు అర్థవిహీనంగా కనిపిస్తాయి," అని సంభాషణ ఆపేసింది జానకి–ఇల్లు దగ్గరికి రావటంతో.

ఆ రోజు సాయంకాలం అతనికి తెలీని కొత్తరకం సంభాషణలో పాల్గొన్నాడు భాస్కరం, అన్నాచెల్లెళ్ల మధ్య సున్నితమయిన హాస్యం, ఆప్యాయత, సునిశితమయిన వాగ్బాణాలు– అతనికి ఇలాంటివ్యక్తులూ ఉన్నారనిపించేలా చేసింది.

"మళ్ళీ ఇంకోమారు తప్పకుండా రండి," అన్నది జానకి.

"ఇహ మీ ఆహ్వానానికోసం ఎదురు

చూడను. నాకు వీలున్నపుడు వచ్చేస్తానంతే!'' అన్నా డతను.

జానకి దగ్గర అతనలా మనసు విప్పి చెప్పుకోగలిగేవాడు. అప్పుడూ, ఆ తర్వాతకూడా, ఇప్పటి జీవితానికి అల వాటుపడిన అతనికి ఆ ఇంట్లో తనకింత వరకూ తెలీని శాంతి ఏదో లభించిన ట్లయింది. ఆ అట్టే అందంగాలేని ఈ అమ్మాయి ఓ మంచి స్నేహితురాలిలా అనిపించింది – అంతే. ఓ రోజున అతను తనవిజయాల్ని గురించి చెబుతూంటే.

"మీ నిజాయితీని చూస్తే భయం వేస్తుందండీ!" అందామె.

"అంత భయంకరంగా ఉన్నానా?"

"అలా కాదు, మిమ్మల్ని కట్టుకున్నది ఈ నిజాల్ని తట్టుకోలేక పోతుందేమో!"

"నాకు కనుచూపు మేరలో పెళ్ళి చేసుకోదగిన వ్యక్తి కనబడటం లేదు. ఆ మాత్రం నిజాల్నితట్టుకోలేని అమ్మాయిని నేను చేసుకోన్లెండి "

ఒక్కోమారు జానక్కి కోపం వచ్చేది, –మరీ ఆడదంటే ఇంత తేలిక భావమా అని–అదే అంతే.

"ఆడవాళ్ళతో మీ అనుభవం ఎంత? నా అమభవంలో నాలుగోవంతయినా ఉందా?" అని పవాలు చేసేవాడు. ఓటమిని ఒప్పుకోక తప్పేదికాదు.

నిజమే! ఎప్పుడూ సలీమాలనూ, ఆశలీన్నీ. కేధరిన్లనూ చూస్తున్న అతనికి స్త్రీ అంటే గౌరవభావం ఎలా కలుగుతుంది?

ఓమారు జానకిని. హఠాత్తుగా ఓ ప్రశ్న వేసి, ఇబ్బందిలో పెట్టేశాడు– భాస్కరం.

"మీరు ఒక్క అఫైర్ కూడా లేకుండా ఎలా ఉంటున్నారండీ?''

ఒక్కనిమిషం తడబడినా వెంటనే సర్దుకుంది జానకి.

"లేదని ఎందుకనుకుంటున్నారు?"

"నాకు తెలిసినంతవరకూ లేదు మరి. మీరు అలా రహస్యాలను దాచగలరని అనుకోను.''

"మహానుభావా! మీకు ఆడదాని ఒక్కరూపం కొంచెం తెలిసేసరికి అంతా తెలుసనుకుని గర్వపడిపోతున్నారు. ఆడది రహస్యమయి; అవునో కాదో మీకేం తెలుసు? ఆ విషయం ఇక వదిలెయ్యండి.'' అంది జానకి.

భాస్కరానికి ఆమె అంటే ఒక్కటే తెలుసు–తనకు తెలిసిన అమ్మాయిల కోవకి చెందదు, వాళ్ళలా చీర నలిగిపోతుందేమోనని బెంగెట్టుకోదేమో; లిప్‌స్టిక్ షేడ్ చీరరంగుకి నప్పిందా లేదా నని మాటిమాటికీ వేధించదు.

మరింకా ఓ సుగుణం ఏమంటే ఆమెతో ఏ విషయాన్ని గురించయినా నిస్సంకోచంగా మాట్లాడొచ్చు. దేని గురించి మాట్లాడినా అర్థం చేసుకో

గలిగే శక్తి ఉంది. తనకీమధ్య కొన్ని విషయాల్లో తగ్గిపోతున్న ఆసక్తి గురించి చెబుతూ,

"నాలాంటి వాళ్ళకో ఇబ్బంది ఉన్న దండీ. ఆఫీసు వదిలాక నాతో మగ వాళ్ళు మాట్లాడేదంతా వైన్ అండ్ విమెన్ గురించి. ఆడవాళ్ళ సంగతి మీకు తెలుసు. అందుకే మీ కంపెనీలో ఓ రకమయిన శాంతి దొరుకుతుంది. సెక్స్‌తో సంబంధంలేని ఓ స్నేహితురా లుంటే బావుండుననిపిస్తుంది."

అతనికేమయినా చికాగ్గావుంటే తిన్నగా ఆమె దగ్గరికి వచ్చేవాడు,

కాని అల్లా అతను వచ్చిన ఓ రోజుని ఎన్నటికీ మర్చిపోలేదు జానకి.

సాయంకాలం ఆఫీసునుండి తిన్నగా వచ్చేశాడతను.

"అదేం, ఇవాళ సాయంకాలం నిరుపమతో ఎక్కడికో వెళ్తున్నానని చెప్పారు!" అంది జానకి ఆశ్చర్య పోతూ.

అతను మండిపడుతూ అన్నాడు, "అసలు ఆడవాళ్ళకి సెన్స్ ఆఫ్ ఆనర్ లేదండీ! లేకపోతే నాతో ఆఫీసుకి వస్తానని, కలిసిపోదామని చెప్పిన అమ్మాయి వచ్చి, నా పక్కనే వున్న మిత్రాతో కలిసి వెళ్ళిపోతుందా? దీనికంతా కారణం తెలుసా? నేను నిన్న సుషుమాఛటర్జీతో వెళ్ళటం చూసిందిమె! వాళ్ళిద్దరికీ ఒకరంటే ఒకరికి పడదు; గనుక నేను ఎవరి నయినా ఒకర్ని ఎంచుకోవాలిట. అయినా నేను ఆమె ఎవరితో తిరగాలో తిరక్కూడదో శాసిస్తున్నానా, ఆవిడ గారు నన్నిలా అనటానికి? మధ్యా హ్నంనుండి 'నీకేమోయ్, అందమ యిన అమ్మాయిలందరూ నీ వెంటే ఉంటారం'టున్న మిత్రా ఇలాంటి పని చేస్తాడా? అసలు..."

"తప్పంతా మీలో ఉంచుకుని వాళ్ల నంటారేం?" అంది జానకి ఆవేశంగా మధ్యలోనే.

"తప్పా! నేనేం చేశాను?" చాలా అమాయకంగా అన్నాడు భాస్కరం.

"తప్పు కాదూ! కొంచెంకూడా ఆత్మా భిమానాన్ని ఉంచుకోక అందరికీ అలా అలుసివ్వబట్టే కదా - అలా అయింది. అసలు మీ సంబంధాలే అలాంటివి. అర్థం పర్థంలేని అసూయలు. అసలు 'ఓహో, ఎంతటి ఆనందం' అంటూ ఇలాంటి సంబంధాలు పెంచుకుని, ఆవ్యామోహాపు పొంగు ఆరగానే 'ఏమిటి మిగిలిందంటూ!' గంతులేస్తారు. ఇలాటి బ్రతుకూ ఓ బ్రతుకే! ఈ మాత్రం ఆలోచించగల శక్తి ఉన్న మీరే ఈ ఊబిలోదిగి ఇలా నాశన మయితే ఎలా? మీకో వ్యక్తిత్వం అంటూ ఉంటే అసలు ఇన్నేళ్ళు ఇలాంటి జీవితాన్ని గడపగలుగు

తారా?" తనకు తెలియకుండా గట్టిగా అరచింది జానకి.

ఎన్నడూలేనిదీ ఒక్కమారు ఇలా మనసులో ఉన్నదంతా వెళ్ళగక్కేయటంతో ఆమె మొహం ఎర్రబడిపోయింది భాస్కరం ఒక్కమారు తెల్లబోయి ఆమెవేపు చూసి.

"అయితే...అయితే... మీరు ... నన్ను" అని - ఇక ఆపేశాడు. జానకి లోపలి కెళ్ళిపోయింది.

భాస్కరానికి వెళ్ళాలో ఉండాలో తెలీలేదు. అతను లేవబోతూండగా శ్రీనివాస్ వచ్చి.

"అదేమిటండోయ్, ఒక్కరే కూర్చున్నారే," అంటూండగానే జానకి టీ కప్పులతో వచ్చింది. చల్లటినీళ్ళతో మొహం కడుక్కుని వచ్చిన ఆమె మొహం ఎప్పటిలా ప్రశాంతంగా, నిర్మలంగా ఉంది. ఆమెనలా చూశాక తన అభిప్రాయం తప్పేమో ననిపించింది

కాని ... జానకి వాళ్ళన్నయ్య సూచించిన సంబంధా లన్నిటినీ తిరస్కరించటంతో తన అనుమానం నిజమే ననిపించింది. ఆ సందిగ్ధంలోపడి ఓ రెండువారాలపాటు ఆమెతో ఎప్పటిలా మాట్లాడేవాడు కాదు. అది గమనించి జానకే ఆ ప్రసక్తి తెచ్చింది.

"ఏమండీ! ఆ రోజున అలా మాట్లాడేనని కోపం వచ్చిందా?"

"కోపంకాదు...కాని మీరు మరోలా అనుకోనంటే ఓ మాట అడగనా?"

"ఏమీ అనుకోనుగాని -అడగండి."

"నే నేమయినా తప్పుమాటఅన్నా, మనమధ్య ఈ స్నేహం ఏమీ కాకూడదు."

"ఏమీ కాదు."

"మీకు నేనంటే స్నేహితుడినన్న భావంకాక మరేదయినా భావం ఉందా?" ఆ ఒక్క ప్రశ్నా వేసేసి నిట్టూర్చాడు భాస్కరం-ఏదో బరువు తీరినట్టు.

"ఆ ప్రశ్న ఎందుకని వేయాల్సి వచ్చింది.''

"ఆ రోజున మీరు మాట్లాడిన విధానం చూస్తే నాకు అనుమానం వేసింది."

"మీరు నాకు మంచి స్నేహితులు. మీరు బాధపడుతూంటే దగ్గరికి తీసుకుని ఓదార్చాలని ఉంటుంది. మీరు హాయిగా ఉంటే, ఆ హాయి నామూలంగా వచ్చినది అంటే, చాలా తృప్తిగా ఉంటుంది. అలా ఇద్దరం నవ్వుతూ గడిపితే, జీవితాంతం, ఎంత బావుంటుంది?అనిపిస్తుంది. మీరు వంటరివారు కాదు, నే ఉన్నాను-అని చెప్పాలని ఉంటుంది."

భాస్కరానికి ఇదో కొత్త అనుభూతి.ఆమెను తేరిపార చూస్తూ అలానే కూర్చుండిపోయాడు. కాని అతని



మనస్సులో అనేకమయిన ఆలోచనలు పరుగెడుతున్నాయి

"కాని ఒకటి. నన్ను నేను ఇది 'ప్రేమ'నీ 'అనురాగమ'నీ మభ్యపెట్టు కోను. నాకు మీరంటే చాలా ఇష్టం."

"అంతా తెలిశాకకూడానా?"

"ఆఁ."

"అంటే...ఇది పెళ్ళిగా పరిణమించాలనా మీ కోరిక?" కొంచెం సంకోచిస్తూ అడిగాడు భాస్కరం.

"నాకు మిమ్మల్ని అర్థం చేసుకుని, మీకు సంతృప్తిని ఇవ్వగలననీ అనిపిస్తుంది."

"మీ సంతృప్తిమాట ఏమిటి?"

"నా విషయం మీకు సరిగ్గా తెలీదనుకుంటా. నాకు నటనన్నా, ముఖప్రీతి మాటలన్నా చెడ్డమంట. అందువల్లే నాకు స్నేహితులు చాలా తక్కువమంది ఉన్నారు' అందుకనే నాకు నిజాన్ని దాచకుండా చెప్పే మీరంటే నా కిష్టం కలిగింది. మీరంటే నమ్మకమూ ఉంది నాకు.

"ఆ ఇష్టం, నమ్మకం చాలుగా మన పెళ్ళి సుస్థిరంగా నిలవటానికి?"

"ప్రేమలాంటిదేమయినా ఉండాలంటారా?"

"అనే - అనుకుంటున్నా మరి."

"అసలు ప్రేమంటే ఏమిటి? అలాంటిదేమయినా ఉందేమో నాకు తెలియదు. నాకు మీ మీద వున్న ఇష్టాన్ని ఆ పేరుతో పిలవచ్చునేమో కూడా తెలియదు. నాకు మీరంటే వున్న ఇష్టాన్ని ఇక మీరు చెడగొట్టలేరనే నా నమ్మకం."

"అంటే, ఇక ముందెప్పుడూ మీ దృష్టిలో గౌరవహీనమయిన పని చేయననా?"

"లేదు. నేను మీ పనులనీ మీ పనుల వెనుకనున్న మనఃస్థితినీ విడదీసి చూడటం నేర్చుకున్నా. మీ లోని ఆ మూలమయిన వ్యక్తిత్వం ఇక పెద్దగా మారదు. మారినా అది నా గౌరవాన్ని పెంచుతుందేకాని తగ్గించదు."

"కాని మీకు తెలుసు, నాకు మీరంటే పెళ్ళి చేసుకోవాలనిగాని, అలాంటి ఆకర్షణగాని ఏమీలేదు. మీకు తెలుసుగా?"

"అలాంటి ఆకర్షణ పెళ్ళికి మంచి ఆధారస్తంభమని నే ననుకోవటంలేదు. మీకు నేనంటే ద్వేషంలేదు కదా?"

"భలేవారే! నేను నా జీవితకాలంలో ఏ స్త్రీనయినా గౌరవిస్తే అది మిమ్మల్నే."

"అంతే చాలు. నేనయినా మిమ్మల్నేదో మార్చేద్దామనీ సంఘసంస్కర్తనయిపోదామనీ అనుకోవటం లేదు. అసలు మీరు కావాలని కోరుకోవటంలో నా స్వార్థమే ఎక్కువ."

"స్వార్థమా? మీరు నన్ను పెళ్ళి చేసుకుంటే అది త్యాగం అవుతుంది అది తెలీదూ మీకు?" తనగురించి బాగా తెలిసిన భాస్కరం బాధగా అన్నాడు.

"నాకు కావలసింది నా వ్యక్తిత్వాన్ని గౌరవించి నన్ను అర్థం చేసుకుని ఆప్యాయంగా చూడగలిగే భర్త; నా పిల్లలకు మంచితండ్రి కాగలిగే మగవాడు. ఇహ ప్రేమానురాగాలనేవి మనం ఒకళ్ళనొకళ్ళు అర్థంచేసుకోటంలో నుండి వచ్చేవేకాని హఠాత్తుగా ప్రత్యక్షమయ్యేవి కావు."

తలలో నింపుకోలేనన్ని ఆలోచనలతో 'ఇక వస్తానంటూ అక్కడినుండి

బయటపడ్డాడు భాస్కరం. ఆ రోజునే నిర్ణయించుకోలేదతను. ఆమె కూడా మళ్ళీ ఆ ప్రసక్తి తీసుకురాలేదు.

ఓ ఆర్నెల్లపాటు, ఆమెనిచూసి, ఆమె మాటల్ని విన్నాక ఓ రోజు –

"మనం పెళ్ళిచేసుకుందాం, జానకీ" అన్నాడు భాస్కరం.

"ఆ తరువాత విచారించకూడదు సుమీ."

"అలా విచారించకుండా చేసే బాధ్యత నీది. అలాంటి బరువు బాధ్యత లన్నీ నీ భుజంమీద వేసి నిశ్చింతగా ఉంటాను."

తమ మిత్రబృందానికి ఓ పెద్ద పిడుగులాంటి వార్త నందించి సివిల్ మ్యారేజి చేసుకున్నారు వాళ్లు.

జానకి నిజమయిన సమస్యలు ఆ తరువాతే మొదలయ్యాయి. పెళ్ళికి ముందు టీకి వచ్చినపుడు చూసిన భాస్కరానికి ఆఫీసుటైములో తప్ప మిగిలిన టైమంతా ఇంట్లోనే గడుపుతున్న భాస్కరానికీ ఎంతో తేడా కనిపించింది. ఒక్కోమారు సాయంకాలాలు మూడీగా కూర్చుండిపోతే ఎందుకో అర్థంకాక సతమతమయింది జానకి. ఆ తర్వాత అర్థమయింది, తన జీవిత కాలంలో బుద్ధొచ్చాక, ఎన్నడూ సాయంకాలాలు ఇంట్లో ఉండి ఎరుగని భాస్కరం ఇప్పుడు ఇంట్లో ఉండటానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. జానకి నవ్వుకుని మర్నాడు –

"ఇవాళ నేను మా సావిత్రీ వాళ్ళింటి కెళ్ళాలి; మీరూ మీ స్నేహితుల దగ్గరకు వెడతారేమో. ఇంటికి వచ్చేటప్పుడు అలా వచ్చి నన్ను తీసుకు వస్తారా?" అంది.

"ఓ, ఎస్" అన్నాడు హుషారుగా.

పెళ్ళయిన నెలకే తమ డెన్‌లో అడుగుపెట్టిన భాస్కరాన్ని చాలా ఉత్సాహంగా ఆహ్వానించి సీసాలు తెరిచారు – అతని మిత్రులు. గంగూలి తన కొత్తసాహసకృత్యం గురించి చెప్పుకుపోతున్నాడు ...

"మా ఆఫీసులో ఈ మధ్యనే శాంతి అని ఓ మద్రాసీ చేరిందోయ్. మొదట్లో ఏం ప్రతివతలా వేషం వేసే దనుకున్నావ్. పొడుగ్గా కొంగుతీసి కప్పుకునేది. అవసరమయితే తప్ప మాట్లాడేది కాదు, అదీ ముక్తసరిగా."

"ఒకళ్ళ నొకళ్ళు గౌరవించుకోని మీ సంబంధాలు, భావాలకు విలువ నివ్వని మీ సంతోషాలు ఎంత అర్థవిహీన మయినవి!" అన్న జానకిమాటలు గుర్తుకురాగానే, ఇక అక్కడ ఉండలేక బయటకు వచ్చేశాడు భాస్కరం.

చెప్పినదానికన్నా ఓ గంటముందుగానే వచ్చేసిన భర్తను చూసి ఆశ్చర్య

పోయింది జానకి. కాని మ రే మీ మాట్లాడకుండా అతనితో బయలుదేరి వచ్చేసింది. ఆ రోజు చాలా హుషా రుగా కబుర్లు చెప్పాడతను. కాని ఆ తర్వాత అలాంటి అవకాశాలు కల్పిం చినా, ఆమెతో తప్ప బయటికి వెళ్ళ టానికి ఇష్టం చూపేవాడుకాదు.

ఆ మరుచటి ఏడే పుట్టిన రామం వారిబంధం మరింతబలంగా పెనవేసుకు పోయేలా చేశాడు.

"మనబాబు ఎంత అ ం ద ం గా ఉన్నాడో జానీ! మరి ఎలా పట్టు కుంటున్నాడో...ఏరా, చిట్టినాన్నా, నా వేలు కావాలా?'' అంటూ కొడు కుతో ఆడుకుంటున్న భాస్కరాన్ని చూసి తృప్తిగా నిట్టూర్చింది జానకి.

తరువాత వచ్చిన సుమిత్ర, బాబు ఈ సుఖసంసారంలో అల్లారుముద్దుగా పెరుగుతున్నారు. భాస్కరం ఎప్పు డయినా తన పాతజీవితంలో కొత్త జీవితాన్ని పోల్చుకుని అనుకునేవాడు.

"నా జీవితంలో నూనె అయిపో తున్న సమయంలో సరిగ్గావచ్చి వత్తి మార్చి. నూనె మళ్ళీ పోసింది జాని. లేకపోతే కొడిగట్టుకు పోయేదేమో."

"అమ్మా, చూశావమ్మా, బ్రిడ్జ కట్టేశాను," అంటూ బాబు భుజం కుదుపుతూ ఉత్సాహంగా చెప్పేసరికి మేలుకునేది జానకి.

"నిజం? చాలా బావుందిరోయ్. మరిక పడుకుంటావా?" అంటూ వాణ్ణి బుజ్జగించి పడుకోబెట్టి పిల్లల గదిలో దీపం ఆర్పి భర్తదగ్గరకు వచ్చింది జానకి.

''ఇంతకీ నా ప్రశ్నకి జవాబు చెప్ప లేదు మీరు'' అంది అతని పక్కన కూర్చుంటూ.

''మన పెళ్ళి విజయవంతమయిన చాలా కొద్ది పెళ్ళిళ్ళలో ఒకటి. ప్రేమా, పెళ్ళి - అంటూ గడపదాటలేక బోర్లగిలపడి గుక్కపెట్టి ఏడ్చేవాళ్ళ నెంతమందిని చూస్తున్నాం! ప్రేమ అన్నదానిమీద కాకుండా, ఒకరినొకరు అర్థం చేసుకుని గౌరవించటం అన్న భావనమీద ఆధారపడినమీద పెళ్ళి ఏ విధంగా మిగిలిన వాటికంటే తీసి పోతుంది? ఎవరంటారు అలా అని..." ఉపన్యాస ధోరణిలో చెప్పుకుపోతున్న భర్తను ఆపి.

"ఎవరో అనుకోటంమీద మనసంతో షము నిలబడి ఉందంటారా ఏం? మనకు మనం 'నేను హాయిగా గడి పాను, నా వాళ్ళని సంతోషపెట్ట గలిగాను' అని ఆత్మవిశ్వాసంతో చెప్పుకోగలిగితే చాలదూ?" అంది జానకి చిరునవ్వుతో.

"ఉహుం! అలాగా!!" అంటూ గదిలో దీపం ఆర్పివేశాడు భాస్కరం.




మబ్బుల్లేకుండా బడబడ వడగళ్ళ వాన పడ్డట్టుగా – గరల్స్ హైస్కూలు స్టాఫ్‌రూమ్‌లో ఒక్కుమ్మడిగా ఆరుగురు ఆడవాళ్ళు పొట్ట చెక్కలయ్యేట్టు ఫెళ్ళున నవ్వారు.

ఆనవ్వుల దూకుడికీ, వేళాకోళానికీ ఆరూములో తూర్పుదిక్కున ఒంటరిగా కూర్చున్న శారదమనస్సు చివుక్కుమన్నది. వాళ్ళు తనవిగురించే అట్టహాసం పట్టపగలుగా నవ్వుతున్నారు; ఆ నవ్వుల్లోని వ్యంగ్యాత్మకమైన ఎగతాళి తనని గురించే.

ప్యూను రాములు ఆరోజు స్టాఫ్‌కు వచ్చిన ఉత్తరాల్ని తీసికొచ్చి పేరు పేరునా అందరికీ ఇచ్చాడు. కాని శారదకు ఒక్క ఉత్తరంకూడా రాలేదు. ఆ స్కూల్లోచేరిన రెండేళ్ళ దగ్గర్నుంచీ ఆమె కెప్పుడూ ఒక్క కార్డుముక్క కూడా రాలేదు. మిగతా స్టాఫ్ మెంబర్ల నవ్వులకూ, అపహాస్యాలకూ అదే ముఖ్యకారణం.

"అసలెప్పుడూ ఉత్తరాలు రానివాళ్లు దేశంలో మచ్చుకైనా వుంటారా?'' అన్నది సైన్సు బి. ఇడి. విజయలక్ష్మి.

"ఉంటారు!" అన్నది - సోషల్ స్టడీస్ టీచరు గోవర్ధనమ్మ.

"ఎక్కడ?"

"ఎవరు?"

"పోస్టల్ డిపార్టుమెంటు మొత్తాన్ని ఎంక్వయిరీ చేశావా?"

"తోటి టీచర్ల మొహాలకేసి తెచ్చి పెట్టుకున్న గాంభీర్యంతో చూసి, అంత లోనే పెదవులపై చిరునవ్వును వెదల్చి చేసి, "హిమాలయ పర్వతాల్లో, ఇరవై నాలుగువేల అడుగుల ఎత్తున కాంచన గంగ శిఖరంపై, శరీరాన్ని తినివేసే మంచుగడ్డల మధ్య ముక్కుమూసుకుని ఏకాగ్ర చిత్తంతో తపస్సుచేసే ఋషి పుంగవులకు ఉత్తలురావు." అన్నది గోవర్ధనమ్మ.

అందరూ పొట్టలు చెక్కలయ్యేటట్టు నవ్వారు.

"అంటే - మనశారద ఆ కోవకు చెందిన యోగినా?" అన్నది - లెక్కల అసిస్టెంటు అనూరాధ.

మళ్ళీ ఆగదిలో నవ్వులు సముద్ర కెరటాల్లా నురుగులు కక్కాయి.

వాళ్ళ నవ్వులకూ, హాస్యానికీ, అవ హేళనకూ శారదమనస్సు శూలముల్లు గుచ్చుకున్నట్టు మెరమెర లాడిపోయింది. కాని పైకి పల్లెత్తుమాట అనలేదు. బాధను గుండెలో గుట్టు చప్పుడుకాకుండా ఇముడ్చుకోవడానికి- పదేళ్ళుగా ఆమె అలవాటుపడింది.

అందరికీ ఉత్తరాలు రావడంలో ఆశ్చర్యంలేదు. అట్లాగే తనకీ ఉత్తరాలు ఎవ్వరిదగ్గర్నుంచీ రాకపోవడంలో అబ్బురంలేదు. తనకి ఆప్తబంధువులు లేరు; ఆప్తమిత్రులులేరు; ప్రేమించేవారు లేరు; ప్రేమించబడేవాళ్ల లేరు; శ్రేయోభి లాషులులేరు; శత్రువులులేరు. తను అతి సామాన్యమైనట్టిది. చిత్రలేఖనములో, సంగీత సాహిత్యాలలో, సాంఘిక సేవలో - ఎందులోనూ ప్రత్యేకతలేదు; ప్రావీణ్యతలేదు. తనకి ఎవరిదగ్గర్నుంచి ఉత్తరాలు వస్తాయి? ఉత్తరాలు రాక పోవడం న్యూనతా? సాంఘికమైన హోదాకు భంగమా? ఏకాకి బ్రతుక్కు సూచనా! అనుకున్నది-శారద విశ్శబ్దంగా.

శారద ఆ హైస్కూల్లోచేరి రెండే ళ్ళయింది. గుంటూరులో బి. ఇడి. ట్రైనింగ్ పూర్తికాగానే ఒక పుణ్యాత్ముని




చలువవల్ల పుట్టిపెరిగిన చోటనే ఉద్యోగం కూడా లభించింది. ఆమెవయస్సు మొన్న శ్రావణానికి సరిగ్గా ఇరవైమూడేళ్ళు. అవివాహిత, తండ్రి మరణించి ఒక దశాబ్దమై ఉంటుంది. కన్నతల్లే సర్వస్వం. కాని ఆవిడది అతుకుమెత్తని ఆరోగ్యం; రెండుపూటలు బావుంటే మూడోపూట మంచమెక్కుతుంది. ఉబ్బసమూ, ఉష్ణమూ, గుండెజబ్బు, కడుపునొప్పి - ఇత్యాది రోగాలు ఆవిడను చావనివ్వకుండా అడకత్తెరలోపోకకాయ స్థితిని కల్పిస్తూఉంటాయి. శారద ఇంకా ఎందుకు పెళ్ళిచేసుకోలేదు? — అన్న ప్రశ్నకు, "మనం ఏంచేయగలం? ఆ కల్యాణగడియ రావాలి," అంటుం దావిడ. శారదమటుకు నీటిలోకప్ప నీరు త్రాగినంత నిర్లిప్తతతో చిరునవ్వు నవ్వుతుంది.

సెలవు రోజుల్లో అప్పుడప్పుడూ శారద గుంటూరు వెళ్ళివస్తూ వుంటుంది. ఏడాదిన్నర క్రితం టిక్కెట్టు కలెక్టరు రాంమోహన్‌తో ఆమెకు విచిత్రంగా పరిచయమైంది. ఒకరోజు ఆమె గుంటూరునుంచి తెనాలి రైల్లో వస్తూం డగా చేతిలోవున్న చిన్న పర్సుపోయింది. దాన్ని దొంగ లెత్తుకెళ్ళారో, జారి పోయిందో కూడా ఆమెకు వివరంగా తెలియదు. ఆ పర్సులో రైల్వేటిక్కట్టూ, మూడున్నర రూపాయల చిల్లరా ఉన్నాయి. వేజెండ్ల దగ్గిర టిక్కెట్టు చెక్కింగ్ ఇనస్పెక్టరు రాంమోహన్ ఆ బండీలో టిక్కెట్లు చెక్ చేస్తూ ఆమెను అడిగాడు. ఆమె భయంతో కంపించి పోయి కలవరపడలేదు నిజాన్ని నిర్భయంగా చెప్పింది. అతను సానుభూతి కనబర్చి, ఏ ఇబ్బందీ లేకుండా తెనాలి స్టేషన్లో దాటవేశాడు — టిక్కెట్టు కలెక్టరుతోచెప్పి. ఆమె కృతజ్ఞతా పూర్వకంగా నమస్కారం చేసింది. ఆపైన ఆరైల్లో చాలామాట్లు ఇద్దరూ

తటస్థపడడం జరిగింది. తల్లికి కడుపులో వ్రణానికి ట్రీట్‌మెంటుకు గుంటూరు గవర్నమెంటు హాస్పటల్లో చేర్పించినప్పుడు శారద తరుచు రైల్లో వస్తూపోతూండేది. వారిరువురు మధ్య స్నేహం రెమ్మలూ కొమ్మలుగా అభివృద్ధి కాసాగింది. కాని. ఆమె ఆస్నేహాన్ని ఎప్పుడూ ప్రేమగా ఊహించుకుని మధురమైన మృగతృష్ణలో మల్లెపూ పరిమళంవలె తేలిపోలేదు.

అందంలో పందెం వేయదగ్గ యువకుడు రాంమోహన్. తెల్లగా, పొడుగ్గా, ఆకర్షణీయంగా ఉంటాడు. కన్నెమనసులో వలపువెర్రిని పుట్టించగల మహత్తు అతని పర్సనాలిటీకున్నది. కాని కోదెత్రాచులాంటి యువకునిలో కోర్కెలను రెపరెపలాడించే అందమూ, ఆకర్షణా శారదలో లేవు. సామాన్యమైనస్త్రీ. శరీరంలో ఏ భాగానికి ఆ భాగం తీర్చిదిద్దినట్లు వున్నప్పటికీ, పురుషహృదయాన్ని సూటిగాతాకే చైతన్యపూరితమైన ఆకర్షణ లేదు. ఆమె సౌందర్యంలో పచ్చదనంపాలుతక్కువ. కావి ఆమె అందమైంది కాదని నిర్మొహమాటంగా చెప్పడానికి లేదు. ఆమెకింకా పెళ్ళి కాకపోవడానికి ముఖ్యకారణం – ఆమె అందంలో సజీవమైన ఆకర్షణ లోపించికాదు. గతంలో రెండుమూడు సంబంధాలు పెళ్ళివరకూ వచ్చి తప్పిపోయాయి. ఒక సంబంధం వారికి ఆమె అంత ఎక్కువగా చదువుకొనివుండడం నచ్చలేదు; మరో సంబంధం వారికి కట్నంఇచ్చుకోలేని ఆమె ఆర్థిక దుస్థితి అడ్డుపడింది; ఇంకో సంబంధం వారికి ఆమె చేస్తూన్న ఉద్యోగం గిట్టలేదు. ఆ సంబంధాలు ఆ కారణాలచేత జారిపోవడంతో, 'పెళ్ళి' మీద ఆసక్తీ, అభిప్రాయమూ అడుగంటిపోయి – జీవితంపట్ల నిర్లిప్తతాభావాన్నీ సినిసిజాన్నీ పెంచుకొని, ఏకాంతమైన ఆలోచనలతో ఒంటరిగా బ్రతుకుతూన్నది.

ఆరోజు ఆదివారం; శారద గుంటూరు వెళ్ళింది. స్టేషనులో రాంమోహన్‌ను కల్సుకున్నది.

"మీరొక్క సహాయం చేసిపెట్టాలి" అన్నది శారద.

"ఏమిటి?" అన్నాడు రాంమోహన్.

ఆమె హ్యాండ్‌బ్యాగ్‌నుంచి ఓ దజను పోస్టుకవర్లను తీసియిచ్చింది. ప్రతి కవరులోనూ ఉత్త తెల్లకాగితాలే మడతపెట్టి ఉన్నాయి.

"ఈ కవర్లపైనా స్కూలు అడ్రసు వ్రాసి వారానికొక్కటి చొప్పున మీరు పోస్టు చేయాలి. అంతే!" అన్నదిశారద తలవంచుకొని.

రాంమోహన్ విపరీతంగా ఆశ్చర్యపడ్డాడు.

"ఎందుకు?"

"ఆ ప్రశ్న మీరు వేయకూడదు. దానికి సమాధానం చాల 'సిల్లీ' అయినట్టిది. అన్యధా భావించకండి. ప్లీజ్,



నేను చెప్పినట్లు చేయండి." అన్నది శారద కించిత్ ఆవేశపరురాలై.

"సరే!" అన్నాడు రాంమోహన్- ఆమె కేసి అయోమయంగా చూస్తూ.

వెంటనే శారద ట్రైన్లో తెనాలి వచ్చేసింది.

ఓ వారం రోజుల తర్వాత స్టాఫ్ రూమ్‌లో విజయలక్ష్మీ, గోవర్ధనమ్మా, అనూరాధా, అంబుజవల్లీ, జయశ్రీ, వివేకవర్ధనీ మొదలైన టీచర్లంతా కూర్చున్నప్పుడు ప్యూను రాములు శారదకో ఉత్తరం తెచ్చి ఇచ్చాడు. పెదవులు దాటని చిరునవ్వు నవ్వుతూ ఆ లేఖను అందుకొని నిర్లక్ష్యంగా పుస్తకంలో పెట్టుకుంది. ఉపాధ్యాయినులందరూ ఆమె కేసి వింతగా చూశారు. అది

మొదట్లో వారం వారం శారదకు టంచనుగా ఉత్తరాలు రాసాగాయి. ఆమెను ఎగతాళి చేయడం మానివేశారు – తోటి టీచర్లు. శారద మనస్సుకు ఆదెంతో తృప్తి నిచ్చింది.

శారద ఆ ఉత్తరాల్ని ఎప్పటికప్పుడు భద్రంగా ఇంటికి తెచ్చి, సాయంత్రం పూట గనగనమండే పొయ్యిలో వేస్తున్నది. ఏ ఉత్తరమూ ఆమె విప్పలేదు. ఆమెకు తెలుసు: అందులో వుండేది తెల్లకాగితమేనని.

మూడు మాసాలు దొర్లిపోయాయి.

ఓ రోజు హఠాత్తుగా రాంమోహన్ ఆ గరల్స్ హైస్కూలుకు వచ్చాడు. ఆఫీసులో 'శారద'ను గురించి ఎంక్వయిరీ చేశాడు. ప్యూను రాములు అతన్ని వెంటబెట్టుకుని స్టాఫ్‌రూమ్‌కు వచ్చాడు. శారద తూర్పు దిక్కున ఓ మూల కూర్చుని క్లాసు టెస్టుపేపర్లు దీక్షగా దిద్దుకుంటూన్నది.

మన్నుతిన్న ముపాలాంటి మనిషి శారదకోసం కొబ్బరి మామిడికాయలాంటి ఓ యువకుడు రావడం స్టాఫ్ రూమ్‌లో వున్న లేడీటీచర్లందరికీ ఆశ్చర్యాన్నే గాకుండా అసూయనుకూడా కలిగించింది.

రాంమోహన్ రాకకు శారద తబ్బిబ్బు అయింది.

ఇద్దరూ బయటికొచ్చి దగ్గర్లోవున్న ఓ హోటల్లో కూర్చున్నారు.

"ఏమీలేదు. మీరుస్కూల్లో ఉన్నారో లేదో, ఎక్కడికేనా ట్రాన్స్‌ఫర్ అయినారేమో కనుక్కుందామని వచ్చాను. ఈ మధ్య మీరు కనబడటం కూడా మానివేశారు." అన్నాడు రాంమోహన్ సిగరెట్టు వెలిగిస్తూ.

"ఆ అనుమానం మీ కెందుకొచ్చింది?" అన్నది శారద కనురెప్పల మీదుగా చూస్తూ.

సర్వర్ ఇద్దరి ముందూ కప్పు సాసర్లలో కాఫీ తెచ్చిపెట్టాడు. హోటల్లో జనం అట్టేలేరు.

"ఒక్క ఉత్తరానికీ మీరు సమాధానం వ్రాయలేదు." అన్నాడు రాంమోహన్ –కప్పులోకాఫీ 'సిప్' చేస్తూ.

శారద విశ్చేష్టురాలైంది. అంతలోనే తేరుకుని, "అవన్నీ ఖాళీ కవర్లేగా?" అన్నది.

రాంమోహన్ నిర్విణ్ణుడైనాడు.

"ఆ ఉత్తరాల్ని మీరు చదవలేదా?"

"ప్చ్" తల ఆడిస్తూ అమాయికంగా అన్నది శారద.

నిప్పు రవ్వలాగా పదునుగా నిట్టూర్పు విడిచాడు–రాంమోహన్.

"మరి ఆ ఉత్తరాల్ని ఏం చేశారు?"

"లోపల నేను పెట్టిన తెల్లకాగితాలే గదా–అని ఆ కవర్లను ఏరోజు కారోజు పొయ్యిలోవేస్తూండేదాన్ని విప్పకుండా."

రాంమోహన్ మొహంలో అప్పటికప్పుడే మబ్బులుపట్టి చీకట్లు జడల్ని

విరబోసుకున్నాయి. ఆ పరిస్థితికి శారద అప్రతిభురాలైంది.

"ఆ ఉత్తరాల్లో ప్రకటించిన నా ప్రేమంతా వృథా అయింది. శారదా! నిన్ను ప్రేమిస్తున్నట్టూ, నీ అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా తెలుప వల్సిందిగా, త్వరలో మన వివాహానికి అంగీకరించవల్సిందిగా కోరుతూ వ్రాశాను. మా వాళ్ళు నచ్చినపిల్లను పెళ్ళి చేసుకోమని నన్ను ఒత్తిడి పెడు తున్నారు. మీనుంచి ఏ సమాధానం రాక పోయేసరికి – మీరు నాపట్ల విముఖత చూపెడుతున్నారనీ, ఒకవేళ ట్రాన్స్ఫర్ అయి మరో ప్రదేశానికి వెళ్ళారనీ ఏమేమో–అనుకున్నాను. ఆలోచించాను. చివరకు వుండబట్టలేక ఇట్లా వచ్చాను. ఏమంటారు?" అన్నాడు రాంమోహన్– ఆమెకేసి ప్రేమ ఒలికిపోయేట్టు చూస్తూ.

శారద సిగ్గుతో సంపెంగమొగ్గ అయింది. ఆ సిగ్గుద్వారానే ఆమె పెద వులపై అంగీకారం బయటపడింది.

నీరెండలాంటి ఉత్సాహం అతనిలో పరవళ్ళు త్రొక్కింది. ఆమె మృదు హస్తాన్ని మృదువుగా దగ్గరకు తీసికొని– 'పోనీలే! జరిగిందేదో జరిగిపోయింది. పరిస్థితులు అనుకూలించి మన వివాహం జరిగితే – ఇంకా అట్లాంటి ఉత్తరాలతో పనేముంది" అన్నాడు రాంమోహన్.

శారద మోహం వలపు వెన్నెలతో వికసించిన కుసుమమైంది.



# పెద్దమనిషి

బీడీవోగారి గదిముందు నిలపడివున్న పెద్దమనిషి ఎగగట్టిన పంచను మొల్లో దోపుకొని, పైపంచె ఒకసారి ఝూడించి, జేబులో సిగరెట్టుపెట్టె పైకతీసి ఒక సిగరెట్టు ముట్టించాడు. రెండు దమ్ములు తాగి, అటూఇటూ చూసి, సరాసరి గదిలోనికి దూసుకుపోయాడు. ఎదురుగా బీడీవోవున్న స్థానంలో స్థానిక తాసీల్దారుగారు కూర్చొని ఉన్నారు. పెద్దమనిషి క్షణం స్తబ్ధుడై, వెంటనే పైకొచ్చి సిగరెట్టు పారేసి, పైపంచ ఉండగాచుట్టి, చంకలో పెట్టుకొని, ఎగ్గట్టిన పంచ కిందకు సరిచేసుకుని, చేతులు నులుముకుంటూ, మళ్ళీ లోనికొచ్చి సవిన యంగా నిలపడ్డాడు.

తాసీల్దారుగారు, పెద్దమనిషిని చూసి చిరునవ్వొకటి విసిరారు. పెద్దమనిషి మహాశ్చర్యపడ్డాడు.

"మన్నించాలి అయ్యగారు! తమరిక్కడెట్లా ఉన్నారు? ఎప్పుడు దయచేశారు? నేను-మన బీడీవోగారి దర్శనంకోసం వొచ్చానండి-" అన్నాడు పెద్దమనిషి సవినయంగా.

తాసీల్దారుగారు రెండో చిరునవ్వు విసిరారు.

"నే నిప్పు డిక్కడే ఉంటున్నా! నా కిక్కడికి బదిలీ అయింది. ఇప్పు డిక్కడ బీడీవోని నేనే!"

పెద్దమనిషి వెంటనే నిటారుగా నిలపడ్డాడు. చంకలో ముద్దగా వున్న పైపంచ తీసి ఝూడించి పైన వేసుకున్నాడు, కుర్చీలో కాళ్ళు పైకెత్తి కూర్చున్నాడు. జేబులోంచి, ఈసారి ఒక బీడీ తీసి ముట్టించాడు. పొగ వదులుతూ బీడీవో ముఖంలోకి చూశాడు. బీడీవో మూడో చిరు నవ్వు విసిరాడు.

---

'శేఖర్'

---




తోటలో మల్లెపందిరి దగ్గర తిన్నెమీద కూర్చుంది, పద్మావతమ్మ - ప్రక్కనే ప్రొద్దుతిరుగుడు పూలు విరగబూసివున్నాయి. ఇంకోవైపు అంటుమామిడిచెట్లు జంటగా ఉన్నాయి. వాటినీడ పద్మావతమ్మ ముఖంమీద పడుతోంది. పొద్దుతిరుగుడుపూలు వచ్చగా విరిసి సూర్యునివేపు వంపుతిరిగి ఉన్నాయి. ఆమె వాటికేసి చూస్తోంది - దీక్షగా! ఆ పూలబ్రతుకు ఆమెకు వింతగా తోచింది. ఆధారంలేకుండా విలవలేని పూలు; సూర్యుడు ఉదయిస్తే కన్ను తెరుస్తాయి. ఆతను ఏవేపు తిరుగుతే ఆలేపే తిరుగుతాయి. అతను కనుచాటయితే అవీ బ్రతకలేక కన్ను మూస్తాయి. ఎంత విచిత్రం! ఆధారం

లేకుండా బ్రతకలేని ఆడదాని బ్రతుక్కి ప్రతీక ఆ పూలు! తనూ అంతేకదా! ఏదో వెలుగు ఎదటకనిపించినన్నాళ్ళు వికాసము పొందింది. ఆ వెలుగు అస్తమించగానే దిక్కుతోచక చీకట్లో మనస్సు అల్లాడుతోంది! దీపంలేకుండా నీడ ఉండలేదు. ఇప్పుడు దీపం ఆరిపోయింది. అయినా ఇంకా నీడమాత్రం మిగిలివుంది. ఇదేదో విచిత్రమైన పరిస్థితి!

దూరాన మేడ కనిపిస్తోంది. చెట్ల సందుల్లోంచి తెల్లనిగోడలు అందంగా ఉన్నాయి. అది తనఇల్లు. ఎంతో ఓపికతో అందంగా కట్టించుకున్న ఇల్లు; ఉండేది తనూ, భర్త రామారావు ఇద్దరు మాత్రమే! అయినా విశాలంగా అందంగా కట్టించుకున్నారు. ఎక్కడెక్కడినుంచో, రకరకాల వస్తువులు తెచ్చి గదులన్నీ అలంకరించారు. అయినా ఇల్లంతా ఎప్పుడూ వాడలేదు. మేడమీద దక్షిణంవైపు మూడు గదులు మాత్రమే వాడుకునేవారు. క్రింద వంట ఇల్లు భోజనాలగది, వసారా అన్నీ వంటామె చంద్రమ్మ ఆధీనంలో ఉంటాయి. మిగిలినఇల్లు దుమ్ము దులపడానికీ ఎవరైనావస్తే చూపించటానికీ మాత్రం ఎప్పుడైనా తలుపు తెరిచేవారు.

రామారావు సబ్బుల వ్యాపారం చేశాడు. అది అతనికి కలిసివచ్చింది, క్రమంగా ఆస్తి, అంతస్తూ పెరిగాయి. సుఖంగా కాలం గడపడానికి అలవాటు పడ్డాడు తెల్లనిబట్టలు, పువ్వులు, సుగంధ వస్తువులు, నాజూకుబ్రతుకు నేర్చుకున్నాడు పద్మావతమ్మ అన్ని విధాల అతనికి నీడలాఉండేది. అతని పనులన్నీ తానే చేసేది. ఏ క్షణమైనా కాస్త దూరమైతే ఎదురుచూస్తూ ఉండేది. ఆమెకు మరొక బ్రతుకు, మరొక ఆలోచన లేవు.

అతను ఉన్నట్టుండి "రేపుమనం సిమ్లా వెళదాం!" అంటే వెంటనే బట్టలు సర్దుకునేది. "మనం పైనెల జపాను వెడుతున్నాము" అంటే విని ఊరుకునేది, "అమ్మో! అంతదూరమా!" అని మనసులో అనుకునేది. "ఈ ప్రయాణమెందుకూ?" అని ఎప్పుడూ అడగలేదు. అతను వెళితే తానూ వెళ్ళాలి అంతే! అతనికి ఉదయమే వేన్నీళ్ళుకాచి ఇవ్వాలి. పదిగంటలకు హార్లిక్సుకలిపి ఇవ్వాలి. అతని వస్తువులన్నీ చూసి సర్దాలి. అతను అన్ని సంగతులు తనతో చెపుతాడు. తాను ఓపికగావినాలి. అంతమాత్రమే తెలుసు, వ్యాపార విషయాలన్నీ ఎంత చెప్పినా ఆమెకు అర్థంకావు. అతను అందమైన వస్తువులను సుందరమైన దృశ్యాలను వర్ణించి చెపితే అర్థమవుతుంది; ఇంకేమీ అర్థంకావు, అయినా ఓపిగ్గా వింటూనే ఉంటుంది. ఒక్కొక్కసారి మనసు నిలవదు. దృష్టిబయట విరగబూసిన సన్నజాజి తీగమీదకు పోతుంది. ఆ




పువ్వులు గుప్పెడుకోసి తెచ్చుకోవా లనిపిస్తుంది. అయితే ఆమె పరధ్యానంగా ఉంటె అతనికి కోపంవస్తుంది. అందుకే కదలలేదు.

ఒకసారి ఈ మల్లెపందిరి దగ్గరే ఒంటరిగా కూర్చున్నారు. పండువెన్నెల కాస్తోంది. ఆక్షణం అతను ఎంతో సంతోషంగా ఉన్నాడు. పరిహాసంగా అన్నాడు. "ఇవ్వాళ మన వ్యాపారం పడిపోయినా ఫరవాలేదు. మనకున్న ఆస్తి మూడు తరాలకు సరిపోతుంది," అవి. ఆమాటలకు ఆమె తెల్లబోయింది. "మూడుతరాలా! ఇప్పుడు ఎవరున్నారు మనకు? పిల్లలు లేరుగదా!" అనుకుంది. మాట్లాడలేదు. అతను సంతోషంగా ఉన్నాడు. "ఇంత పాధించాను గదా! ఇంత సంపాదించానుకదా!" అవి తృప్తికాబోలు, అతని మనసు నొప్పించకూడదు. అందుకే ఊరుకుంది.

మూడేళ్ళ క్రిందట అతనికి జబ్బు చేసింది, దగ్గు ఆయాసంతో కొన్నాళ్ళు బాధపడ్డాడు. మళ్ళా కోలుకున్నాడు. నిరుడు మళ్ళా జబ్బుచేసింది. ఆరు నెలలు జబ్బుగానే ఉన్నాడు. తను ఇల్లు పూర్తిగా చంద్రమ్మకే వదిలేసింది. రాత్రింబగళ్లు అతని దగ్గరేఉంది; ఆరు నెలలు ఆమెకు ఆకలి వేయటంలేదు. నిద్రా రాలేదు. శరీరం నీరసించి తపసపడింది. అతనికి జబ్బు నయం కాలేదు. రోజు రోజుకూ బాధ ఎక్కువైంది. అతని ఆవేదన చూడలేక ఏమీ చెయ్యలేక ఆమె అల్లాడి పోయింది. ఒక్కక్షణం ప్రాణమైనా

పోతె బాగుండుననిపించింది. ఆ ఊహ కామె అదరిపడింది. ఏమూలో తనలో రాక్షసత్వం ఉన్నదా! — అనుకుంది. కుమిలిపోయింది. ఏదో మైకంలా వచ్చి ఒక్కక్షణం ఒళ్ళు తూలింది; తేరుకుని అతనివేపు చూచింది. అతను ప్రశాంతంగా ఉన్నాడు. అతని ముఖంలో ఇప్పుడు ఏ ఆవేదనాలేదు; ఆమె అతను విద్రపోతున్నాడనుకుంది. కదిలితే మెళకువ వస్తుందేమో! మళ్ళా బాధ పడతాడేమో! అలాగే భయంగా ఒరిగి కూర్చుంది, ఒక్కక్షణం! అతను అన్ని బాధలకు అతీతంగా వెళ్ళిపోయాడన్న సంగతి తెలియలేదు. — డాక్టరువచ్చి చెప్పిందాకా!

ఆకాశంలో ఆడుతున్న గాలిపటం, నేలమీద లాగుతున్న దారం తెంపుకు వెళ్ళిపోయింది, ఏ మూలకో! ఈ మేడల నందున ఎక్కడని దాన్ని వెతకటం! పద్మావతమ్మ బ్రతుకు తెగిన దారంలా రెపరెపలాడింది. అతను ఉండగా ఆమెకు ఏచింతాలేదు, అతను ఎప్పుడూ ఆమె కొంగుపట్టుకు వదలలేదని కాదు. ఒక్కొక్కరోజు పొద్దున వెళితే మళ్ళా రాత్రి కే కనిపించేవాడు. అయినా అప్పుడు బాధలేదు, ఒంటరితనంలేదు, ఇప్పుడు ఇల్లంతా బోసిగాఉంది. బ్రతుకు భయంకరంగా ఉంది. చంద్రమ్మ పని గట్టుకు పైకివచ్చి కూర్చునేది, — తనకు తోడు. కాని అది ఆమెకు నచ్చలేదు, మరొక మనిషిఉంటె మరీ ఏదో ముళ్ళు గుచ్చుతున్నట్లు ఉండేది. ఒంటరిగా వసారాలో పూలచెట్లను చూస్తూ కూర్చునేది, ఆ క్షణం అతను ప్రక్కనే ఉన్నట్లు భ్రమకలిగేది. అదికాస్త ఊరట!

కొన్నాళ్ళకి ఇతర విషయాలు మనసులో ప్రవేశించాయి! సీడలు కమ్ముకున్నాయి. మేనేజరు మంచివాడేనా? ఏమో! మోసంచేస్తాడా? భయం పట్టుకుంది, మనశ్శాంతి పోయింది.

ఇంకొన్నాళ్ళకి ఎందరో వస్తామని వ్రాశారు. "అమ్మాయిని నిర్మలను మీఊరు పంపిస్తాను. చదువుకోటానికి. నీకు తోడుగాఉంటుంది. "అని వ్రాసింది అక్క. "నాకు మీఊరు బదిలీ అయింది. మీ ఇంట్లో ఉండాలని ఉంది, సరళను పిల్లల్ని తీసుకువస్తాను." అని రాశాడు మేనల్లుడు.

పద్మావతమ్మకు ఏమీ తోచలేదు. అతను బంధువుల నెవరిని దగ్గర చేర్చలేదు. అతనికి ఒంటరి జీవితమే ఇష్టం. పద్మావతమ్మ తప్ప ఇంకెవరూ కావాలని అతనెప్పుడూ కోరుకోలేదు. మరి ఇప్పుడు తను ఏం చెయ్యాలి? ఆలోచన తెగలేదు. తనకు పిల్లలుంటే బాగుండేదేమో! అప్పుడు బ్రతకటానికి ఒక ఆధారమూ, కారణమూ ఉండేవి! కాని అతను ఎన్నడూ ఆ విషయమే పట్టించుకోలేదు. ఆలోచనలతో ఆమెతల వేడెక్కింది. ఏదోబాధ! భరించలేక

వెళ్ళి రెండు నిద్రమాత్రలు మ్రింగింది. అవి ఎప్పుడో అతనికోసం తెచ్చినవి మర్నాడు మధ్యాహ్నంవరకు నిద్ర పోయింది. మెళకువరాలేదు.

తరువాత మనస్సు తేలికపడింది. ఎప్పుడో అతను అన్నమాట జ్ఞాపకం వచ్చింది. "ఇక సంపాదించక పోయినా ఫరవాలేదు. మన ఆస్తి మూడు తరాలకు సరిపోతుంది '' ఈ తరంలో అనుభ వించటానికే ఎవరూ లేరు. మూడు తరాలవరకు ఎందుకూ? దేనిమీదా తనకు ఆసక్తి లేదు. ఉన్నవాళ్లు అనుభవిస్తే ఏం? అనిపించింది. మనసులో బాధపోయింది.

మేనేజరు ఎన్నాళ్ళగానో ఉన్నాడు. పిల్లలుగలవాడు. కష్టపడిపనిచేస్తున్నాడు. తన డబ్బు కొంత వాడుకొంటాడేమో నన్న భయమెందుకూ? పోనీలే - అని పించింది. బంధువులకు, స్నేహితులకు, తన్ను ఆశ్రయించుకున్నవాళ్లకు కాకపోతే ఈ డబ్బు తన కెందుకూ? భద్రంగా ఎన్నాళ్ల దాచుకుంటుంది? ఎంతకాలం బ్రతు కుతుంది? ఎప్పుడూ ఇలానే ఉంటుందా? అనుకుంది విరక్తితో.

ఆ తరువాత అందరూ వచ్చారు. అక్కకూతురు నిర్మల వచ్చింది; మే నల్లుడు సంసారంతో వచ్చాడు. చంద్రమ్మ కూతురికి జబ్బుచేసింది. కూతుర్ని, పిల్ల లను తీసుకువచ్చింది.

ఇప్పుడు ఇల్లు సందడిగా ఉంది. పిల్లల అరపులు, ఆటలు, పెద్దవాళ్ళ మాటలు కలకలలాడుతోంది. అందరూ అన్ని గదులు స్వేచ్ఛగా వాడుకుంటు న్నారు. మేడమీద రెండుగదుల్లో మాత్రం పద్మావతమ్మ తలదాచుకుంది. అందరూ అన్నీ ఆమెను అడుగుతారు. అందరికీ ఆమెడబ్బు కావాలి. ఆమె సలహా కావాలి. అయినా వాళ్ళ సమస్య లేవీ ఆవిడ నెప్పుడూ బలంగా అంట టం లేదు. అందరిని చూస్తోంది. అంద రితో మాట్లాడుతోంది. ఎవరికి ఏ లోపమూ చెయ్యటం లేదు. అయినా ఏదీ మనసును అంటటం లేదు. తామరాకు మీద క్షణం నిలిచి జారిపోయిన నీటి బొట్టులా ప్రతిసంగతి ఒక్కక్షణం మన సునుతాకి మళ్ళా జారిపోతోంది.

ఒడ్డుకు చేరిన నావలా ఉంది, ఇప్పుడు ఆమె బ్రతుకు। కల్లోలం లేదు. ఏ క్షణాన అలలు ఉవ్వెత్తుగా లేస్తాయో, ఏ క్షణాన తుపానుముంచుకు వస్తుందో అన్న భయంలేదు. తీరాన ఉండి అలల తాకిడికి కదలిపోతూన్న తెప్పలను వింతగా చూడడం వినోదంగా ఉంది.

సూర్యుడు అస్తమించాడు. ప్రొద్దు తిరుగుడుపూలు వాడిపోయినాయి. పద్మా వతమ్మ లేచి ఇంటికి వెళ్ళింది. చంద్రమ్మ, పిల్లలు తులసికోట దగ్గర కూర్చుని పాటలు పాడుతున్నారు. మేడమీద మేనల్లుడు భార్యనేదో పరిహాస మాడి ఉడికిస్తున్నాడు. ప్రక్కనే నిర్మల విరగబడి నవ్వుతోంది.

అప్రయత్నంగా పద్మావతమ్మ మెల్లగా నవ్వింది.



# చెదిరిన రూపం

డి. కామేశ్వరి

"బుధవారం ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్నాను. స్టేషనులో కలుసుకో—మాలతి."

కార్డు తలా తోకా అందలేదు భాస్కరానికి ... అటుఇటు త్రిప్పిచూశాడు. తనది కాదేమోనని!!

తనదే...హైదరాబాదునించి.

హైదరాబాదులో తనకి తెలిసిన వాళ్ళు తక్కువ...ఎవరీ మాలతి?

విసుక్కున్నాడు భాస్కరం. కార్డులో ఇంకా జాగావుంది. ఇలా టెలిగ్రాఫిక్ భాష రాయకపోతే తన ఎడ్రసు, వివరం రాస్తే ఆవిడ సొమ్మేంపోతుందో!...

రేపేబుధవారం!...స్టేషనికిరమ్మని ఆర్డరు. వెళ్ళాలన్నమాట!...వెళ్ళి?... ఆవిణ్ణెలా గుర్తుపట్టడం? ... అదేదో కధలోలాగ — నేను నీలిరంగుచీర కట్టుకునివస్తాను, జడలో గులాబిపువ్వు పెట్టుకుంటాను. దాన్నిబట్టి నువ్వు నన్నుపోల్చుకో అని రాయగూడదూ? ...అసలేంరాసింది కనక!

నవ్వుతోపాటు చిన్న థ్రిల్ కలిగింది భాస్కరానికి మాలతి ఎవరో? పాపం, తనకి ఆమె బాగా గుర్తుంటుందని కాన్ఫిడెన్స్‌తో రాసింది... పైగా ఏకవచనప్రయోగం - అంటే చనువు!...తమాషాగా వుంది

చనువుగలవాళ్ళలో మాలతి ఎవరు?

స్నానంచేస్తున్నా, డ్రస్సవుతున్నా, భోజనంచేస్తున్నా...ఆఖరికి ఆఫీసులో ప్లాన్లూ, ఎస్టిమేట్లూ, బ్లూప్రింట్లూ అన్నీ అంతసమయం ఆ నాలుగు పొడిముక్కలతో మెరుస్తున్నాయి, గింగురుమంటున్నాయి. ఆ మిస్టీరియస్ మాలతిని గురించిన ఆలోచనలు మెదడులో గింగురుమంటున్నాయి.

అవును...మాలతి...ఇంటర్ చదివే రోజుల్లో...నవ్వొచ్చింది భాస్కరానికి. ఆ మాలతే! నల్లగా, పొట్టిగా, పేలగా.. ఏ ప్రత్యేకతా లేకుండా... కాలేజి అబ్బాయిలని ఆకర్షించే ఒక్క గుణమైనా లేకుండా - తలవంచుకుని బుద్ధిగా పాఠాలు చదువుకుని వెళ్లేది- ఆ మాలతి! ఇంతలా తెగించి, చొరవ తీసుకని ఏకవచనప్రయోగం కూడా చేసి ఉత్తరం రాయడమా! ఆశ్చర్యం! భారతస్త్రీ ముందడుగు వేస్తున్నదన డానికి ఇదొక సాక్ష్యం!... కాని ... ఆవిడతో అసలు పరిచయమేలేదు... ఆ మాలతి అయివుండదు. ఆ మాలతికి తను జ్ఞాపకం వుండి వుండచ్చుగాని ఇంత చనువు చొరవ సాహసం ఎక్కణ్ణుంచొస్తాయి!!

ఓహో- వెంకట్రావు భార్య మాలతిగారేమో! తను జూనియర్ ఇంజనీర్‌గా చేరినరోజుల్లో వాళ్ళవూరికి వేసేరు. వెంకట్రావు ఇంట్లో ఓ గది అద్దెకు తీసుకుని ఉండేవాడు తను. వెంకట్రావు, మాలతి ఇద్దరూ చాల మంచి వాళ్ళు. కొద్దిరోజుల్లోనే వెంకట్రావు తనకి మంచి స్నేహితుడయ్యాడు. హోటల్నుంచి క్యారియర్ తెప్పించుకునేవాడు. వెంకట్రావు భార్యతో చెప్పి అప్పుడప్పుడు కూరలు, పచ్చళ్లు పిల్లలచేత పంపేవాడు. పండుగలు అవి వస్తే భోజనానికి పిలిచేవాడు.

కాని మాలతిగారితో తనకు అంత పరిచయంలేదు; చనువు తక్కువ. ఏదో మాటవరస సంభాషణలుతప్ప ఆవిడతో ఎక్కువ మాట్లాడిందిలేదు.. ఆమాత్రం పరిచయంతో, ఇన్నాళ్ళ తరువాత పదెనిమిదేళ్లు కాలేదామరి! - ఆ పరిచయం ఇంకా గుర్తుంచుకుని తన ఎడ్రెస్ కనుక్కుని అంత చనువుగా, అధికారంగాస్టేషనికిరమ్మనిరాస్తుందా? ...అంతగా ఉత్తరం రాయదలిస్తే వెంకట్రావు రాస్తాడు...ఆవిడ అయి వుండదు...ఆవిడ కానేకాదు!

ఓ...మాలతంటే...? మైగాడ్!.. ఆవిడ...! చిన్నప్పుడు.

ఎప్పుడో, ఏ ఇరవై, ఇరవై రెండేళ్ల

క్రితమో, జారిపోయే నిక్కర్లని ఎగ దోసుకునే 'బావి'ని ఇంకా గుర్తుంచుకుని ఇన్నాళ్ళకిఉత్తరం రాస్తుందా? ఆ మాలతేనా?...ఇన్నాళ్లులేనిది తను యిప్పుడెలా గుర్తువచ్చాడు? ఎక్కడ వెతికిపట్టుకుంది తన ఎడ్రస్?... తను ఇక్కడ వున్నట్లు ఎలా తెలుసుకుంది? ఈ రకంగా కమాండింగ్ గా రాయాలంటేఆవిడకే చెల్లింది. కచ్చితంగా అవిడే!

తనకంటె పదిపన్నేండేళ్ళు పెద్దది! తన కప్పుడు ఏడెనిమిదేళ్లు వుంటాయేమో! వాళ్లు తమయింటి ఎదురుగా వుండేవారు, మాలతికి అప్పుడే క్రొత్తగా పెళ్ళయింది. అతను ఇంజనీరు

ఆ రోజుల్లో మాలతి అంటే తనకి ఒకరకం ఆరాధ్య దేవత. మాలతిని చూస్తుంటే ఓ దేవకన్య అనిపించేది. మాలతి తనతో మాట్లాడితే ఏదో ఘన కార్యం సాధించినట్లు గర్వంగా ఉండేది. మాలతి ఎంత అందంగా వుండేది!

ఇప్పటికీ ఆ రూపు కళ్ళకి కడుతోంది. పచ్చగా, నాజూగ్గా, పెద్ద వాలుజడ...ముట్టుకుంటే కందిపోతుందనిపించేటంత కోమలత్వం!...ఆ రోజుల్లోనే కాలేజి చదువు చదివిన మాలతిని చూస్తే తనకేకాక ఇరుగుపొరుగుకు కూడా గౌరవం! మొగుడు మంచి ఉద్యోగి, ఇల్లంతా ఆధునికంగా ఉండేది. ఇల్లు, సామాను అంతా వింతగా కనిపించేది. మాలతి నడకలో, నిల్చోడములో, మాట్లాడడంలో, నవ్వడంలో, పుస్తకం చదవడంలో ఆఖరికి వంటింట్లో వంటచేస్తున్నా తన యింట్లో అమ్మ, అక్కలకి ఎవరికిలేని ప్రత్యేకత ఏదో కనిపించేది. (అంచేతే ఆ రకం వర్షిప్ వుండేది తనకి.) రోజూ ఏదో ఒకటి తినడానికి పెట్టేది; బొమ్మల పుస్తకాలు చూపించి కథలు చెప్పేది.

ఆ నవ్వు! ... ఆ నవ్వు చూస్తుంటే ఎప్పుడూ ఆమె దగ్గిర వుండిపోయి కదిలి వెళ్ళా లనిపించేది కాదు. ఓ పెంపుడుకుక్కలా వుండేవాడు, తన ఈడుపిల్లలతో ఆటలాడకుండా అక్కని అంటిపెట్టుకు తిరుగుతున్నాడని అమ్మ తిట్టేది. ఇరవై నాల్గు గంటలూ వాళ్ళింట్లో పడుస్తావేం. ఆవిడ కొంగు పట్టుకుని, నీ యీడుపిల్లలతో ఆడుకోకుండా ఆవిడతో నీకు జోస్తి ఏమిటని-"

ఒక్కపూట తను వెళ్ళకపోతేమాలతే గుమ్మంలో నిల్చుని పిల్చేది. వెంటనే అమ్మతిట్లు మరచిపోయి పరిగెత్తే వాడు. మాలతి మొగుడు తరుచు క్యాంపులకి వెళ్ళేవాడు. ఆయన వూళ్ళో లేనప్పుడు అమ్మని అడిగి తనని సాయం పడుకోబెట్టుకునేది. 'వాడా సాయం మీకు' అని అమ్మ నవ్వేది.

"జాబీ, నీవు బాగా చదువుకుని ఇంజనీరు వవాలి సుమా, లేకపోతే నా కూతుర్ని నీ కీయను!" అనేదిఎప్పుడూ.! 'ఏమండీ, జాబీ మన అల్లుడు తెలుసా' అనేది వాళ్ళాయనతో.

"ఓహో! ... కూతురు లేకుండానే అల్లుణ్ణి సంపాదించే వన్నమాట!" అన్నా డాయన నవ్వుతూ.

సరిగ్గా పేణ్ణర్థమే వున్నారు వాళ్ళక్కడ. ఆ పేణ్ణర్థం మాలతి స్వంత అక్కచెల్లెళ్లూ, తల్లికంటె ఎక్కువగా అనిపించింది.

మాలతి వెళ్ళిపోతూ తనకెన్నో ప్రజంట్సు ఇచ్చింది, రంగుపెన్సిళ్ళు, బొమ్మల పుస్తకాలు, పెన్ను, క్రొత్త లాగు, చొక్కా, ఏవేవో చాలా యిచ్చింది. మాలతి వెళ్ళాక ఓ వారం రోజులు పిచ్చెత్తినట్టు ఎవరితో మాట్లాడకుండా కూర్చున్నాడు.

మాలతి వెళ్ళిన పదిరోజులకి ఒక ఉత్తరం వచ్చింది. అదికాక థర్డు ఫారం చదువుతున్నప్పుడు తనకు ఏదో సరదాపుట్టి ఆవిడకు ఒక ఉత్తరం రాశాడు. దానికి ఆమె దగ్గర్నుంచి వచ్చింది. బాగా చదువుకోమని, అల్లరి చేయవద్దని; ఆ ధోరణిలో అంతే- ఆ తర్వాత మరిలేదు.

ఇలా ఇరవై, ఇరవై రెండేళ్ళ తరువాత తనని జ్ఞప్తికి తెచ్చుకుని ఉత్తరము రాసిందా?...ఆ మాలతే అయితే ఎంత బాగుంటుంది! ... తనని ఎలా పోల్చుకుంటుందో! ... త నెలా ఆవిణ్ణి పోల్చుకోడమో! ... ఆకారం ఏదో లీలగా జ్ఞాపకం వస్తోందిగాని పూర్తిగా కుదరడం లేదు.

* * *

అరగంట ఆలస్యంగా వచ్చింది రైలు.

ఒక్కసారిగా కళ్ళల్లోకి వెయ్యి దీపాలు వచ్చేయి భాస్కరానికి. రైలు స్లో అవుతున్న సమయంలో వీలయినంతవరకు ఏ కిటికీలోంచైనా తన మాలతి పిలుస్తుందేమో నన్నంత ఆత్రుతతో తేరిపార చూశాడు. రైలు ఆగిన తరువాత ఈ కొననించి ఆ కొనవరకు ఒక్కసారిగా చూసేశాడు. ఎక్కడా మాలతి కనపళ్ళేదు. జేబులో ఉత్తరం సెకండుకి కిలోగ్రాముచొప్పున బరువు ఎక్కువ అవుతూంది. ఇదేదో ఏప్రెల్ ఫూల్ ఉత్తరం లాంటిది కాదుకద!

అక్కడ ఆ కంపార్టుమెంటులోంచి ఎవరో చెయ్యి ఊపుతూంది. ఆవిడ కోసం వచ్చినవాళ్ళు ఆవిడని గమనించటంలేదు కాబోలు! అప్రయత్నంగా ఆ కంపార్టుమెంట్ దాటి వెళ్ళాడు.

వెనకనించి 'భాస్కరం' అన్న పిలుపు.

గిరుక్కున తిరిగాడు.

అదిగో మాలతి! క్రిందికి దిగి నిల్చుంది. అచ్చు, అప్పు డెలా వుం

దేదో యిప్పుడూ అలాగేవుంది. ఏం మార్పులేదు. నిన్నా మొన్నా చూసినట్లుంది. గబగబ వెళ్ళి మాలతి చేయి పట్టుకుని సంతోషంగా "మా ల తీ" అన్నాడు. ఆమె మొహం ఎర్రబరుచుకుని, తడపడి చేయి లాక్కుంది.

"అబ్బ! ఎన్నాళ్ళయింది మాలతి నిన్ను చూసి! ... నే నిక్కడ వున్నానని నీ కెలా తెలిసింది!? శ్రమతీసుకుని యింతదూరం నాకోసం వచ్చినందుకు మెనీథాంక్స్!" గుక్కతిప్పుకోకుండా మాట్లాడుతున్నాడు భాస్కరం.

"నేనయ్యా మాలతిని! మా ల తీ అంటూ దాని చే యి ప ట్టు కు న్నా వేమిటి!" వెనకనించి వచ్చిన ఆ మాటలకి అటు తిరిగాడు భాస్కరం.

ఇం దా క కంపార్టుమెంటులోంచి చేయి ఊపిన ఆవిడ! మంచిదేగాని తను మాలతి నంటుం దేమిటి? తను మాలతైతే మరి యీావి డెవరు?

తెల్లబోతూ ఇ ద్ద రి వై పు మార్చి మార్చి చూశాడు భాస్కరం.

ఆ అమ్మాయి సామాను దింపిస్తోంది.

'ఓ! అయాంసారీ' అం దా మ ని భాస్కరం నోటిదాక వచ్చింది. కాని-

"అలా చూస్తా వేమిటి?...అది మా అమ్మాయి వసంత!..." నవ్వుకుంది

"దాన్ని చూసి నే ననుకున్నావా! ... చిత్రమైన వాడివే.

భాస్కరం చేదుమాత్ర మింగినట్లు మొహం పెట్టాడు. ఈవిడ మాలతెలా అవుతుంది?! ... ఇంతలావు ... ఎలా? ఆ రంగు, ఆ నాజూకు ఏమయ్యాయి!? ... ఇంత ముదర మొహం పడిం దేం! జుట్టంతా మూడొంతులు వూడిపోయింది. పల్చగా లోపట్నించి బట్టతల కనిపిస్తోంది. వెనకాల బారెడు వాలుజడకి బదులు పేలవడియం అంత ముడి! ఆ జుట్టూ మూడువంతులు నెరసింది...కళ్ళకి ఓ మాదిరి మంద పాటి దేనని చెప్పాలి, క ళ్ళ జో డు. దానిమ్మగింజల్లాంటి పళ్ళస్థానే ఎడం ఎడంగా పచ్చటిపళ్లు - అందులో పై పళ్లు రెండు కా స్తముందుకు తోసుకు వ చ్చా యి! బాగా లావవడంవల్ల కాబోలు! పొట్టిగా అవుపిస్తోంది. జబ్బ దగ్గిర జాకెట్టు బిగుతుగావుండి కండలు-పైకొచ్చాయి. పొ ట్ట ము దు త ప డి ముందుకు వాలింది. జాకెట్టుకీ, చీరకి మధ్యనడుందగ్గర కొనల్లా వ్రే లా డే చర్మం!..ఈవిడా మాలతి! మాలతేనా!

"అదేమిటి భాస్కరం, అలా చూస్తున్నావు!? ... మారిపోయాననా, బలేవాడివే?...ఇంకా అలాగే వుండిపోతాననుకున్నావా? ... మనిషివి ఎదిగావు కాని నీ మనసింకా ఎదిగినట్టులేదే!"

ఆ కంఠస్వర మేమిటిబాబూ-అలా వుంది? స్వీట్ గామాట్లాడే ఆ మాలతి-వినలేకపోయాడు- భాస్కరం. కాని బలవంతాన నవ్వు మొహం పెట్టాడు.




సామాను పట్టించుకుని స్టేషను బయటికి వస్తూంటే ఆవిడ అలా మాట్లాడుతూనే ఉంది. "ఈ మధ్య మీ కజిన్ అట - ప్రసాద్ - అతను మా ఊళ్లోనే వున్నాడుకదూ...పరిచయం అయిందిలే ... అతని ద్వారానే నీ సంగతి తెలిసింది ... అతనే ఇచ్చాడు నీ ఎడ్రస్ !"

భాస్కరం చెవినపెట్టు ఎక్కడంలేదు. యాంత్రికంగా నడుస్తున్నాడు, ముందు నడుస్తున్న మాలతివైపు-అదే వసంతవైపు-చూస్తూ.

ఇరవైయేళ్ళ క్రిందటి మాలతి ఇలాగే ఉండేది.

"మా పినమామగారి కూతురిపెళ్లికి రేపు...ఎలాగో ఈ వూరు వస్తూ, నువ్వు వున్నావని తెలిశాక చూడకుండా ఎలా వుంటాను ... అందుకే రాశాను ... ఆయనకి శలవుదొరకలేదు. అందుకు నేనొచ్చాను ... వసంతకి శలవులే కదా అని...ఊఁ...అయితే మొత్తంమీద నేననట్టుగానే ఇంజనీరు వయ్యావన్న మాట!" అని గుంభనగా నవ్వింది.

భాస్కరం గుండె ఝల్లుమంది ... తాననట్టుగా ... కూతుర్ని ఇస్తానం టుందా మళ్ళీ?...

"ఊఁ...ఇంకా బ్రహ్మచర్యమే పాటిస్తున్నావన్నమాట! ఎక్కడుంటున్నావు. క్వార్టర్సు ఉందా నీకు? రేపు పెళ్ళి అదీ హడావిడి అయ్యాక మీ యింటికి వస్తాలే...నీ ఇల్లెక్కడో ఓ కాగితంమీద రాసియ్యి. నీతో చాల మాట్లాడాలి ... ఎల్లుండి సాయంత్రం ఎక్కడికి వెళ్ళిపోకు..." రిక్షా ఎక్కే వరకు గలగలమాట్లాడుతూనే ఉంది.

కాళ్ళీడ్చుకుంటూ ఇంటిమొఖం పట్టాడు భాస్కరం. మాలతిని చూడకుండా ఉంటే ఎంత బాగుండేది? తన స్మృతిపథంలో మాలతి ... మాలతిలా వుండిపోయేది ... ఆనాటి అందమైన

మాలతి ఇప్పుడు లేదు...కాలం ఎలాంటి మార్పులని తెస్తుంది! ఇంత క్రూరంగా కాటువేస్తుందా కాలం!...అన్యాయం!

తన ఆలోచన తనకే అసందర్భంగా ఉన్నట్లు అనిపించింది భాస్కరానికి. తనపిచ్చి కాకపోతే ఇందులో ఏం వింత వుందని! మనిషిలో ఇరవై ఏళ్లకి రావలసిన మార్పే మాలతిలో వచ్చింది!... పుట్టినవాళ్ళు పుట్టినట్లే వుండిపోరు గదా!...కాని...ఏమిటో ఈ మార్పుకు గురికాకుండా మాలతి అంత అందమైన మనిషికూడా తప్పించుకోలేక పోవడం అన్యాయం!

గుండెలో ఏదోపోటు!...ఈమార్పు ...ఇవాళ నవవసంతంలో విచ్చిన పూవులావున్న వసంతకి కూడా తప్ప దన్నమాట!... వసంత కూడా ... లావుగా..చర్మం తొనల్లా వ్రేలాడుతూ పళ్లు ఎడంఅయి, జుట్టు పల్చబడి ... ఇంత అసహ్యాంగానూ అయిపోతుందా? ...ఘోరం!

భాస్కరం కళ్ళు అతనికి తెలియకుండానే మూసుకున్నాయి. ఆ మూసుకున్న కళ్ళకి కూడా అందంగా నవ్వుతున్న పువ్వులాంటి వసంత కనిపించలేదు. మోటుగా, లౌక్యంగా నవ్వుతున్న మాలతి కనిపించింది...

ఆ రాత్రంతా పెర్ముటేషన్స్-అండ్ కాంబినేషన్స్‌లాగ మాలతి – వసంతా, ఆమెప్రక్క నీమె – ఈమె చుట్టూ ఆమె-ఇలా అల్లిబిల్లిగా అస్పష్టమైన ఆకారాల్లో కనపడ్డారు.

*　　*　　*

"ఇద్దరే ఆడపిల్లలు కనక మంచి సంబంధాలు చెయ్యాలని మా కోరిక" అన్నది మాలతి.

"ఊఁ..."

ఎంత సేపట్నుంచో సంభాషణ సాగుతోంది. భాస్కరం పరధ్యానంగా ఊ కొడ్తున్నాడు. అప్పుడప్పుడు ముక్తసరిగా సమాధానాలు చెపుతున్నాడు. ఆమె, భాస్కరం తల్లిదండ్రుల ఆరోగ్యం దగ్గర మొదలుపెట్టి, చెల్లెలికి చేసిన సంబంధం, పెట్టిన కట్నకానుకలు అన్నీ అడిగి...వసంత తెలివితేటలు, బి. ఎస్సీ. పరీక్షలో క్లాసు వస్తుందన్న సంగతి వెల్లడించి ... ఆఖరికి డిపార్టుమెంటు సీనియారిటీ లిస్టులో అతని పొజిషన్ గురించి కూడా భోగట్టా చేసింది.

ఆయనకి ఇంజనీర్లంటేనే మోజు. ఇంజనీరు అల్లుడికోసం వెతుకుతున్నారు.

"అలాగా!"

"నువ్విక్కడున్నావని తెలిసి నేనెంత సంతోషించాననుకున్నావు! నువ్వు ఇంజనీరు వయ్యావని తెలిసినాక మరీననుకో. ఇంకేం-చిన్ననాడు అనుకున్న మాట నిజం అయిపోతూందని పొంగిపోయాను!"

"........."

"మరింకెందుకు! ఇంత దూరం

వచ్చి, ఇంత పరిచయం వుండి ఇంక ఫార్మాలిటీస్ పట్టుకుని వేళ్లాడ్డం నా కిష్టంలేదు. నీకూ అవి అంత యిష్టం కాదనుకుంటాను..."

"అవునౌను..."

"వసంతని చూశావుగా ... అఫ్ కోర్సు-అయన అన్నారనుకో. పెళ్ళి చూపుల పద్ధతిప్రకారం ఏర్పాటు చేద్దామని...కాని అవన్నీ అక్కర లేదని నేనే ఇలా...దాన్ని తీసుకొచ్చే శాను...నీవేం క్రొత్తవాడివా..."

మాలతి అంత లౌక్యంగా మాట్లాడు తూంటే గుడ్లప్పగించి ఊరుకున్నాడు భాస్కరం.

"నువ్వు 'ఊ' అంటే-మీ యింటికి రాయమంటాను ఆయన్ని!" అంటూ తనే నిశ్చయం చేసేసినట్లు మాలతి మాట్లాడుతూంటే వెంటనే కాదని కూడా అన్లేకపోయాడు భాస్కరం.

"ఏమిటంత ఆలోచన?" నవ్వుతూ కమాండింగా అన్నది మాలతి...అబ్బే ...ఏంలేదు ... నేను రాస్తాగా!" ఆ రాయడం అతని తల్లితండ్రులకో, మాలతికో అతనికే అర్ధంగాలేదు. మాలతి ఒక్కక్షణం తెల్లబోయినట్లు చూసింది. తరువాత పెద్దపెట్టున నవ్వింది.

"ఏంబెట్టు మహానుభావా! మగవాడి ననిపించుకున్నావు! అందులోనూ కాబోయే అల్లుడివాయె మరి...సరేలే రేపు నేను వెడుతున్నాను ... ఏదో ఆడపిల్లల వాళ్ళం ... మా ఆత్రుత మాది. రెండుమూడురోజుల్లో వ్రాయి. ...వసంతకేం...దానిగురించి మాకేం బెంగలేదనుకో!..."

నిజమే దానికేం ... పెద్ద ఇంజనీరు కూతురు ... ఇంజనీరు భార్యకూడా కావచ్చు...

కాని—

మాలతిని చూడకుండా ఒక్క వసంతనే చూసివుంటే ఎంత బాగుం డేది! తల్లీకూతుళ్ళు వెళ్ళాక, భాస్క రానికి, అద్దంలో తనరూపం తనకే చెదిరిపోయినట్టుగా కనపడ్డది.

* * *

నాలుగురోజుల తర్వాత, మాలతికి ఉత్తరం రాశాడు భాస్కరం.

ఆ ఉత్తరం అందుకోగానే మాలతి ముఖం, ముందు చాటంతకావచ్చు. కాని, దాన్ని చదువుకొన్న ఉత్తర క్షణంలో, ఆమెముఖం నల్లపడొచ్చు. అంతలో ఎర్రపడొచ్చు. రంగులు మారొచ్చు ... "మా వసంత కంటె ఇంకెంత అందమైనదాన్ని పెళ్లాడ తాడో చూడకపోతానా?" అంటూ చిందులు తొక్కొచ్చు!

ఏమయినా భాస్కరం, తను వసం తను ఎందుకు చేసుకోననిరాశాడో, మాలతికి అర్ధమై ఉండదు. అర్థం అయ్యేటట్లు రాయడంమట్టుకు భాస్క రానికి ఆ క్షణంలో చాతకాలేదు.★


నవలలు
డిటెక్టివ్ సాహిత్యం
ఈ పుస్తకం చదవండి! చాలా బావుంటుంది సార్!!
దారి


సార్సార్! ఇందాకే సెంటర్లో ఓ యాక్సిడెంట్ యమ ఘోరంగా జరిగింది సార్!



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

నేను తెల్లబోయాను.

గతుక్కు మన్నట్టు చూశాను,

అతను మరెవరో కాదు. విలన్ కృష్ణారావు.

నాకు నోట్లోంచి మాటరాలేదు.

చటుక్కున ముఖం తిప్పుకుని గదిలోకి వచ్చేశాను.

పది నిముషాల్లో రాజేశ్వరి వచ్చింది.

నేను చప్పున ఎదురువెళ్ళి రాజేశ్వరిచెయ్యి గట్టిగా పట్టుకుంటు,

"మీ అన్నయ్య యితనా! యీ విలన్ కృష్ణారావా?" అన్నాను.

"మా అన్నయ్యే. కానీ విలనేమిటి?" అంది రాజేశ్వరి తెల్లబోతూ.

"ఇలారా, నేను చెబుతాను." రాజేశ్వరిని చెయ్యిపట్టి లాక్కెళ్ళి మంచంమీద కూర్చోపెట్టి జరిగినదంతా క్లుప్తంగా, వినసొంపుగా, అందమైన మాటలతో చెప్పేశాను.

రాజేశ్వరి పయిటకొంగు నోటికి అడ్డం పెట్టుకుని నవ్వసాగింది. నేనుకూడా శృతికలిపాను.

"తనెవరో నేను గుర్తుపట్టేందుకు అసలు - కృష్ణారావు అనే అతను ఈ ఇంట్లో వున్నట్టు తెలిస్తేనా! నాకోసం వచ్చిన పెద్దమనిషి తను ఫలానా అని పరిచయం చేసుకోకూడదూ? తప్పా! పరువునష్టమా అది."

## జరిగిన కథ

నన్ను, తన మేనల్లుడైన సారథి కివ్వాలని మా అమ్మకోరిక. ఆ సంబంధం, నా కిష్టంలేదు. అముక్కే నాన్నగారికి స్పష్టంగా చెప్పేశాను. సారథి మా యింటికి రాబోతున్న సమయంలో, మా అమ్మ, పైవూళ్ళకు వెళ్ళవలసి వచ్చింది. సారథిని తప్పించుకోవాలన్న నా ప్రయత్నాలు గమనించి, నాన్న గారు, నిమ్మలూరులో మా మేనత్త దగ్గరకు వెళ్ళమన్నారు. నిమ్మలూరు డొంక దగ్గర బస్సుదిగాక, కృష్ణారావనే ఒక అపరిచితవ్యక్తి, నా ప్రమేయం లేకుండానే రెండెడ్లబండి కుదిర్చాడు. ఇంకోమార్గం లేక అందులోనే నిమ్మలూరు చేరాను. మేనత్తగారి యింట్లో కాలు పెట్టగానే, నా కంతా ఆత్మీయులల్లే కనబడ్డారు. పట్నవాసంనుంచి వచ్చిన నాకు పల్లెటూరి సంస్కారం కొంత ఎబ్బెట్టుగాఉన్నా, నిష్కల్మషంగా ఉన్నట్టు తోచింది. వాళ్ళంతా నన్ను తమలో కలిపివేసుకు న్నారు. వాళ్ళ నిరాడంబరత, అతిశయంలేని స్వభావం నన్నాకర్షించాయి. వాళ్ళ మాటలనుబట్టి చూడగా, ఆ పిల్లలకొక అన్నయ్య ఉన్నట్టు తేలింది. స్నానం, భోజనం ముగించి, ప్రయాణపు బడలికతో గదిలో నిద్రపోయినాను. నిద్రలేచేసరికి మగగొంతు వినపడ్డది. నేను గుమ్మంలోకిరాగానే అప్పుడే భోజనం ముగించి ఇటే వస్తూ అతను ఆగిపోయినాడు.

క్షణంసేపు మా యిద్దరి చూపులూ కలుసుకున్నాయి. అతడు నవ్వబోయి మానేశాడు.... — ఇక చదవండి

---

"అన్నయ్య అలా యెప్పుడూ చేయడే. నిన్ను ఆట పట్టించటానికి అలా తెలియ నట్టు వూరుకున్నాడేమో" అంది రాజేశ్వరి.

"ఊరుకున్నవాడు వూరుకోకుండా అత్తయ్యతో నామీద ఫిర్యాదు చేస్తాడెందుకు? పైనుంచి నన్నిక్కడినుంచి పంపేయమని మీ అమ్మకి సలహాలు కలవిస్తున్నాడే." మధ్యలో నవ్వు ఆపేసిన నేను సీరియస్‌గా అడిగేశాను.

రాజేశ్వరి ముఖంలో నవ్వు, ప్రసన్నత వూదేసిన దీపంలా ఆరిపోయింది.

క్షణంసేపు సమాధానం ఏమీ చెప్పలేని అశక్తురా లయిపోయింది.

స్పోర్టివ్‌గా నేనే మళ్ళీ అనేశా. "ఫర్వాలేదులే. నేనేమీ అనుకోనులే. ఇది మా అత్తయ్య యిల్లు. నా యిష్టం వచ్చినన్నాళ్లు వుంటాను. వెళ్ళమనటానికి, వుండమనటానికి ఆత నెవరు మధ్య?" చివరిమాటలు కావాలని కాస్త బిగ్గరగానే అన్నాను.

రాజేశ్వరి ఖంగారుగా, భయంగా గుమ్మంవైపు చూసింది.

"నేను వచ్చింది విలన్ కృష్ణారావు యింటికి కాదని, మా నాన్న స్వంత చెల్లెలయిన మా అత్తయ్య దగ్గరకని బాగాగుర్తు పెట్టుకుంటాను."

రాజేశ్వరి నా చెయి పట్టుకుంటూ ఎర్రబడిన ముఖంతో అదుర్దాగా "వదినా! అన్నయ్య తమాషాకి అన్నాడు. నువ్వా మాటలు మనసులో పెట్టుకోకు." అంది.

"నిజంగా అన్నా, నేను లక్ష్యపెట్టనని చెబుతున్నాగా," అన్నాను నిర్లక్ష్యంగా.

రాజేశ్వరి ముఖంలో బాధచూస్తే నాకు జాలేసింది.

"నేనూ వూరికే అన్నాన్లే. నువ్వేమీ బెంగారుపడకు."

రాజేశ్వరి ముఖం ప్రసన్నం అయింది.

రాజేశ్వరి తృప్తికోసం పైకి అలా అన్నాను కానీ నేను చస్తే ఆ మాట మర్చిపోతానా! కృష్ణారావు నిజంగా విలనే... లేకపోతే నేను అచ్చు మా అమ్మ నోటి నుంచి వూడిపడ్డానంటాడూ! నా సంగతి తన కేం తెలుసని. రెండోది _ నాకు తనెవరో చెప్పకుండా, చనువు ప్రదర్శించి, నన్ను బెంగారుపెట్టి ఆట పట్టిస్తాడూ! మిష్టర్ కృష్ణారావ్ ఐవిల్ టీచ్ లెసన్ టుయూ, అనుకున్నాను.

నేను నిమ్మలూరులోవున్నది వారం పదిరోజులే; కానీ యీ స్వల్పవ్యవధే నా జీవన స్రవంతిని విభిన్నమార్గానికి తిప్పింది, నా భవిష్యత్‌కి ఒక మైలు రాయిగా

నిలబడిపోయింది. మనిషి మనుగడలోని మహావిచిత్రం అదే. రోజులు, వారాలు, సంవత్సరాలు, అసంఖ్యాకంగా ఎలాటి మార్పు లేకుండా జరిగిపోతూవుంటాయి; కానీ ఎక్కడో ఒక చోట చిన్న మెలిక ఏర్పడుతుంది. దానినుంచి తప్పించుకోటానికి శక్తికొద్దీ గింజుకుంటాడు మనిషి - ఆ తర్వాత అది జీవితంలో ప్రధానాంశం అయి కూర్చుంటుంది.

దాదాపు ఇరవై సంవత్సరాలు అమ్మ సొసైటీలో నేను నేర్చుకోలేనివి, గుర్తించలేనివి యిక్కడ గమనించటం జరిగింది. అవి అతిచిన్న విషయాలే కావచ్చు. మామూలు జీవితంలో వాటికి అట్టే ప్రాధాన్యత లేకపోవచ్చు. కాని వాటి ప్రభావం మనమీద మనకి తెలియకుండానే అపారంగా ఉంటుందనేది మరువకూడని సత్యం.

నేను వచ్చిన ఒకటి రెండు రోజులలో కమలత్తయ్య - రాజేశ్వరి మధ్యగల అనుబంధం ఎంత సున్నితమైందో, ఎంత విలువైనదో గ్రహించాను. నిజానికి అత్తయ్య అసలు మితభాషిణి.

ఆవిడ యింటి విషయాలగురించి పెద్ద కొడుకుతో అప్పుడప్పుడు చెప్పటం తప్ప మిగతా వేళల్లో అట్టే మాట్లాడినట్టుగాని, అసలు మాట్లాడాలని ఆసక్తి వున్నటుగాని నాకు కన్పించలేదు.

కానీ పిల్లల్ని, రాజూ, మధూ, మణీ అని పిలవటంలోను, ఆ పిలుపులోను నాకు సృష్టిలోని మాతృత్వపు మమత అంతా ప్రతిధ్వనిస్తున్నట్టుగా కన్పించేది.

వాళ్ళమధ్య అవసరమైన అతిమర్యాదలు లేవు.

మనసులో ఒకటి వుంచుకుని పెద్దలముందు మన్నన కోసం మరోటి మాట్లాడాల్సిన అవసరమే లేదు వాళ్ళకి. పిల్లలు పిల్లలుగానే వున్నారు. తల్లి అంటే తల్లిలాగానే వుంది. మళ్ళీ అత్తయ్య అంత చదువుకున్న మనిషికూడా కాదు. పిల్లల పెంపకం విషయంలో ఆవిడ అట్టే శ్రద్ధ తీసుకుని, క్రమశిక్షణతో తీర్చి దిద్దినట్టు కూడా నాకు కన్పించలేదు. ఎప్పుడూ యింటిపనులతో మునిగితేలుతూ, వంటా వార్పూతో సతమతమయే మనిషిలా వుంది.

అయినా సరే! పిల్లలంతా బుద్ధిమంతులుగానే వున్నారు. ఎవరిపనులు వాళ్ళు చేసుకుపోతారు. ఏ వేళప్పుడు ఎలా ప్రవర్తించాలో వాళ్ళకి క్షుణ్ణంగా తెలుసు. ఒకటి మాత్రం నిజం. మా యింట్లో నాకు జరిగినంత గారాబం యిక్కడ వీళ్ళెవ్వరికీ లేదు. అమ్మా, నాన్నగారు, నౌకర్లు అంతా నన్ను అందలం ఎక్కించి, అత్యంత వున్నతంగా చూస్తారు. యిక్కడ వీళ్ళ అవసరాలు తీర్చటం మినహా యిక వాళ్ళగొడవే ఎవ్వరూ పట్టించుకోరు. కానీ, వీళ్ళకి యీ యింట్లో వున్నంత

చనువు, స్వతంత్రం నాకు మా యింట్లో వున్నాయా అని అనుమానం రాసాగింది, నేను ఏ పని చేయబోయినా లక్ష వైపులు ఆలోచిస్తాను.

నేను చేయబోయే పని నాన్నగార్కి నచ్చుతుందా?

అమ్మ ఏం బాధపడదుకదా?

తాయారమ్మా వాళ్ళు ఏమీ అనుకోరుకదా!

నేను నలుగురిలో నవ్వులపాలు అవనుకదా?

యిలా నా ఆలోచనలు పరిపరివిధాలు పరుగులు పెడతాయి.

పాదరసంలా చేతినుండి జారిపోయే యీ ఆలోచనలు తిరిగి చేజిక్కించుకునే లోపలే ఆ పుణ్యకాలం కాస్తా గడిచిపోయిన సమయాలు, ఆ తర్వాత నాకెందుకూ పనికి రావని నాలోనేను మథనపడిన సన్నివేశాలు చాలావున్నాయి.

ఒక్కమాటలో చెప్పాలంటే అచ్చు నేను వూహించి కావాలని కలలుకనే తల్లిలా వుంది కమలత్తయ్య.

రాజేశ్వరిని చూస్తే మా అమ్మ తను కోరుకునే కూతురు యిలా వుండాలని అనుకుంటుందేమో!

రాజేశ్వరి, పిల్లలు, అంతా నన్ను వదినా అని పిలుస్తారు.

ఆ 'వదినా' అన్నపిలుపులో నాకు ఆప్యాయత, ఆదరణ, చనువు, స్నేహం ఎన్నెన్నో కన్పిస్తున్నాయి.

పట్నంలో ఎప్పుడూ 'మిస్. మీనా' అని పిలిపించుకోటానికి అలవాటుపడిన నాకు యీ బంధుత్వాన్ని సూచించే పిలుపు వీనుల విందుగా వుంది.

వచ్చినరోజురాత్రి, కృష్ణ పడుకునేమంచంతెచ్చి నాకు విడిగా పక్కవేసే ఏర్పాటు చేస్తుంటే, నేనే వద్దని తిరస్కరించాను.

పిల్లలందరిమధ్యా రాజేశ్వరి ప్రక్కన బెడ్డింగ్ పరుచుకుని పడుకున్నాను. కృష్ణ అవతలిగదిలో తన పక్కమీద పడుకున్నాడు.

అత్తయ్య పిల్లలకి ఆ చివరగా గుమ్మందగ్గరగా పడుకుంది బైట సన్నగా వాన పడుతున్న శబ్దం విన్పిస్తోంది. రాజేశ్వరీ, నేనూ చీకటిలో కంఠాలు తగ్గించి, ఎవరికీ నిద్రాభంగం కాకుండా చాలాసేపు మాట్లాడుకున్నాం.

రాజేశ్వరి మా అమ్మగురించి, నాన్నగురించి, నా కాలేజీగురించి, నా స్నేహితుల గురించి ఎన్నెన్నో కబుర్లు అడిగింది.

నాకు ప్రాణస్నేహితులంటూ ఎవరూ లేరని నేనంటే రాజేశ్వరి నమ్మనేలేదు.

కొంతసేపటికి రాజేశ్వరి నిద్రపోయింది,

బైట చిన్నగా శబ్దం చేస్తూ పడుతున్న వాన చప్పుడు వింటూ, నిద్రపోతున్న రాజేశ్వరి చేయి గట్టిగా పట్టుకుని పడుకునివున్న నేను చాలాసేపు మెలకువగానే వుంది

పోయాను. మాకు పోల్చిచూస్తే వీళ్ళు చాలా లేమిలో వున్నట్టే లెఖ్ఖ కానీ వీళ్ళని ఆలేమి ఏమీ బాధిస్తున్నట్టుగా నాకు కన్పించలేదు. వీళ్ళింట్లో ఖరీదయిన వస్తువులు లేవు. నిజమే! కానీ, వీళ్ళందరి ముఖాల్లో ఒక అనిర్వచనీయమైన తృప్తి, కాంతి స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఎంత బాధాకరమూ, జుగుప్సాభరితం అని చెప్పబడే లేదరికాన్ని వీళ్ల తెలివిగా, యుక్తిగా, మచ్చిక చేసుకున్నట్టు కన్పించసాగింది.

* * *

మర్నాడు.

పిల్లలంతా భోజనం చేసి స్కూలుకు వెళ్ళిపోయారు. నేనూ, రాజేశ్వరీ కూడా తినేశాం.

రాజేశ్వరి వంటయింట్లో అత్తయ్యకేదో సాయం చేస్తోంది, నేను గదిలో కూర్చుని నాన్నగారికి వుత్తరం వ్రాస్తున్నాను.

నాన్నగారూ!

నిమ్మలూరు వచ్చేసాను.

అప్పుడే ఒకరోజుకూడా అయిపోయింది.

ఈవూరు, యీ పరిసరాలు నాకు అద్భుతంగా వున్నాయి. అత్తయ్య నాకు చాలా నచ్చింది.

రాజేశ్వరీ, నేనూ ఒకటి రెండురోజుల్లో శరీరాలు వేరయినా ప్రాణం ఒకటిగా ఐక్యమైపోతాం!– అనటానికి ఏమాత్రం సందేహం లేదు.

మొదటి చూపులోనే రాజేశ్వరీ, నేనూ ఒకరిని ఒకరం గాఢంగా ప్రేమించుకున్నాం.

పిల్లలంతా నాకు నచ్చారు.

మీరు చెప్పని – ఏనాడూ మాటవరసకి కూడా – అత్తయ్య యింట్లో కృష్ణఅనే వ్యక్తి ఒకడున్నాడని, అతనిమీద యీ సంసారం చాలా ఆధారపడి వుందని, పొరపాటున కూడా నాకు మీరు తెలియనీయని ఆ వ్యక్తి సంగతి నాకు అనవసరం. అందుకే అతని ప్రసక్తి యీ వుత్తరంలో స్ట్రయిక్ అఫ్ చేసేస్తున్నా–నాకు ఒకరకంగా మీ మీద అంతులేని కోపంగా వుంది.

యింకోరకంగా మితిలేని కృతజ్ఞతతో చేతులు జోడిస్తున్నాను. కోపం ఎందుకంటారా?

ఇన్ని సంవత్సరాలు యింత ఆత్మీయులనుంచి నన్ను దూరంచేసి మీరు వంచించినందుకు,

యిన్ని రోజులకైనా యీ అవకాశం నాకు లభింప చేసినందుకు కృతజ్ఞత.

అమ్మ దగ్గరనుంచి వుత్తరం రాగానే నాకు టెలిగ్రాం యివ్వడం మర్చిపోకండి;

సర్వదా మీ ఆశీర్వచనములు కోరే మీ కుమార్తె,

'మీనా.'

వుత్తరం కవరులో పెట్టి అంటిస్తుండగా, గదిలోకి రాజేశ్వరి వచ్చింది.

వస్తూనే, 'వదినా! అన్నయ్యకి అన్నం తీసుకువెడుతున్నాను. నువ్వుకూడా వస్తావా నాతో' అంది.

కవరుమీద అడ్రస్ వ్రాయబోతున్న నేను తలెత్తి చూశాను.

ఎదురుగా నిలుచునివున్న రాజేశ్వరిచేతిలో నాలుగు గిన్నెలది జర్మన్ సిల్వర్ క్యారియర్ వుంది.

"అదేం? భోజనానికి యింటికిరాడా?" అన్నాను.

"పని చాలావుంటే రాడు. వస్తావా నువ్వు– యిద్దరం కలిసి వెళ్ళవచ్చు. ఎక్కువ దూరం లేదు డొంకవెంబడి వస్తుంటే మీ బస్తీవాళ్ళు షికారుకి వెళ్ళినట్టు సరదాగా వుంటుంది. నువ్వు మాతోట చూసినట్టు కూడా వుంటుంది," అంది.

"తోటా ? అంటే — పూలతోటా ? ఏ ఏ పూలున్నాయి ?" అన్నాను ఉత్సాహంగా.

రాజేశ్వరి ముఖం చిన్నబుచ్చుకున్నట్టు తల దించుకుని "పూలతోటకాదు, కూరగాయలతోట." అంది.

"ఓస్. కూరగాయలా !" అనబోయిన నేను నాలికచివర మాట నాపుకుని 'సరే. పద' అన్నాను.

నేను వెళ్ళి, మూలనున్న చెప్పులు వేసుకుంటుంటే, రాజేశ్వరి యిబ్బందిగా చూస్తూ, "చెప్పులు వదిలేస్తేనే బాగుంటుందేమో ? వదినా, మనం వెళ్ళేదోవలో మధ్యమధ్యలో నీళ్ళు. బురదా వుంటాయి. అవి పాడయిపోతాయేమో ?" అంది.

చెప్పులు లేకుండా నేను యింట్లోనే నడవను.

"చెప్పులు వదిలేసిన పాదాలతో గచ్చు నేలమీద నడిస్తేనే నా కేమిటోగా వుం

టుంది, అలాటిది - ఈ ఆరుబయలులో, యీ బురదలో పాదం పెడతానా". రాజే శ్వరి భయం నేను గ్రహించాను.

బంగారంలా మెరిసిపోతూ, సుకుమారంగా వున్న యీ జరీ చెప్పులు, బురదకి, ఆ నీళ్ళకి పాడవుతాయని భయమేమో !

ఇవిపోతే యింకోటి కొనుక్కుంటాను. అంతేగాని ! కాళ్ళకి అవి లేకుండా నడవటమే !

అందుకే రాజేశ్వరి హెచ్చరికకి, జవాబుగా చిరునవ్వు నవ్వేసి నేను బైలు దేరాను.

బైట వాతావరణం చాలా హాయిగా వుంది. వాన పడటంలేదుగానీ ఇంకా దట్టంగా పట్టిన మబ్బులు విడిపోలేదు. గాలి రంయ్ రంయ్మని వీస్తోంది.

మేం వెడుతున్నదారిలో అక్కడక్కడా చిన్నచిన్న కాలవలున్నాయి. వాటిల్లో ఎక్కడినుంచో వస్తున్న వాననీరు సర్రున ప్రవహిస్తూ పోతూంది. నీళ్లు నిర్మలంగా అడుగుని యిసక కన్పిస్తూ స్వచ్ఛంగా వున్నాయి. అవి వచ్చినప్పుడల్లా, నేను రాజేశ్వరి హెచ్చరికతో చెప్పులు తీసుకుని చేత్తో పట్టుకుని, చీరకుచ్చెళ్ళు మరోచేత్తో మోకాళ్ళవరకు పట్టుకుని నడిచాను, రాజేశ్వరి వద్దన్నా వినకుండా నే నెక్కడ పడిపోతానో అన్నట్టు నా చేయి గట్టిగా పట్టుకునేది. కాలవలుదాటి, డొంకవెంబడి సాగినబాట చాలా అందంగా వుంది. ఎటుచూసినా, ఆకుపచ్చగా, సజీవంగా, కమలపండువగా వుంది.

తీరా తోటదగ్గరికి వచ్చేసరికి నాకు హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది.

ఆరోజు నేను వచ్చేటప్పుడు కృష్ణ బండీలోంచి దిగి వెనక్కితిరిగి చూడనైనా చూడకుండా వుడాయించింది యీ తోటలోకే కాబోలు!

"పువ్వులు లేవన్నావు. యింత మంచివాసన ఎక్కడినుంచి వస్తోంది ?" అన్నాను తోటలో అడుగు పెడుతుండగా. అక్కడ మరీ చిత్ర విచిత్రమైన సువాసనలు గాలిలో తేలివస్తున్నవి. గుండెలనిండా అప్రయత్నంగా గాలి పీల్చుకున్నాను.

"పువ్వులున్నాయి. అసలు లేకపోలేదు," అంది రాజేశ్వరి.

ఇద్దరం తోటలోకి వచ్చాం.

ఆ ప్రదేశం అంతా ఎన్నెకరాలో, దాని వైశాల్యం ఎంతవుంటుందో నాకు తెలియదుగానీ, కనుచూపు మేరవరకూ అన్నీ చెట్లున్నాయి. వాటిలో పనస, జామ, నిమ్మ, మొదలుకుని, శీతాఫలం, ములగచెట్ల వరకూ వున్నాయి.

ఆ చెట్లని జాగ్రత్తగా పహరావేస్తూ, కోటగోడలా రక్షణ కల్పిస్తునట్టు, 5, 6

అడుగుల ఎత్తువరకూ ముళ్ళున్న యినుపతీగె అల్లబడి వుంది ఆ తీగెకి, పెద్ద పెద్ద సూదుల్లాటి ముళ్ళతో, అడివితీగె దట్టంగా పాకించివుంది.

తెలియక ఏ అమాయకుడైనా ఆతోటలో ప్రవేశించి, ఏపళ్ళో, పువ్వులో ఎత్తుకుని కంచెమీదుగా పారిపోవాలంటే ఆ ముళ్ళతీగె వంద యింజక్షన్‌లు ఒకేసారి గుచ్చుతుంది. వాడిప్రాణం హరీమనాల్సిందే. ఎదురుగా పెద్ద వేపచెట్టుంది. దానిచుట్టూ ఎత్తుగా గట్టులాకట్టి, గచ్చుచేసి నునుపుచేసారు.

వేపచెట్టుకెదురుగా, పెద్ద పాకవుంది; ఆ పాకమీద, బీర, సొరపాదులు పాకివున్నాయి. అవేం కన్పించకుండా పూవులున్నాయి. గడ్డికప్పిన ఆ తాటాకుల పాకమీద ఆతీగెలు వింత సోయగంతో వూగులాడుతున్నట్టుగా అన్పించింది నాకు. రాజేశ్వరి క్యారియర్ తెచ్చి వేపచెట్టుదగ్గరున్న గట్టుమీద పెట్టింది. ఆ చుట్టుప్రక్కల మాకెవరూ కన్పించలేదు.

"అక్కడ వున్నట్టున్నారు. రా," అని నేను వెంటరాగా అటువైపు వెళ్ళింది. పాకకి కుడివైపుగా కొన్నిగజాలు దాటివెళితే అక్కడంతా కూరగాయ మొక్కలున్నాయి.

నేను క్షణంసేపు వూపిరి పీల్చటం మర్చిపోయిన దానిలా అలాగే నిలబడ్డాను.

అక్కడ తోటకూర నుంచి, కాబేజి, కాలిఫ్లవర్ వరకూ అన్ని కూరగాయలు వున్నాయి. వాటన్నిటికి ఎడమవైపుగా పెద్దగా చేసిన మడిలో కృష్ణ, మరోయిద్దరు కలిసి చిన్న చిన్న మొక్కలు వరసగా, క్రమపద్ధతిగా పెడుతున్నారు.

"ఏమిటా మొక్కలు?" అని అడిగా రాజేశ్వరిని.

"వంగ, టమాటా" అంది.

వంగి పనిచేస్తున్నవాళ్ళు వెనకవచ్చి నిలబడిన మా యిద్దరినీ చూడలేదు.

"అన్నయ్యా! అన్నంతెచ్చా," అంది రాజేశ్వరి,

రాజేశ్వరిగొంతు అసలే మృదువుగావుంటుంది. దానికితోడు అన్నగారితో మాట్లాడేప్పుడు వుండే, అణకువా, నమ్రత యింకో వింతమాధుర్యాన్ని తెచ్చిపెట్టాయి. కృష్ణతో మాట్లాడేటప్పుడు రాజేశ్వరి మాటల్లో ఒక విధమైన గారాబం ప్రతిధ్వనించటం కూడా నేను గమనించకపోలేదు. చేతులనిండ, మట్టితో వున్న కృష్ణ వెనక్కి తిరిగిచూశాడు ఆపేక్షగా. చెల్లెలివైపు చూసిన ఆకళ్ళు ప్రక్కనే నిలబడివున్న నన్ను గమనించగానే చిట్లించినట్టు వెంటనే అవతలకి తిరిగేసినాయి.

(సశేషం)

Printed and published by A. Sudhakara Rao for Yuva Publications, Hyderabad -1
and printed at Yuva Press, Public Garden Road - Hyderabad - 1. Phone 36336
Controlling Editor: Sri "CHAKRAPANI"

# నన్ను మరిచిపోబోకండి




నేను మీ జీవిత భీమా పట్టాను. మీరు జ్ఞాపకం వుంచుకోవలసిన ప్రేమ పాత్రమును. మీకు, మీ పైన ఆధారపడివున్న వారికి భద్రతా చిహ్నాన్ని. కాగా, నన్ను అప్పుడప్పుడు గుర్తు చేసుకుంటూ వుండండి. కింది విషయాలను పరిశీలించండి.

- ఆమోదించబడిన మీ వయస్సు
- మీ చిరునామాలో మార్పు
- పట్టా ఫలితం పొందవలసినవారి పేరు

మిమ్ము ఇబ్బంది పెట్టడం నాకు సుతరామూ ఇష్టంకాదు. అందుచేతనే నేడే పరిశీలించండి. సరియైన కార్యాలయంలో సకాలంలో ప్రీమియం చెల్లించండి.



**జీవిత బీమాకు ప్రతిగా మరొకటి లేదు**

